# HISTORY
# MEDIEVAL INDIA
## T/M
## UPSC CSE MAINS

## VOLUME-I

NOTES OF
## PALLAVI AKURATHI, IAS
AIR-55 (CSE-2008)


## SRINIVASA XEROX
## PROP: M.CHENCHI REDDY
ASHOKNAGAR X ROADS, HYD-20.
## 9246577890,9949833833

# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజయం సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్లో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్‌**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

**Books that I referred to prepare this material**

# MEDIEVAL INDIA

1. Satish Chandra 2 volumes***
2. Mehta 3 volumes
3. NCERT
4. IGNOU***
5. Brilliant
6. Gopala Reddy
7. Ambedkar Open University
8. P.G. Guides
9. Publications Division (Majumdar & Others)
10. Krishna Reddy
11. Hanumantha Rao
12. V. D. Mahajan***
13. Sri Vathsava

# Medieval India (1)

గా ఆక్రమించి బలిపోన పరిచారు... 21 ఏళ్ళ ఇబ్రాహీం అలాని లోదీని

మొహమ్మద్ గజనీ భారత్ పై దాడులు... ఉత్తర ఘోరీ దండయాత్ర

3. భారత సంపద > గజనీ > ఘోరీ

4. భారత రాజులు ఘోరీ ఉద్దేశాలని అంచనా వేయలేకపోవడం

5. థాపర్ — ముస్లిం సైనికులకు పోరాటం పై ఉత్సాహం ఉంది భారతీయులు
అప్పటికే అంతర్గత యుద్ధాల వల్ల పోరాటం పై విసుగులో

6. సైనిక కారణాలు 1) టర్కులది homogenous — భారత ఫ్యూడల్
Mobility — గుర్రాలు విభజనలు
ఒంటెలు (బానిసలు ఎద్దులు మోయడానికి) ?

విలువిద్య

యుద్ధాల్లో చాలా బలంగా ఉన్నట్లు ఆటగా

7. జదునాథ్ సర్కార్ ముస్లిం మతం వారికి 3 లక్షణాలు ఇచ్చింది అని
- సమానత్వం & సోదరభావన
- చావంటే భయం లేకపోవటం
- మద్యం నుంచి విరక్తి

1. భారతీయ సమాజంలో కులాలు & యుద్ధ వృత్తి లేదనే కొలవేదు వంటి
వాదనలు హేతుపూర్వకంగా నిలవవు.

2. అలాగే మతం వారి విజయానికి కొంత కారణమవ్వొచ్చు గానీ అదే
కారణం అనడం కూడా అసమంజసమే!

# Balban's theory of Kingship

## : బాల్బను రాజరిక సిద్ధాంతము :

క్రీ.శ. 1206-90 మధ్యకాలంలో ఢిల్లీ కేంద్రంగా పాలించిన బానిస వంశ రాజులలో అగ్రగణ్యుడైన బాల్బను. రాజరిక ఔన్నత్యాన్ని పునరుద్ధరించు రీతిలో ఇతను ప్రవేశపెట్టిన రాజరిక సిద్ధాంతము చరిత్రలో ప్రత్యేకంగా పేర్కొనదగినది.

బాల్బను సింహాసనానికి వచ్చే నాటికి సుల్తాను యొక్క హోదా, అధికారం అతి దీన స్థితిలో ఉన్నాయి. అట్టి స్థితి నుంచి తన రాజరిక సిద్ధాంతం చే, వ్యక్తిత్వం చే సుల్తాను పదవి ని అత్యుత్కృష్ట స్థాయి కి చేర్చాడు.

బాల్బను ఈ సిద్ధాంతాన్ని ఏర్పరటానికి అనేక ముఖ్య కారణాలు ఉన్నాయి. అప్పటివరకూ 'చహాలగనీ' సర్దారులు(1)* సుల్తాను ను తమ చేతి కీలుబొమ్మ గా భావిస్తున్నారు, ఇక పై దాన్ని సాగనివ్వరాదు. ప్రజల్లో(2)* సైతం సుల్తాను పట్ల భయభక్తులు ఏర్పరచాల్సి ఉంది. ఒక్క మాటలో

చెప్పాలంటే అంతర్గత (3), బహిర్గత ప్రమాదాల్ని సమర్థంగా ఎదుర్కోవాలి అంటే సార్వభౌమత్వాన్ని కాపాడా, అధికారం పెంచడం; సర్వాధికారాలు సుల్తాను చేతిలో కేంద్రీకరించడం అవసరమని బారనీ భావించాడు.

ఇందుకోసమే బారనీ పెర్షియన్ రాచరిక సిద్ధాంతాన్ని పునరుద్ధరించాడు. దీని ప్రకారం రాజు ఈ భూమి మీద భగవంతుడి ప్రతిరూపం. అంటే అతను రాజుగా భగవంతుని చేత ఎన్నుకోబడ్డాడు, అంతేగాని ప్రముఖుల / సర్దారుల చేతనో ప్రజల చేతనో కాదు. రాజు ఏం చేసినా సొంతగా చేయడు, దైవం నిర్ణయించిందే చేస్తాడు. అందువల్ల సుల్తాను తన చర్యలకు భగవంతునికే తప్ప ప్రముఖులకు గాని ప్రజలకు గాని బాధ్యత వహించనవసరం లేదని చెప్పాడు. అంటే బారనీ రాచరిక సిద్ధాంతము అతని నియంతృత్వ వాదం & మత ప్రాతిపదిక

కల్పించేందుకు ఏర్పడిందని తెలుస్తుంది.

ఈ రోజుల్లో అధికారం, శక్తి కేవలం ఉన్నతవర్గాల వారికి ప్రాచీన వారసత్వం గల వారికి మాత్రమే చెందాలని భావించేవారు. అందువల్ల బాల్బన్ సింహాసనానికి తన అర్హతని బలపర్చుకునేందుకు గాను తాను ఇరానియన్ పౌరాణిక రాజు అఫ్రాసియాబ్ (Afrasiyab) (ancient pedigree) వారసుడనని / సంతతివాడని చెప్పుకున్నాడు. తనది ఉన్నత వర్గాల వారి రక్తమేనని నిరూపించుకునేందుకు టర్కీ (ప్ర)ముఖుల రక్షకుడిగా మారి వారి ఆసక్తుల్ని కాపాడాడు.

బాల్బన్ సిద్ధాంతంలో ముఖ్య అంశం ఉన్నత - అల్పవ వర్గాల వారి మధ్య విభేదం. అల్పవ వర్గాల వారిని తీవ్ర వివక్షతకి గురి చేయటమే కాక ఉన్నతవర్గాల వారిలో మరలా జాతిని బట్టి భేదం చూపేవాడు. ఉన్నత పదవుల్లో పొరపాటున కూడా టర్కేతరుల్ని నియమించేవాడు కాదు. 'అమీరాహ్' ఇక్తాదారుగా కమల్ మహియా న చక్కని సమర్థుడే అయినా టర్కేతరుడని నియమించలేదు, పైగా అతని పేరు సూచించిన అధికారుల్ని మందలించాడు. అల్పవ వర్గాల వారు ఉన్నత ఉద్యోగాల్లో ఉన్నట్లయితే

వారిని తొలగించివేశాడు.

రాజు ఈ భూమి మీద అందరి కంటే ఉన్నత వాడూ, వైభవం గలవాడు. దీన్ని తెలుపుటందుకు పలు ఇరానియన్ ఆచారాల్ని బాల్బన్ ప్రవేశపెట్టాడు. తనను 'భూమి పై దేవుని నీడ' గా (Zil-i-Ilahi) 'భూమి పై దేవుని ప్రతినిధి' గా (Niyabat-i-Khudai) వర్ణించుకొని వాటిని నాణేలపై ముద్రించాడు. మత ప్రకారం కేవలం దైవానికే పరిమితం అయిన 'సిజ్దా' (సాష్టాంగ ప్రమాణం) 'పైబోస్' (చక్రవర్తి పాదాల్ని ముద్దుపెట్టుకొనుట) మొ|| ఆచారాల్ని తన కొలువులో ప్రవేశపెట్టాడు.

బాల్బను మిక్కిలి వైభవోపేతమైన కొలువుని నిర్వహించేవాడు. కొలువులో ఖలీఫా ప్రతినిధులు ఇద్దరు తప్ప (వారు కూడా రాజు వేదికకి కిందగా కూర్చునేవారు) తక్కిన వారంతా తమ తమ హోదాలననుసరించిన క్రమంలో నిలబడే ఉండాలి. ఈ ప్రోటోకాల్ పనులు చూసేందుకు "మీర్ హాజిబ్" ఉండేవాడు.

కొలువు నిర్వహణ చాలా
క్రమశిక్షణలో కొనసాగేది. బాల్బన్ స్వయంగా
చాలా గాంభీర్యంగా[1] ఉండేవాడు. కొలువులో తాను
నవ్వకపోవడమేగాక[2] ఎవరూ నవ్వరాదు. మితభాషిగా
ఉన్నత ఉద్యోగులతో[3] మాత్రమే పరిమితంగానే
మాట్లాడేవాడు. కొలువులో అతని సేవకులు
తప్పితే ఎవ్వరూ[4] మాట్లాడరాదు.

కొలువుని వైభవోపేతంగా
అలంకరించేవారు.[5] అలంకరించబడిన ఏనుగులు,
గుర్రాలు; వరుసగా నిలబడ్డ బానిసలు, బల్లాలు
కళ్లు మిరుమిట్లు గొలిపే రాజ సింహాసనం ఉండేవి.
రాజ వైభవాన్ని ప్రదర్శించేందుకు నౌరోజు[6] పండుగ
జరిపేవారు. బాల్బను బయట ఊరేగింపుకు[7]
వెళితే ఎండకి తళతళ మెరిసే పొడవాటి కత్తులతో
సిస్తానీ వీరులు నడుచుండేవారు. 'బిస్మిల్లా' 'బిస్మిల్లా'
అనే కేకల మధ్య అలా వెళ్తున్న బాల్బను
దర్శనార్థం చాలా దూరాల్నించి ప్రజలు వచ్చేవారని
బరానీ రాశాడు.

౨౦లో "రాజు ప్రజలలో భయంతో
కూడిన ఆదుర్దాన్ని, అతని వైభవం ఎడ
ఆకర్షణని కల్పించడం మాత్రమే సార్వభౌమత్వం,

ప్రభుత్వ నిర్వహణ సత్రమంగా సాగవు" అని బరానీ ఈ పరిశీలనలు మనకు తెలిపాడు.

బాల్బన్ సుల్తాన్ గా తన బాహ్య స్వరూపానికి కూడా చాలా ప్రాధాన్య మిచ్చాడు. సదా రాజదుస్తుల్లోనే ఉండేవాడు. ఆఖరికి తన పరివారానికి కూడా రాజదుస్తుల్లో తప్ప కనిపించేవాడు కాదు. పైగా తన పరివారంలో సహా ఉద్యోగులందరికీ వస్త్రధారణ నిర్ణయించాడు.

బాల్బన్ రాజుగా తన హుందాతనం కాపాడుకోవడానికి సుల్తాను కాగానే మద్యం త్యజించాడు. సుల్తాన్ తన సభావర్గం వారిలో, విదూషకులలో, నాట్యగత్తెలలో ఉండరాదని ఆచరణలో చూపాడు. తన వ్యక్తిగత పరివారం కూడా హుందాతనాన్ని నిర్వహించేవారు.

బాల్బన్ తన అధికారాన్ని ఎవరితోనూ పంచుకోవటానికి ఇష్టపడడు ఆఖరికి తన దగ్గరి బంధువైన షేర్‌ఖాన్‌ను కూడా

విడువిచ్చి చంపించాడు. తన శత్రువులందరినీ fair and foul fair or foul means తో అడ్డు తొలగించుకున్నాడు. అందుకే ఏదో సమయంలో మొత్తం ఉత్తర ప్రాంతాలకి రాజు కానివాడిగా అవతరించాడు.

మాల్కమ్ రాజుగా ప్రజలకి కొలువులో దర్శనకాలం ఇచ్చేవాడు కాదు. రాజు గౌరవం చెడకూడదని కేవలం ఉన్నత కులాలవారికి ఆ అవకాశం ఇచ్చేవాడు. [ఫత్రే బంధి అనేవాడు కేవలం ప్రాంతాల అధిపతి మాత్రమే ఆ దర్శనం నిరాకరించాడు. బరాబి మాల్కమ్ మాటలుగా చెప్పిన

“ఎప్పుడైనా నేను కింది వర్గాల వచ్చిన అధముల్ని చూస్తే నా కళ్ళు మండుతాయి, కోపంలో కత్తి తీస్తాను (వాళ్ళని చంపడం కోసం)”

ఈ మాటలు వింటే అన్నా కాదన్నా మాల్కమ్ కు ఉత్తరాధికారుల ఎడల గల భావాన్ని తెల్పుతున్నాయి.]

మాల్కమ్ ఇష్టం మాటాన్ని తు.చ. తప్పకుండా పాటించేవాడేం కాదు. అంటే తన వ్యక్తిగత లేదా రాజ్య ఆసక్తులు దెబ్బతింటాయని పిస్తే ఇష్టం సూత్రాన్ని పక్కన పెట్టేవాడు. అయినప్పటికీ బాగ్దాదు పతనమవుతుందని తెలిసి కూడా

ఖలీఫా ను ఇస్లాం రాజ్యాధిపతిగా గుర్తిస్తూ
మరణించిన ఖలీఫా పేరును నాణాలపై
ముద్రించటం, ఖుత్బా లో చదవడం చేశాడు.
ఇవన్నీ సుల్తాను గౌరవాన్ని పెంచుతాయని, వీని ద్వారా
సుల్తాను పదవికి మతపరంగా బలమైన
మద్దతు లభిస్తుందని భావించాడు.

బాల్బను తన కేంద్రీకృత
అధికారాలు పూర్తి రాచరికాన్ని సమర్థ న్యాయం
అందించటం ద్వారా సమర్థించుకున్నాడు. పైగా
సరైన న్యాయం అందించటం దివ్యత్వ లక్షణం కూడా,
కాబట్టి తన ప్రజల్ని న్యాయపాలునిగా,
న్యాయమైన పాలకునిగా రక్షించ దలిచాడు.
న్యాయ పాలనలో బాల్బను నిష్పక్ష నిష్పక్షపాతి.
తన బంధువులు, పిల్లలు (కొడుకులు) ని కూడా
చూసేవాడు కాదు. ఉన్నత వర్గీయులు నేరస్థ
లయితే కూడా శిక్షించేవాడు. తన నమ్మకస్థుడు
బదౌన్ ఇక్తా గవర్నరు అయిన మాలిక్ బకబక్
తన బానిసని తాగిన మైకంలో చంపి
నందుకు ఆగ్రహంగా అతన్ని కూడా, చంపించాడు.
అదే మాదిరిగా కొరడాలతో కొట్టి

బాల్బను తన రాజధానికి బలం చేకూర్చేందుకు పటిష్టమైన గూఢచార వ్యవస్థ కలిగి ఉండేవాడు. [ప్రతి నగరం, జిల్లా, ఇక్తాలలో అధికారుల గూర్చి తెలుసుకునేందుకు వారు మిలిటరీ అధిపతుల, చలాయించకుండా ఎవ్వరి పైనా ఆధారపడని తన సేవకులు, బానిసల పై కూడా ఉండేలా చూసేందుకు గూఢచారుల్ని నియమించాడు.] తన పనిలో విఫలమైన గూఢచారుల్ని కూడా తీవ్రంగా శిక్షించేవాడు. మాలిక్ బక్ బక్ బానిసని చంపిన విషయం చేరవేయనందుకు అక్కడి గూఢచారిని బహిరంగంగా ఉరితీయించాడు.

Add these points

* బాల్బను సార్వభౌమత్వానికి తన దివ్యత్వ అర్హతను బలపర్చుకునేందుకు గానూ తన దుస్తులు / వేష, సామాజిక ప్రవర్తన, అలవాట్లు విషయంలో తీవ్రమైన మార్పులు తెచ్చాడు. 'సంప్రదాయక నియంత' మాదిరి ఉండేవాడు. (Oriental despot)

* Purpose

బాల్బన్ తన నిరంకుశ రాచరికం ద్వారా సామాన్య ప్రజల నుండి విధేయత, వినయం పొందడమే గాక చిహల్గని సర్దార్లు తనని Kingmaker గా భావించకూడదని స్పష్టపర్చాడు. తన రాచరిక సిద్ధాంతం ద్వారా బాల్బను అప్పటి వరకు సుల్తాను సర్దారులలో ఒకడని లేదా సర్దారులలో(1)* ప్రథముడని భావిస్తున్న ఆలోచనని తుడిచి పెట్టాడు. సుల్తాను దైవాంశ సంభూతుడు గాన సర్దారులకి అమాంతంగా ఈ సిద్ధాంతం తక్కువ స్థాయి కల్పించింది.

* నాసిరుద్దీన సుల్తాను గా ఉన్నప్పుడు సుల్తాను ఎట్టి ప్రతిష్ఠ కలిగి ఉండేవాడు కాదు; ప్రజలకి సుల్తాన పట్ల గౌరవం, భయం లేవు అని బరని మాటల వల్ల తెలుస్తుంది.

" మంచి ప్రభుత్వం అంతటికి రాజ్య ప్రకాశానికి వైభవానికి మూలమైన ప్రభుత్వాధికారం పట్ల భయం

అనే భావన ప్రజల హృదయాల్లోంచి తొలగి
పోయింది, దేశం దారుణ స్థితికి దిగజారింది"

— బరాని

*2వ వ్యాసం
ఈ స్థితిని పోగొట్టేందుకే బాల్బన్
తన రాచరిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

"రాజు హృదయం దేవుని
దీవెనలకు ప్రత్యేక నిధి, ఈ విషయంలో
అతనికి మానవజాతిలో సమానులెవ్వరూ లేరు"

— బాల్బన్

* రాజు గాంభీర్యం చెడకూడదని బాల్బన్
తన ప్రియపుత్రుడు మహమ్మదు మరణవార్త
విన్న వెంటనే సైతం స్థిరంగా, ఏ కదలికా లేకుండా
రోజువారీ పాలనా కార్యకలాపాల్ని యధావిధిగా
నిర్వర్తించాడు. తన అంతరంగిక భవనంలో
మాత్రమే తీవ్రంగా విలపించాడు.

# బాల్బను - రాజరిక సిద్ధాంతం

కారణాలు : 1) చిహల్గనీ సర్దారులలా కాదు ఈ ప్రజల్లో ఆ భావన పోగొట్టడం
2) ప్రజల్లో భయ గౌరవాలు సుల్తాన పట్ల కలిగించేందుకు
3) అంతర్వేది భద్రత కోసం

→ దైవదత్తాధికార సిద్ధాంతం.. దేవుడే నియమించేది
సం దేవుడికి బంధ్గాల..

→ అఫ్రాసియాబ్ వారసుడు

→ ఉన్నత వర్గం Vs. నిమ్న

→ Zil-i-ilahi, Niyabat-i-Khudai, సిజ్దా పైబోస్

→ కొలువు .. ప్రోటోకాల్ 'మిర్ హాజిబ్'

→ గాంభీర్యం .. నవ్వడు.. మితభాషి.. మద్యపాననిషేధం...

→ కొలువు అలంకరణలు, అల-జలాలు, బానిసలు & అంగరక్షకులు
నౌరోజ్, ~~ఉత్సవాలు~~ ..  బరాని

→ సదా రాజదుస్తుల్లోనే

→ హోదా కోసం మద్యం.. విందు.. నాట్యగోష్ఠి ↓

→ అధికారాన్ని పొందే క్రమంలో fair & foul means

→ ఖుత్బా, నాణ్య ప్రయోగాన్ని పరిచయ పెట్టేవాడు -- but ఖలీఫా
పేరు ను

→ స్థిరసైన్యం

→ గూఢచారి వ్యవస్థ

→

మాస్టేం

## బానిస వంశస్థులు - మంగోలు విధానము

భారతదేశానికి వాయువ్యాన మధ్య ఆసియా నుంచి ఆఫ్ఘను ను వేరుచేసే 'హిందూకుష్ పర్వతాలు' చక్కని సహజ సరిహద్దు. అయితే ఆఫ్ఘను రాజకీయ వాతావరణం అనుకూలంగా లేకపోవడం చేత ఢిల్లీ సుల్తానులు వాయువ్య సరిహద్దు సింధునది అవతల బియాస్ నది వరకు కుచించుకు పోవు మంగోలుల దాడులకు అవకాశం ఇచ్చింది.

మంగోలులు టార్టరీ ఎత్తు భూములు నుంచి వచ్చిన సంచార జాతులు. వీరు షామనిస్ట్ బౌద్ధ విశ్వాసానికి చెందినవారు. 13 వ శతాబ్ద ఆరంభంలో ముస్లిం రాజ్యాల్ని తమ దోపిడి, మారణకాండ చే గడగడలాడించారు. భయ (terror) కంపితుల్ని చేయడాన్ని యుద్ధ సాధనంగా వాడేవారు.

భారతదేశానికి మంగోలుల భయం క్రీ.శ. 1220 - 21 ప్రాంతంలో వచ్చింది. మునుపటి గజని, ఘోరీల ప్రాంతంలో స్థాపించబడిన ఖ్వారిజ్మ సామ్రాజ్యం దాదాపు సింధునది

వరకూ వ్యాపించింది. మంగోలులు చెంగిజ్ ఖాన్ నాయకత్వం లో వీరి పై దాడి చేసి ఓడించారు. రాజకుమారుడు "జలాలుద్దీన మంగబార్నీ" చెంగిజ్ ఖాన్ తరుముతున్నప్పుడు లో సింధునది దాటి వచ్చాడు.

జలాలుద్దీన నాటి ఢిల్లీ సుల్తాను ఇల్ టుట్ మిష్ ను సాయమర్థించాడు. అయితే అప్పటికే సింధునది వద్ద చెంగిజ్ ఖాన్ వేచి ఉన్న విషయం సుల్తాను గమనించాడు. ఒక రాజకుమారుడు శరణు కోరితే ఇవ్వననడం అవమానకరమైంది. అలాగని చెంగిజ్ ఖాన్ లాంటి వీరుణ్ణి యుద్ధానికి ఆహ్వానించడం తెలివితక్కువ తనమౌతుంది. పైగా ఇల్ టుట్ మిష్ కు ఢిల్లీ రాజ్యాన్ని మధ్య ఆసియా రాజకీయాల్లోకి లాగడం ఏ మాత్రం ఇష్టం లేదు. ఈ కారణాల వల్ల ఇల్ టుట్ మిష్ మంగబార్నీకి సహాయాన్ని మృదువుగా తిరస్కరించాడు. తన రాయబారిని పంపించి భారత వాతావరణం అతనికి సరిపడదని తెలిపాడు. మంగబార్నీని పంజాబు నుండి విరమించుకోవాల్సిందిగా కూడా కోరాడు. ఇది

ప్రమాదకరంగా భావిస్తున్న మంగోలుల్ని ఇల్‌టుట్‌మిష్ పై ప్రతీకారం తీర్చుకుంటున్నా అది సమయం కాదని విరమించుకున్నాడు.

ఈ విధంగా ఇల్‌టుట్‌మిష్ తన దౌత్య నిపుణతచే ఢిల్లీ మధ్య ఆసియా రాజకీయాల్లో చిక్కుకుపోకుండా[1] కాపాడాడు. తాను చెంగిజ్‌ఖాన్ కోపానికి[2] గురి కాకుండా, దేశం మంగోలుల క్రూర భీకరత్వానికి[3] బలి కాకుండా రక్షించాడు.

అయితే చెంగిజ్ ఇల్‌టుట్‌మిష్‌ను రాయబారుల్ని పంపి తాను జలాలుద్దీన్ పైకి సైన్యాన్ని పంపడంలేదని మంగోలులు చైనా వైపు మరలిపోతున్నారని చెప్పడం అతను సుల్తానును గౌరవించడంగా చెప్పవచ్చు. చెంగిజ్‌ఖాన్ మరలి పోయినా కొందరు మంగోలులు సింధు ఆవలి వైపు స్థిరపడి అక్కడి నుండి సుల్తానుకు కొత్త తలనొప్పులు సృష్టించారు.

చెంగిజ్‌ఖాన్ మరలి పోయినా మంగోలులంటే సుల్తానుకు ఎప్పుడూ భయం ఉండేదని తెలుస్తుంది. అందువల్లనే క్రీ.శ. 1227 లో చెంగిజ్‌ఖాన్ మరణించేంత వరకూ ఇల్‌టుట్‌మిష్ పశ్చిమ పంజాబును గాని

సింధూ నది ఆక్రమించుకునేందుకు ఎట్టి ప్రయత్నం చేయలేదు.

చెంఘిజ్ మరణానంతరం కొంత కాలం మంగోలులు అంతర్గత వ్యవహారాల్లో, ఖొరాసాన్, ఇరాన్ ఆక్రమణల్లో నిమగ్నులైనారు. కాని 1234 లో చెంఘిజ్ తర్వాత నాయకుడైన ఒక్తాయి (Oktai) హిందు ను కాశ్మీర్ ను ఆక్రమించాలని నిర్ణయించుకున్నాడు. ఈ ప్రాంతాన్ని ఆక్రమించటం కోసం తెలుటుబాయ్ సాల్ట్ రేంజస్ లో ఉన్న బన్యాన్ (Bunyan) దాకా వెళ్ళాడు. దారిలో దురదృష్టం వల్ల రాజధానికి తిరిగివచ్చేటప్పుడు కొంత కాలానికి మరణించాడు.

మంగోలులు మెల్లగా కోహ్-ఇ-జూద్ (Koh-i-Jud) లేదా సాల్ట్ రేంజస్ మొత్తాన్ని ఆక్రమించుకున్నారు. (గజని గవర్నరు వఫా మాలిక్ ను ఓడించడం ద్వారా) క్రీ.శ. 1240 లో ఢిల్లీ రాజ్యానికి మరలా మంగోలుల ముప్పు వచ్చింది. హీరట్, గజని, ఆఫ్ఘనిస్థాన్ ల

కమాండరు అయిన తైర బహాదూర్ లాహోరును ఆక్రమించాడు. నిజానికి టర్కీ గవర్నరు నిస్సహాయుడయ్యాడు. లాహోరు వ్యాపారులు మంగోలులతో సంబంధాలు కలిగి ఉండటంతో టర్కీ గవర్నరుకు సాయం చేయలేదు. అటు ఢిల్లీ సైతం రజియా మరణానంతర గందరగోళం లో చిక్కుకొని ఉండడం చేత ఏ సహాయంగానూ అందించలేక పోయింది. దాంతో గవర్నరు పారిపోయాడు. ప్రజలు మంగోలుల్ని లూటీని నివారించినా తర్వాత మంగోలుల ప్రతీకారానికి బలిపెట్టబడ్డారు.

ఈ విధంగా నాసిరుద్దీన్ మహమ్మదు సుల్తానయ్యేనాటికి మంగోలులు బియాస్ నది వరకూ వ్యాపించారు - క్రీ.శ. 1246. ఈ సమయం లో నాయబ్ అయిన బాల్బను బారవ గా (Koh-i-Jud) కోహ్-ఇ-జుద్ నుంచి మంగోలుల్ని వారి లాత్తులుగా వెళ్ళిన ఖోఖర్లని తరిమికొడదామనుకున్నప్పటికీ టర్కీ ప్రముఖుల అంతర్గత కలహాలు, ఆర్థిక ఇబ్బందుల వలన విరమించుకున్నాడు. సరిహద్దు కమాండర్లుగా ఉన్న ముల్తాను, సింధు కమాండర్లకే మంగోలు విధేయుల్ని వదిలేసారు. దాంతో

వారు మంగోలు సామ్రాజ్యపు ఎల్లల్ని విస్తరించడం చేశారు. కొందరు తమ పదవుల కోసం మంగోలు దండయాత్రల్ని ఆహ్వానించినట్లు కూడా ఆరోపణలున్నాయి.

ఇలాంటి స్థితిలో మంగోలుల అడ్డుకోవడానికి బాల్బను సైనిక, దౌత్య మార్గాలు రెండింటినీ అవలంబించాడు.

ఇరాక్ యొక్క మంగోలు - ఇల్ - ఖాన్ అయిన "హలాకు" కు బాల్బను దౌత్య బృందాన్ని పంపాడు. హలాకు కూడా క్రీ.శ. 1260 లో బదులుగా పంపిన దౌత్య బృందాన్ని బాల్బను గొప్ప వేడుకలతో ఆహ్వానించాడు. వీరు ఢిల్లీ సుల్తాను సైనిక బలం, వైభవం, ప్రజామద్దతు చూసి ఆకర్షితులై ఢిల్లీకి దాని సరిహద్దుల్ని/రాజ్యాన్ని కాపాడుకోగల సత్తా ఉందని గ్రహించారు. మంగోలులు ఢిల్లీలో ప్రత్యక్షంగా తలపడక పోవ-డానికి ఇదొక కారణమనవచ్చు. అయితే లాహోరు, ముల్తాన, సింధ లలో మంగోలులు ఉండడం చేత ఢిల్లీ ప్రభుత్వం వాటిని సమర్థంగా తన పాలనలోకి నాసిరుద్దీన

(x) 1255 లో సుల్తాన నాసిరుద్దీన మహమ్మదు 19

బంధువు జలాలుద్దీన మంగోలుల సాయం తోడు

లాహోరు చేరుకుని ఢిల్లీ ని స్వామిభక్తి వేడుకున్నాడు.

నాయిబ్ బాల్బను తెలివిగా అతన్ని లాహోరు

గవర్నరుగా నియమించి ఢిల్లీ కి మంగోలుల కి

మధ్య buffer గా వాడుకున్నాడు.

1257 లో ముల్తాన్, ఉచ్ఛ

గవర్నరు కిష్లు ఖాన మంగోలులతో ఉమ్మడిగా

ఢిల్లీ పై దాడికి సంధి కుదుర్చుకున్నాడు. ఈ

విషయం తెలియగానే బాల్బను ఢిల్లీ రక్షణ కి

తక్షణ చర్యలు చేపట్టాడు.

మహమ్మదు సుల్తానుగా ఉన్న కాలం లో

తెచ్చుకోలేక పోయింది.

ఆసక్తికరంగా, హలాకు

దౌత్య బృందం వచ్చిన సమయంలో (దాదాపుగా)

హలాకు బద్ధ విరోధి అయిన మరో మంగోలు నేత

దక్షిణ రష్యా, మంగోలు స్వర్ణ సమూహాధిపతి బర్కే ఖాన

నుంచి కూడా దౌత్య బృందాన్ని బాల్బను సమ్మతిం-

చాల్సి వచ్చింది. ఇట్టి సంక్లిష్ట స్థితి లో హలాకు

తన ఘట్టాలను నింపు, జోహర్-ఇ-జుద

ప్రాంతాలను పంపి వాటిపై తన సార్వభౌమత్వాన్ని ప్రకటించాడు. సింధు లోయ, లాహోరు ల పశ్చిమ ప్రాంతాలపైనా మంగోలులకు ఢిల్లీ సుల్తాను ఆటంక పర్చరాదని ఒప్పందం కుదిరింది.

బాల్బను 1266 A.D. లో సుల్తానయ్యేటప్పటికి హలాకు మరణించడం, ఢిల్లీకి మంగోలులకు మధ్యమున్న సుహృద్భావం అడుగంటటం జరిగాయి. సరిహద్దు ప్రాంతాలలో షేర్‌ఖాన నాయకత్వంలో సేనలు మంగోలుల కడ్డ ఆపేందుకు ఉన్నప్పటికీ మంగోలులు తరచూ బియాస్ ను దాటి రాగలిగేవారు.

ప్రారంభంలో బాల్బను ఫార్వర్డ్ విధానాన్ని (forward policy) అవలంబించాడు. అతడు తన సైన్యాన్ని కోహ్-ఇ-జుద్ మీదకు మరల్చి కొండ ప్రాంతాన్ని దాటి పరిసరాన్ని దాడి చేసి పలు గ్రామాల్ని పట్టుకున్నాడు. క్రీ.శ. 1270 లో బాల్బను లాహోరు నగరాన్ని పునర్నిర్మించడానికి అధికారిని నియమించాడు.

స్వతంత్ర పాలన కు ఉత్తర పశ్చిమాన్ని షేర్‌ఖానను హతమార్చినాడు (poisoned). వాయువ్యంలో

ఘనాం-సమీప ప్రావిన్సు ను తన చిన్న కొడుకు బుగ్రాఖాన్ కింద ; ముల్తాను, సింధ్, లాహోరు లను తన పెద్దకొడుకు, యువరాజు మహమ్మద్ ఖాన్ కింద ఉంచాడు.

బాల్బను వాయువ్య సరిహద్దును బలోపేతం చేయదలచి వాయువ్య సరిహద్దురేఖ వెంబడి పలు కోటలను నిర్మించి బలిష్టమైన ఆఫ్ఘాను సేనల్ని వాటిలో నిల్పాడు. వీటన్నిటినీ బుగ్రాఖాన ఆధిపత్యంలో ఉంచాడు.

CRUX

[సూక్ష్మంగా పరిశీలిస్తే బాల్బను వ్యూహాలలో మూడంచెలు కనబడుతాయి. సరిహద్దు సమీపంలో వాస్తవంగా ఎదుర్కోవాల్సిన స్థలంలో మహమ్మద్ ఖాన ; సరిహద్దు వెంబడి లోపలి భాగంలో కోటల వరుస కు రెండవ రక్షక కవచంగా బుగ్రాఖాన ; ఇక అసలు కేంద్రమైన రాజధాని లో స్వయంగా బాల్బను సన్నద్ధులై ఉన్నారు.]

బాల్బను ఢిల్లీ నుండు రక్షణ పనులన్నీ స్వయంగా చూసేవాడు. అత్యవసర సమయాలలో సరిహద్దు సేనలకి అదనగా నిచ్చేందుకు 30,000 ల అశ్విక దళాన్ని

సర్వసన్నద్ధంగా ఉంచాడు బాల్బను.

## మంగోలుల దాడులు

కొనసాగుతున్న మహమ్మద్ ఖాన్ ముల్తాను, లాహోరు లలో బియాస్‌నది పైనే సరిహద్దుగా చేసుకొని రక్షణా కార్యక్రమాలు కొనసాగించాడు. దాంతో ఎక్కువ మంగోలులు బియాస్ నదిని దాటడానికి జంకేవారని, 70,80 వేల మంగోలు సైన్యం కూడా ముల్తాన్ లో మహమ్మద్ ఖాన్, సమానలో బగ్రా ఖాన్, ఢిల్లీ లో మాలిక్ బరబక్ లని ఎదుర్కోవడానికి ముందుకి రాలేదని బరాని రచనల వల్ల తెలుస్తుంది.

అయితే మొత్తం మీద మంగోలుని అడ్డుకోవడంలో బాల్బను అవలంబించింది defence (defensive in nature) కేవల రక్షణా విధానమేనని చెప్పవచ్చు. మొత్తం వాయువ్యాన్ని మంగోలుల నుండి తప్పిద్దామని ప్రయత్నించలేదు.

క్రీ.శ. 1285 లో మంగోలు నాయకుడు అర్ఘును యొక్క తైమూరు ఖాన్ పంజాబు పై దాడి చేశాడు. ధైర్యంగా పోరాడి మహమ్మద్ ఖాన్ ప్రాణాలు కోల్పోగా లాహోరు, దీపాల్పూర్ లు దోపిడికి గురయ్యాయి. అయితే ముల్తాన్,

ఉచ్ మాత్రం మహమ్మద్ ఖాన్ కొడుకు
కాయ్ ఖుస్రో ద్వారా రక్షించబడ్డాయి.

యువరాజు మరణం బాల్బనను కుంగదీసింది. అయినా వాయువ్య సరిహద్దు రక్షణని విడువలేదు. బాల్బను లాహోరుని పునరాక్రమించాడు. ఇది తప్ప బాల్బను మంగోలులపై సాధించిన గొప్ప విజయమేది లేదు. ఢిల్లీ (ప) ఖిల్జీ అధికారం లాహోరుని దాటి పోలేదు. రావి నదికి పశ్చిమాన ఉన్న భాగం మంగోలుల క్రిందే ఉన్నది.

బాల్బను మరణానంతరం అతని వారసుల కాలంలో జరిగిన చివరి దాడి 1288 లో క్రీ.శ. 1288 లోనిది. (Tamar Khan) తామర్ ఖాన్ నాయకత్వంలో మంగోలులు లాహోరు నుంచి ముల్తాను వరకూ దోచుకున్నారు. అయితే ఢిల్లీసుల్తాను సేనలు వస్తున్నాయన్న వార్త తెలియగానే మంగోలులు వెనుదిరిగారు.

బాల్బను క్రీ.శ. 1286 లోనే మరణించినా అతని వ్యూహాత్మక, దౌత్య పరమైన ఏర్పాట్లు మాత్రం ఢిల్లీ సుల్తానత్‌కు రక్షణగా ఉంటూనే వచ్చాయి.

ఈ విధంగా క్రీ.శ. 1290

వరకు మంగోలులు పశ్చిమ పంజాబు పై ఆధిపత్యం చెలాయిస్తూనే ఉన్నారు. బియాస్ నది మాత్రమే సమర్థమైన సరిహద్దుగా ఉండగలిగింది. మంగోలులు నిరంతరం ముల్తాను, సింధ్ లను కొల్లగొడుతూనే ఉన్నారు. అయితే వారు ఢిల్లీకి వ్యతిరేకంగా ఎలాంటి తీవ్ర చర్యలూ తీసుకోలేదు. ఇదే ఢిల్లీ సుల్తానత్ కు వరంగా మారి అది బతికి బట్ట కట్టడానికి తోడ్పడింది. ఇది కూడా అత్యుత్తమ అప్రమత్తత, సర్వసన్నద్ధమైన జాగరూకత వల్లనే సాధ్యపడింది.

# బానిస వంశస్థుల పరిపాలన

# Administration of the Slave Kings

క్రీ.శ. 1206 - 1290 ల మధ్య ఢిల్లీని పాలించిన రాజులే బానిస వంశస్థులుగా బానిస రాజులుగా చరిత్రలో పిలువబడుతున్నారు. వీరు తమ పాలనలో పన్ను వసూళ్ళు, శాంతి భద్రతల స్థాపనకు ప్రాముఖ్యత నిచ్చారు. వీరి పరిపాలన లో రాజ్య విస్తరణ కంటే రాజ్య సుస్థిరతకే ప్రాధాన్యమివ్వబడింది.

## రాజ్య స్వభావము :

నాటి ఇతర ముస్లిం రాజ్యాల వలే ఇది కూడా మతరాజ్యమే. 13 వ శతాబ్దం వరకూ సుల్తాను ఖలీఫ్'s మరణించిన సుల్తాను ఉటుంబం వారికి పరిమితమయ్యింది. సామర్థ్యం, చనిపోయిన సుల్తానుచే ప్రతిపాదించబడటం / నియామకం, టర్కీ ప్రముఖుల మద్దతు ఈ అంశాలు సుల్తాను ఖలీఫ్'s ని ప్రభావితం చేసేవి. ఢిల్లీ సుల్తానుల ప్రజాసమ్మతి మీదగాక బలం మీద ఆధారపడింది.

ముస్లిం మతరాజ్యం కాబట్టి ముస్లిమేతరులు పౌరులు కారు. హిందువులు తమ మతంలోనే ఉండటానికి జిజియాపన్ను కట్టాలి. ఉలేమాల మాటంటే అందరు

సుల్తానులు విగ్రహారాధన నాశనం చేయ అమల్లోకి తెచ్చారో గాని ఎందువల్ల అంతమొందించాలని ప్రభుత్వస్థాయిలో చర్యలు చేపట్టడం తప్పించబడు.

అప్పట్లో అందరు ముస్లిం రాజుల వలెనే బానిస రాజులు కేవలం తాము ఖలీఫా నియమితులమని చెప్పుకోడానికి ఉబలాటపడ్డారు.

కేంద్ర ప్రభుత్వము :

చక్రవర్తి : సిద్ధాంత ప్రకారం ఖలీఫా రాజ్యానికి రాజకీయ, మత నాయకుడు అయితే వాస్తవం లో సుల్తానే సార్వభౌముడు. శాసన, కార్యనిర్వాహక, న్యాయాధికారాలకు అతడే ఆధారం. ప్రజలలో అతడు ఉలేమాలను, స్థానిక సంప్రదాయాలు మొదలైన వాటిని పరిగణించేవాడు.

మంత్రులు : బానిస ఢిల్లీ సుల్తానుల పెద్దగా పరిపాలన ప్రణాళిక రచన చేయలేదు. కేంద్ర ప్రభుత్వ వృద్ధి అస్తవ్యస్తంగా సాగింది. రాజధాని లో నలుగురు ముఖ్య మంత్రులు ఉండేవారు.

వజీరు : ఇతడు ప్రధానంగా ఆర్థిక, రెవెన్యూ శాఖలు చూస్తూ ఇతర శాఖలపై సాధారణ

పర్యవేక్షణ చేసేవాడు. ఇది ముఖ్యమంత్రి పదవి (chief minister) వంటిది. ఇతనికి సహాయపడేందుకు ముస్తౌఫ్-ఇ-మమాలిక్ (చీఫ్ అకౌంటెంట్), ముస్తౌఫీ-ఇ-మమాలిక్ (ఆడిటర్ జనరల్) ఉండేవారు.

దివాన్-ఇ-అరిజ్: సైనిక మంత్రి. సేనల నియామకం, హాజరు, క్రమశిక్షణ, సామర్థ్యం, జీతాలు మొ॥ చూస్తాడు.

దివాన్-ఇ-ఇన్షా: ఇతడు రాజ ప్రకటనలు మొ॥ వాటిని తయారు చేస్తాడు. రాజు ఉత్తర్వులు జారీ చేయడం మొ॥

దివాన్-ఇ-రసాలత్: విదేశాంగ, దౌత్య వ్యవహారాల్ని నిర్వహించేవాడు.

ఈ మంత్రుల తర్వాత స్థానంలో బరీద్-ఇ-మమాలిక్ (ముఖ్య వార్తా వాహకుడు), కాజీ-మమాలిక్ (రాజ్య ముఖ్య న్యాయాధిపుడు) – ఇతడే మత వ్యవహారాల శాఖ అధిపతి గాను ఉండేవాడు. ఈ పదవిని ఇతన్ని సద్ర్-ఇ-జహాన్ లేదా సద్ర్-ఉస్-సుదుర్ అనేవారు.

వీరేగాక మరిందరు ఉన్నతాధికారులు ముఖ్యంగా రాజకుటుంబాన్ని వ్యవహారించే అధికారులు రాజధానిలో ఉండేవారు. వారిలో వకీల్-ఇ-దార్ (Comptroller of the royal household) అమీర్-ఇ-హాజిబ్ (ఉత్సవాల నిర్వాహకుడు)

సద్ర్-ఎ-జందర్ (రాజ అంతరంగిక రక్షక భటుల అధిపతి)
(Commander of Royal bodyguard)
అమీర్-ఇ-అఖుర్ (అశ్వకదళాధిపతి)
షహనాయి పిలాన (గజదళాధిపతి) మొ॥ వారు
ఉండేవారు.

కేంద్ర మంత్రుల్ని సుల్తాన్ నియమిస్తాడు. వారు అతనికి బాధ్యులై వుంటారు. రాజాజ్ఞలని అమలు పర్చడమేగాని వారు తమ తమ మంత్రిత్వ శాఖలలో స్వతంత్రులు కారు.

## రాష్ట్ర స్థాయి ప్రభుత్వము:

బహమనీ రాజుల ప్రభుత్వము ఏకరీతి లో ఉండేది కాదు. వారి రాజ్యవిస్తారం మొదట్లో నుండి సైనికాధికారులచే ఏర్పడింది. వికేంద్రీకరణ విధానం ఉండేది. ఈ సైనికాధికారుల పాలన లోని ప్రాంతాలు పరిమాణం, జనాభా, ఆదాయముల్లో ఏ మాత్రం ఏకరూపత గలిగి లేవు. ఈ సైనికాధికారుల ప్రాంతీయ భూభాగమును "ఇక్తా" అనేవారు, వాటి పాలకులను "ముక్తిలు" అనేవారు. వారు తమ ఇక్తాలకి గవర్నర్లు గా విస్తృత అధికారాలు చెలాయించేవారు.

ఇంతటి ముక్తాల రాజకీయ, 31

సైనిక అధికార పీఠం ఇక్తా ఇక్తాకి మారుతూ ఉండేది. ముక్తి కి స్వయంగా పాలించడానికి, తన సొంత అధికారులను నియమించడానికి, రెవెన్యూ పనులకు, ఆ ప్రాంతం నుంచి పొందు శిస్తులు తీసుకుని మిగిలింది (surplus) కేంద్రానికి చెల్లించేందుకు స్వేచ్ఛ ఉంది. అతని ముఖ్య విధి తన ప్రాంతంలో శాంతి భద్రతలను కాపాడటం, రాజాజ్ఞలను అమలు పరచటం. సుల్తాను కోరినప్పుడు అతనికి సేనని సమకూర్చటం కూడా ముక్తి విధి. ముక్తి నుంచి జీతాన్ని కాని ఉండి దాన్ని తన ప్రావిన్సు ఆదాయం నుంచి తీసుకునేవాడు. అతనికి సొంత సైన్యం, అధికారగణం ఉండేవి.

ముక్తిలు తమ ప్రాంతంలో ఉన్న ప్రావిన్సుల్లో ఉన్న సుల్తాను సామంతుల దగ్గర నుంచి రెవెన్యూ పనులు చేయాల్సి ఉండేది.

ఖిల్జీ జిల్లా పాలన :

బానిస రాజుల పాలనలో ఇక్తాల్ని జిల్లాలు, పరగణాలుగా విభజించడం

లేదని చెప్పవచ్చు.

అయితే ఇక్తాలు కాకుండా

అన్ని జిల్లాల సమాహారంగా పెద్ద ప్రాంతాలు కేంద్ర ప్రభుత్వం చేతిలో ప్రత్యక్షంగా పాలింపబడేవి ఉండేవి, ముక్తీల ప్రమేయం లేకుండా. వీటిని రాజ భూములు లేదా "ఖలీసా" అనేవారు. వీటి నిజానికి రిజర్వు ప్రాంతాలుగా చెప్పవచ్చు. వీటి వివరాలు ఒప్పచెప్పకుండా వాటి రెవెన్యూను కేంద్ర రెవెన్యూ శాఖయే స్వయంగా వసూలు చేస్తుంది.

సైనిక పాలన :-

ఇల్బరి రాజుల పాలనలో సైన్యం ప్రముఖ పాత్ర పోషించినను వారికి స్థిరసైన్యం (standing army) ఉండకపోయినది రాజధానిలో వీరు: సుల్తాను అంతరంగిక భటులు సర్-ఇ-జందార్ కింద ఉండేవారు, అయితే సుల్తాన్ అధికంగా ముక్తీలు పంపే సైనిక దళాల మీద ఆధారపడి ఉండేవాడు.

అయితే కాలక్రమంలో అంతరంగిక భటుల సంఖ్య బాగా పెరగడం తో (వారు తర్వాత సైన్యం కావాల్సి) రాజధానిలో వారికి పై అరిజ్-ఇ-మమాలిక్

నియమించబడ్డారు. ముఖ్యమైన శాఖలుగా అశ్వికదళం, కాల్బలం ఉండేవి. సైన్యంలో ముఖ్య అధికారులందరూ దాదాపుగా బానిసలే - మెమ్లూక్ బానిసలు, తుర్కీ బానిసలు, హబ్షీ బానిసలు మొ॥ రకాల వారుండేవారు. వీరు ప్రధానంగా అశ్వికదళంగా వుండి విలువైన దళాలుగా పరిగణించబడేవారు. అయితే శాస్త్రీయమైన సైనిక శిక్షణ ఉండేది కాదు, దళాలలో సైనిక సామర్థ్యం దివాన్-ఇ-అర్జ్ లేదా సుల్తానుల సామర్థ్యం మీద ఆధారపడి ఉండేది.

ముక్తీలు అమీర్ల నియామకం,

క్రమశిక్షణ, జీతాల విషయంలో స్వేచ్ఛ కలిగి ఉండేవారు. అయితే సుల్తానుకు నిర్ణీత కాలం సైన్య పంపాల్సి ఉండటం చేత ముక్తీ సైన్యం పై అరిజ్-ఇ-మమాలిక్ నియంత్రణ కూడా కొంత ఉండి ఉండవచ్చు.

వేరొక ప్రత్యేక యుద్ధాల్లో

ప్రత్యేక సందర్భాల్లో పవిత్ర యుద్ధాలప్పుడు (జిహాద్) కేవలం ముస్లిములనే సైన్యంగా చేర్చుకునేవారు. షరియత్ ప్రకారం ఆ యుద్ధ లాభాలలో $\frac{4}{5}$ వ వంతు వారికి $\frac{1}{5}$ వ వంతు

సుల్తాను ఆ దక్కిది. అప్పుడప్పుడు కోలకొండ సొంత గుర్రాలు, ఆయుధాలను వాలంటీర్లుగా సైన్యంలో చేరేవారు.

సైన్యాలకు సుల్తానే సర్వాధికారి. ప్రావిన్సుల్లో / ఇక్తాల్లో ముక్తీలే వారి సైన్యాలకు కమాండర్లు. దివాన్-ఇ-అర్జ్ గాని అరిజ్-ఇ-మమాలిక్ గాని సైన్యాధిపతులుగా వ్యవహరించాల్సిన అవసరం లేదు.

సైనికులు సాధారణంగా భూమి ద్వారా అప్పుడప్పుడు ధన రూపంలో పారితోషికం పొందేవారు. ముక్తీలు తమకు తమ సైన్యాలకు కలిపి ఆదాయం లో భాగం లేదా వారా వేరా సైనికులకు వ్యక్తిగతంగా జీతాలిచ్చే వారా తెలియడం లేదు. బహుశా మొదటి రకం విధానమే చెల్లుబడి ఉండవచ్చు.

బానిస రాజుల కాలంలో సైన్యంలో ఉన్న మతపరంగా ఏకత్వం/ , సౌభ్రాతృత్వం, ఇస్లాం మినహా విదేశంలో తామంతా ఒకట్ ఐక్యతా భావం వారి సైన్య సామర్థ్యానికి స్థానిక పాలకుల సైన్యం కంటే ఉన్నతంగా ఉండటానికి

కారగలిగాయి గాని ఉత్తమ వ్యవస్థీకరణ, కష్టం దీనికి
కారణం కాదు.

ఆర్థిక పాలన:

వీరికి షరియత్ ప్రామాణికంగా ఆదాయాలొచ్చేవి.

ఖరజ్ (హిందూ రైతులు, ముస్లిలు చెల్లించే భూమిశిస్తు) ఉష్ర్ (ముస్లిం రైతులు వర్షాధారిత భూములపై చెల్లించే భూమిశిస్తు, ఇది $\frac{1}{10}$ వ వంతు ఉండేది.) జిజియా (ముస్లిమేతరులు, బ్రాహ్మలు చెల్లించే మతపన్ను జిజియా నుండి స్త్రీలు, పిల్లలు, సాధువులు, బ్రాహ్మణులు మినహాయించబడ్డారు) ఖామ్స్ (యుద్ధాలలో దోచుకున్న సొమ్ములో $\frac{1}{5}$ వ వంతు సుల్తాను కు చెందుతుంది.) జకత్ (ముస్లింలు చెల్లించే మతపన్ను $\frac{1}{10}$ వ వంతు వారి ఆదాయంలో) అనే 5 ముఖ్య ఆదాయ మార్గాలు ఉండేవి. ఇవేకాక షరియత్ ప్రకారం భూగర్భ నిధులు, గనులు సుల్తానువే. ఇతర టోలు సుంకాలు మొ|| కూడా ఉండేవి.

బానిస పాలకుల ముఖ్యమైన ఆదాయ మార్గంగా యుద్ధాలలో కొల్లగొట్టిన ధనమేనని చెప్పవచ్చు.

న్యాయపాలన:

సుల్తాను సర్వోన్నత న్యాయాధిపతి. అతడు స్వయంగా కేసులు వాదనలు విని తీర్పు చెప్పేవాడు. ఉన్నత అప్పీలు సుల్తాను వద్దే. అంతే

అప్పుడప్పుడు అతడు కేసుల్లో సొంతంగా ప్రథమ విచారణ చేసేవాడు.

మత వివాదాల్లో సుల్తానుకు సద్ర్, ముఫ్తీలు సాయం చేసేవారు. ఇతర కేసుల్లో ముఖ్య కాజీ సాయపడేవాడు.

సుల్తాను తర్వాత ఉన్నత న్యాయాధికారి ముఖ్య కాజీ. ఇతడు ఇక్తాలు, జిల్లాల్లోని న్యాయాధికారుల్ని పర్యవేక్షించడం వారి వద్ద నుంచి వచ్చే అప్పీళ్లను విచారించడం చేసేవాడు. ప్రావిన్సులు, జిల్లాల్లో కాజీలను ముఖ్య కాజీ నియమించేవాడు.

ఆధునిక నగర మెజిస్ట్రేటుకు సమానమైన దాద్-ఇ-బక్ / అమీర్-ఇ-దాద్ పదవి కూడా ఉండేది. కేవలం హిందువుల వివాదాలు పంచాయితీలు విచారించేవి. హిందూ-ముస్లింలు పాల్గొనే వివాదాల్ని 'కాజీ' విచారించేవాడు.

పట్టణ పోలీసు అధిపతి గా 'కొత్వాలు' ఉండేవాడు. ఇతడు మెజిస్ట్రేటుగా కూడా వ్యవహరించేవాడు.

క్రిమినల్ చట్టం తీవ్ర శిక్షలు (హింసాత్మకమైన) విధించేది.

బానిస రాజులు ముగింపు

ప్రాంత ప్రజల జీవితాల్లో ఆలోచనా సంస్కృతి విధానాన్ని ప్రతిబింబించారు. కవుల్లో ప్రజల్ని స్ఫూర్తిపొందా సాధనాలేవి లేక, సంఘాలతో పోరు పరిపాలించారు చేసేవి.

## సమాజం – సంస్కృతి :

బానిస రాజులు మన దేశాన్ని పాలించే కాలంలో టర్కీలు, పర్షియన్లు, ఆఫ్ఘన్లు, అరబులు మన దేశం చేరారు. బానిస రాజులు టర్కీ జాతి ప్రాబల్యం మీద విశ్వాసంతో స్థానిక ముస్లిములను కూడా దూరంగా ఉంచారు. ~~అయినా~~ కాలక్రమంలో అనేక జాతుల మధ్య వివాహాలు జరిగి మిశ్రమ సమాజం ఏర్పడింది.

బానిస రాజులు ప్రధానంగా సున్నీలు. ముస్లిముల్లోని ఈ సున్నీలకు, షియాలకు అసలు పడేది కాదు. స్థానిక ముస్లిములకే రాజ్యోద్యోగాలు లేనప్పుడు ఇక హిందువుల సంగతి చెప్పనవసరం లేదు. అయితే వారి పాలనలో హిందువులు వర్తకం, పరిశ్రమలు, వాణిజ్యం నడిపేవారు. వ్యవసాయం చేసేవారు.

బానిస రాజుల పాలనా కాలంలో (13th Century) అమీర్ ఖుస్రూ, అమీర్ హసన్ లాంటి విఖ్యాత పర్షియన్ రచయితలు సుల్తానులచే ఆదరించబడ్డారు. చరిత్ర, మతం, కవిత్వ సాహిత్యాలకు చెందిన

పనులలో మాత్రమే ప్రవహించేది. ఇది (ప్ర)జల సొంతాలకు, రైతులకు, ~~కూలీల~~ కూలీల కార్మికుల వికాసం భూములకు సంక్షేమం కోసం కూడా ఎట్టి కృషి చేయలేదు. అట్టి రాజ్యా సొంతాలకు రాజ్యం అని అనలేదు. దాదాపు 85 వర్షా దాని పాలనానంతరం కూడా ఇది అప్పుడు భారత భూమి పై విదేశీ రాజ్యమే"

— (శ్రీ) వాత్సవ.

Q. Whom do you consider the real founder of the Delhi Sultanate? Give reasons.

Write ఆశీర్వాది & హబీబుల్లా's quotations

Ans. భారతదేశంలో మహమ్మదు ఘోరి జయించిన ప్రాంతాల & గవర్నరైన అతని మరణానంతరం క్రీ.శ. 1206 లో భారతదేశ ప్రాంతాలపై తన స్వాతంత్ర్యతను ~~[illegible]~~ ప్రకటించాడు కుతుబుద్దీన్ ఐబక్. ఇదే తర్వాత ~~[illegible]~~ కాలంలో ఢిల్లీ సుల్తానత్ గా ఎదిగింది.

అయితే ఢిల్లీ సుల్తానత్ కు వాస్తవ స్థాపకుడెవరన్న విషయమై చరిత్రకారుల్లో భిన్న అభిప్రాయాలున్నాయి.

అందరు <u>ఐబక్‌నే</u> ఢిల్లీ సుల్తానత్ స్థాపకుడంటారు. అందుకు వారు చూపే కారణాలు

1) ఘోరి రచించిన సింధు ఆక్రమణ లేనే పథకాన్ని ఆచరణలో పెట్టిన ఘనుడు ఐబక్. ఘోరి మధ్య ఆసియా పై దృష్టి కేంద్రీకరించగా భారత్ పై దృష్టి నిల్పి విజయవంతంగా ఆక్రమించినది ఐబక్.

2) ఘోరి మరణానంతరం భారత్ లో (ముస్లిం) తన అధీనంలో ఉన్న రాజ్యానికి ఎదురైన ప్రమాదాన్ని తప్పించిన వాడు ఐబక్. మధ్య ఆసియా

రాజకీయాలనుంచి భారత ను దూరంగా ఉంచాడు. తన కూతుర్ని ఇల్టుట్మిష్ కు ఇచ్చి భారతదేశంలో టర్కీ ప్రముఖులు తన అధికారాన్ని ఆమోదించేలా జాగ్రత్త పడ్డాడు. తన సోదరి ని కబాచా (Qabacha) కు ఇచ్చాడు. ఫలితంగా కబాచా లాహోరు, ఢిల్లీ లపై ఐబక్ ఆధిపత్యాన్ని గుర్తించాడు. గజనీ పాలకుడు పంజాబు పై దాడి చేయగా ఐబక్ యల్దజ్ (Yildiz) యుద్ధం చేసి వెనక్కి మరలించేశాడు. యల్దజ్ కూతుర్ని ఐబక్ వివాహం చేసుకొని సత్సంబంధాలు నెలకొల్పుకున్నాడు. గజనీ స్థానం ఖాళీ అయినప్పుడు దాన్ని ఖ్వారజం షా ఆక్రమించకుండా తానే వెళ్ళి అప్రమత్తంగా ఆక్రమించాడు, తద్వారా భారత్ ను రక్షించాడు.

3) బీహారు, బెంగాలులలో గల రాజకీయ అస్థిరతను రూపుమాపి ఢిల్లీ సార్వభౌమత్వాన్ని స్థాపించగలిగాడు.

4) రాజపుత్రులతో వివాదాన్ని నివారించాడు.

అయితే ఐబక్ ను

ఢిల్లీ సుల్తానత్ స్థాపకుడిగా పేర్కొనలేమని కొందరు చరిత్రకారులు క్రింది కారణాలు చెబుతారు.

1) భారతదేశంలోని ముస్లిం ప్రాంతాలన్నింటిపై ఐబక్ <u>పూర్తి ఆధిపత్యం కలిగి లేడు</u>. కొందరు టర్కీ అధికారులు దాదాపుగా స్వతంత్రంగా పాలించేవారు. ఉదాహరణకు ముల్తాన్ లో కుబాచా స్వాతంత్ర్యంతో ఉన్నాడు.

2) <u>ఢిల్లీకి గజనీకి మధ్య సంబంధం అంతమవ్వలేదు.</u> ప్రత్యేకించి ఢిల్లీ మహమ్మదు కేంద్రమైన గజనీ సార్వభౌమత్వం కింద ఉండవలసినవారు. ~~అందువల్లనే~~ యల్దజ్ ఢిల్లీపై సార్వభౌమత్వం కోరుతూ రాజచిహ్నమైన గొడుగు, పతాకాన్ని ఐబక్ మరణానంతరం రాజైన ఇల్టుట్మిష్ కు పంపించాడు. ఆ రోజుల్లో వాటిని సార్వభౌమాధికారులు సాధారణంగా ఖలీఫా నుంచి, లోబడి ఉన్న రాజులు తమ సార్వభౌముని వద్ద నుంచి పొందేవారు.

3) ఐబక్ 'సుల్తాన్' బిరుదును ధరించలేదు. తనని 'మాలిక్' అని 'సిపాసలార్' అని మాత్రమే చెప్పుకునేవాడు. దీన్నిబట్టి అతడు తనని తాను సార్వభౌమునిగా భావించుకోలేదని అర్థమవుతుంది. <u>సమకాలీన రచయిత ఫిరోజ్ షా</u> ప్రస్తావించిన సుల్తానుల జాబితాలో

ఐబక్ వేయలేదు.

4) ఐబక్ నాణేలు ముద్రించలేదు. ఆ రోజుల్లో కేవలం వాస్తవ సార్వభౌములు మాత్రమే నాణేల్ని ముద్రించేవారు.

5) ఐబక్ తన రాజ్యానికి నిర్దిష్ట సరిహద్దును కూడా ఇవ్వలేదు. అతని రాజ్య సరిహద్దు తరచూ మారుతూ ఉండేది.

6) రాజప్రతిష్ఠ ఇంకా అణగారి ఉంది. ఘోరి సమయంలో జయించబడిన కొందరు తిరిగి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు.

7) ఒక రాజ్యానికి తప్పనిసరి అవసరమైన ఏక రాజధానిని కూడా ఐబక్ ఎంచుకోలేదు. లాహోర్, ఢిల్లీ కేవలం రెండు సైన్య కేంద్రాలే. వాటిలో దేనికీ రాజధాని స్థాయి ఇవ్వబడలేదు.

8) ఐబక్ తన రాజ్యానికి చక్కటి పరిపాలన అందించలేదు. కనీసం ఉన్న పాలనా వ్యవస్థని కూడా అతడు బలోపేతం చేయలేదు.

అందువల్ల ఐబక్ తర్వాతి నాలుగో సుల్తానైన ఇల్టుట్మిష్ నే ఢిల్లీ సుల్తానత్ వాస్తవ స్థాపకునిగా పేర్కొంటారు. ఇందుకు పలు కారణాలు ఉన్నాయి.

క్రీ.శ. 1215 ప్రాంతంలో లాహోర్ వద్ద తరయుద్ధంలో యల్దిజ్ ను హతమార్చాడు. దాంతో గజనీతో శాశ్వతంగా సంబంధం తెగిపోయింది. మంగబార్నీ కి సాయం చేయక మంగోలుల బారి నుండి తప్పించుకున్నాడు. కబాచా మీద దాడి చేయగా కబాచా పలాయనంలో ముల్తాన్, సింధ ఇల్టుట్మిష్ వశమయ్యాయి. 1229 లో బెంగాలు, బీహారులను ఆక్రమించుకున్నాడు. రణతంభోర్, మండోర్, అజ్మీర్ మొ॥ రాజపుత్ర రాజ్యాల్ని జయించాడు. ఈ విధంగా ఐబక్ మరణానంతరం తలెత్తిన రాజ్యాల్ని అణచి అన్నింటినీ కేంద్రీకృతంగా[1] ఢిల్లీ పాలన కిందకి తెచ్చాడు.

ఇల్టుట్మిష్ తన శక్తి తో వదులుగా ముక్క ఘోరీ ఆక్రమిత ప్రాంతాల్ని (భారతలోని) చెక్కి ఢిల్లీలో దృఢమైన రాజ్యం గా మలచి ఢిల్లీసుల్తానత్ ను ఏర్పరచాడు. ఫలితంగా రాజ్యానికి స్పష్టమైన[2] సరిహద్దులు ఏర్పడ్డాయి.

రాజ్యాన్ని గజనీ నుంచి వేరుచేస్తు ఖలీఫా నుంచి (investiture) సార్వభౌమ చిహ్నాలు[3] పొందిన తొలి సుల్తాను ఇతనే. ఢిల్లీ సుల్తానత్ కు ఇక రాజధాని[4] లాగా ఇతడే ఉంచాడు. ఢిల్లీని పాలనా, రాజకీయ, సాంస్కృతిక, కళా కేంద్రంగా తీర్చిదిద్దాడు.

ఇల్టుట్మిష్ తన సైనిక శక్తి, మర్యాద, ఉదారత, మొ॥ లక్షణాల వల్ల ప్రజల

నుంచి తన కుటుంబం పై మిక్కిలి గౌరవాన్ని అనుబంధాన్ని సంపాదించుకున్నాడు. ఫలితంగా అతని పుత్రులు వారసులుగా సుల్తాను కావడానికి ప్రజల అంగీకారం దొరికింది. దాంతో ఢిల్లీలో మొదటి వంశం 'వారసత్వ పాలన'[5] ని నెలకొల్పిన వాడయ్యాడు.

ఢిల్లీ సుల్తానత్ కు అఖిల భారత స్థాయి మరియు పాలనా సర్వీసు[6] (పూర్తిగా విదేశీయులచే ఏర్పడినది) అందించాడు. ఇల్టుట్మిష్ ప్రారంభించిన 'ఇక్తా' పద్ధతి[7] ద్వారా సుల్తానత్ కు ఆర్థిక - పాలనా నియంత్రణ (జీత విధి) సంపాదించాడు. సార్వభౌమునిగా టంకా[8] నాణేలు ముద్రించాడు.

క్రీ.శ. 1211 లో తన సర్కారును రాజధానిని కనౌజ్ నుండి ఢిల్లీకి మార్చాడు. భారత రాజధాని గా ఢిల్లీ కి గౌరవాన్ని మధ్యయుగమంతా నిరంతరాయంగా అనుభవించింది.

ఈ విధంగా ఢిల్లీని అంతర్గత, బాహ్యుల ప్రమాదాలనుంచి రక్షించి 26 ఏళ్ళ పాటు సమర్థవంతంగా ఇల్టుట్మిష్ పాలించడమే ఢిల్లీ సుల్తానత్ కు నిజమైన, మనుగడ కి

పునికివచ్చే ప్రమాదాలు వేయడానికి దోహదమవుతుంది. అందువల్ల ఢిల్లీ సుల్తానత్ కు నిజమైన స్థాపకుడు గా ఇల్ టుట్ మిష్ ని చెప్పవచ్చు.

---

ఇల్ టుట్ మిష్ సాధించిన విజయాలు

1) శైశవ దశలో ఉన్న టర్కీ సామ్రాజ్యాన్ని పతనం కాకుండా కాపాడటం
2) మొదటి సారిగా దానికి చట్టబద్ధతని కల్పించటం
3) తన పుత్రులు ఢిల్లీ సింహాసనం కు వారసులవ్వాలా జాగ్రత్తపడి తద్వారా తన వంశ కొనసాగింపుకు మార్గం వేయడం.

ఢిల్లీ సుల్తానత్ కు రాజకీయ, మత ఆమోదాన్ని అందిస్తూ 1229 లో ఖలీఫా అల్-ముస్తానసిర బిల్లాహ్ రాజ చిహ్నాలని పంపాడు. ఈ గొప్ప విజయాల వల్లనే ఇల్ టుట్ మిష్ ను నిజమైన ఢిల్లీ సుల్తానత్ స్థాపకునిగా చెప్తారు.

" భారత దేశంలో ముస్లిముల సార్వభౌమత్వం అతనితోనే మొదలవుతుంది "

— ఆర్. పి. త్రిపాఠి

" ఢిల్లీ సుల్తానత్ ను దాని సార్వభౌమ స్థాయిని ఐబక్ రేఖామాత్రంగా ఏర్పరిచాడు. ఇల్ టుట్ మిష్ యే నిస్సందేహంగా దాని తొలి రాజు "

— హబీబుల్లా

# చిహాల్గని

క్రీ.శ. 1206 - 1290 మధ్య ఢిల్లీని పాలించిన బానిస వంశ రాజుల కాలంలోని టర్కీ ప్రముఖుల కూటమి ఇది. సుల్తాన్ ఇల్టుట్మిష్ కాలంలో ఇది అస్తిత్వం పొందింది. నిజానికి ఈ చిహాల్గని లోని సభ్యులందరూ వాస్తవంగా ఇల్టుట్మిష్ బానిసలు.

చిహాల్గని అంటే "నలభై" మంది ప్రముఖులని అర్థం. అయితే తర్వాతి కాలంలో (~~[illegible]~~) చిహాల్గని అనేది సంఖ్యతో పనిలేకుండా పాత బానిస అధికారుల్లో బలవంతుల సమూహం అనే అర్థం వస్తుంది.

ఇల్టుట్మిష్ రాజమర్యాదని కాపాడటం లో, చిహాల్గనీ ని సరైన నియంత్రణలో ఉంచటం లోనూ సఫలమయ్యాడు.

కానీ అతని మరణానంతరం సుల్తాను కు చిహాల్గనీ కి మధ్య తీవ్ర ఘర్షణ జరిగింది. చిహాల్గనీ విజయం పొంది ఇల్టుట్మిష్ వారసులపై తన పెత్తనం చెలాయించింది. ఈ కూటమి King makers గా తయారైంది.

ఇంత కాలం తనతో ఆ

చిహాల్‌గనీలోనే ఒకడైన బాల్బను అధికారం

పొందిన సుల్తాను అయ్యాడు. అతను, తన వారసులకు

సుల్తాను పదవి ని భద్ర పర్చుకోనేందుకు ఈ

చిహాల్‌గనీ నిర్మూలన అవసరమని బాల్బను

గుర్తించాడు.

## Liquidation of "the Forty"

## చిహాల్‌గనీ నిర్మూలన :-

1) జూనియర్ టర్కులను ఉన్నత పదవులకు నియమించి వారిని చిహాల్‌గనీ వారితో సమానం చేశాడు.

2) వారిలో / చిహాల్‌గనీలో చాలామందిని ప్రమాదకరమైన పనులపై రాజధాని నుంచి వెలుపలికి పంపేవాడు. మిలటరీ ఖర్చులను సదా తనతో సంచారం చేయించేవాడు.

3) చాలామంది పొమ్ము ప్రముఖులను వాయువ్య సరిహద్దులో ఇక్తాదార్లుగా నియమించేవాడు. దాంతో వారిని మంగోలులకు ఎదురుగా వాడుకునేవాడు. ఇలా చాలామంది ప్రముఖులు చనిపోతూ ఉండటం వల్ల

బాల్బను ఆ ఆసక్తికర కలహాలు వచ్చాయి. వారు పరస్పర సహకారం మరియు రహస్యాన్వేష లోపాలకి పరస్పరం నిందించుకుంటూ సదా ఘర్షణలో ఉండేవారు. దాంతో మందలు చీలిపోయి ఒంటరి పాలయ్యేవారు. ఈ ఒంటరి వైఖరిం కారణంగా బాల్బను వారిని నిర్బంధ చేయడం, శిక్షించడం ఆఖరికి మరణశిక్ష కూడా వేసేవాడు.

4) బాల్బను ప్రావిన్షియల్ గవర్నర్లుగా ఉన్న చహల్గనీ ప్రముఖులను తరచుగా బదిలీలు చేస్తుండేవాడు. తద్వారా వారు ఆ ప్రాంతంలో స్వతంత్రత పొందాలన్న స్వార్థపూరిత ఉద్దేశాలకి పాల్పడకుండా చేశాడు.

4) చహల్గనీలో ఉన్నది టర్కులే అయినా వారందరికీ ఒకప్పుడు ఇల్టుట్మిష్ బానిసలుగావడమన్నది సాధారణత చేకూర్చింది. బాల్బను టర్కీ సామ్రాజ్యం పేరుతో జూనియర్ టర్కులకి ఉన్నత పదవులనిచ్చి క్రమంగా నూతన టర్కీ ప్రముఖ వర్గాన్ని తయారు చేశాడు. ఇది క్రమంగా చహల్గనీ ని / పాత ప్రముఖుల్ని స్థానభ్రంశం (transplant) చేసింది.

5) అన్నింటికీ మించి బాల్బను తన తప్పులకి కూడా చహల్గనీ వారిని క్రూరంగా శిక్షించడం ద్వారా కూడా వారి

చేయించిన మారణకాండలో షేర్ ఖాన్ మరణానంతరం 53
అతని నిరంకుశ విధానాలకు అడ్డు లేకుండా పోయింది.
అతని క్రూరమైన విధానంలో చిహాల్గనీ లో సౌందర్య
విరుద్ధంగా మారిన వారిలో విపరీతమైన
భయాన్ని సృష్టించి మొత్తంగా చహల్గనీ
ప్రభావాన్ని నాశనం చేశాడు.

---

## చహల్గనీ - అంతర్గత కలహాలు

చహల్గనీ సభ్యులు పరస్పరం అసూయ కలిగి అంతర్గత కలహాలు సృష్టించుకోవడం కూడా జరిగేది. బాల్బన్ నాయిబ్ అవ్వడం, అతని బంధువులు అందరూ ఉన్నత పదవుల్లో ఉండడం టర్క్, తాజిక్ ప్రముఖుల్లో అసూయ కలిగించింది. చహల్గని సభ్యుల్లో అతి పెద్ద వయస్కుడైన (Qutlugh Khan) 'కుతలుగ్ ఖాన్' ఈ అసమ్మతి వర్గానికి నాయకుడు. ఈ వర్గం వారి వల్లే 1253 లో బాల్బన్ ను నాయిబ్ గా తొలగించి ఇక్తాదారుని చేశాడు సుల్తాన్. అంతేగాక బాల్బన్ మద్దతుదార్లు, బంధువుల్ని కూడా పదవుల్లోంచి తొలగించి వేశాడు సుల్తాన్, అసమ్మతి

ఇబ్బంది వల్లనే.

అయితే బసాలతజంగ్ సమస్యల్లో 'నాయబ్' అవరవ్రాలన్యదీనిపై అంగీకారం కుదరక స్థానిక ముస్లిం ఇమదుద్దీన్ రైహాన్ ను వకీలుదారుగా నియమింపచేశారు. నిజాం ఉల్ ముల్క్ ఖుర్షీద్ వకాలు గా నియమింప బడ్డాడు.

అయితే బాల్యను ఊరుకోలేదు. తన ఇక్క నాగోరు నుండి యువజలు చేశాడు. రామలింగంభొట్ల ను కలిసి ధనాన్ని కొల్లగొట్టి సంపద పెంచుకున్నాడు. మెల్లగా బసాలతజంగ్ సన్నిహిత్యం రైహాన్ వైపు నించి తన వైపుకు మరల్చుకున్నాడు. దారిలో సుల్తాను బాల్యను తిరిగి బసాలతజంగ్ బలాన్ని అనుకూలించి రైహాన్ ను తొలగించి తిరిగి ఇక్క ఆ నుండి అతని బాల్యన్ ను నాయబ్ ని చేశాడు.

# చిహాల్గనీ - సుల్తానులతో సంబంధాలు

ఇల్టుట్మిష్ కాలంలో అస్తిత్వం పొందిన టర్కీ ప్రముఖుల బృందమే చిహాల్గనీ, ఇందులో సభ్యులంతా బానిసలు ఇల్టుట్మిష్ బానిసలే.

ఇల్టుట్మిష్ ఇట్టి రాజ మర్యాద కాపాడుతూ తన చిహాల్గనీని సరైన నియంత్రణలో ఉంచగలిగాడు. చిహాల్గనీ ఇల్టుట్మిష్ మీద వ్యక్తిగా అతని వ్యక్తిత్వం మీద ఎక్కువ విధేయత ప్రదర్శించేవారు. అయితే వారు రాజ్య వ్యవహారాలలో తమను భాగస్వాములుగా భావించుకుంటూ రాజ్యనిర్మాణం తమ ఉమ్మడి కృషి ఫలితమని అనుకునేవారు.

అందువల్లనే వారు అతని మరణానంతరం ప్రతిభ, సామర్థ్యాలకు బదులుగా వారసత్వ సూత్రాన్ని (సుల్తాన ఎంపికకు) ఇష్టపూర్వకంగా పాటించారు. పైగా బహుశా ప్రతిభ-సామర్థ్యం సూత్రం మీదనే ఇల్టుట్మిష్ సుల్తానయ్యాడు. అందువలన ఇల్టుట్మిష్ వారసులకు చిహాల్గనీకి మధ్య రాజకీయ పోరాటం సాగింది.

ఇల్టుట్మిష్ కోరికకు విరుద్ధంగా చిహాల్గనీ రజియాను కాదని రుక్నుద్దీన్ ఫిరోజ్‌ను సుల్తానుగా చేసింది. కాని అతని తల్లి అనవసర జోక్యం తో విసిగి రజియానే సుల్తానాగా అనివార్యంగా అంగీకరించింది చిహాల్గనీ.

రజియా తనను సుల్తానా

వారసురాలిగా బలపర్చుకుని షాంసీ ప్రముఖుల

ప్రభావాన్ని, ఒత్తిడి & తలొగ్గడాన్ని నిరాకరించింది.

చిహాల్గని రజియాను పొరపాలన, స్త్రీక పరదా

వెల్లుబాపడంలో విఫలమై ఆమె వ్యక్తిత్వానికి

లేనిపోని అంటగట్టి ప్రజాభిమానాన్ని దెబ్బతీశారు.

కుట్రలతో రజియాను హతమార్చారు.

రజియా తర్వాత చిహాల్గని

పూర్తిగా King Makers గా అవతరించింది.

బహ్రాం షా (x) అల్లాఉద్దీన్ మసూద్ షా

సుల్తానులు చిహాల్గని చేతి కీలుబొమ్మలు.

తర్వాత చిహాల్గని నాసిరుద్దీన్ మహమ్మదు

ను సుల్తానుగా నియమించింది.

(x) షాంసీ ప్రముఖుల్లో ఒకడైన ఇజ్జుద్దీన్ కిష్

తనను బహ్రాం షా తర్వాత సుల్తానుగా ప్రకటించు

కున్నాడు. కాని అమీర్ సమాచరులు దీనికి

అంగీకరించక ఇల్టుట్మిష్ మనవడు

అల్లాఉద్దీన్ మసూద్ షాను సుల్తాను గా

నియమించారు.

నాసిరుద్దీన్ కాలంలో ఈ

చిహాల్గనిలో ఒకడైన బాల్బను

లాహోర్ వజీరుగా తర్వాత నాయబ్-ఎ-మామ్లికాత్ గా నియమింపబడి (defacto ruler) వాస్తవంలో అధికారంలో సర్వాధికారాలు అతనే చెలాయించాడు.

నాసిరుద్దీన మరణానంతరం వారసుల్లో సూత్రం పక్కకు పెట్టి చిహాల్గనీ సభ్యుడైన బాల్బనే సుల్తాన్ అయ్యాడు.

చిహాల్గనీ సభ్యునిగా దాని అభిమతం, శక్తి తెలిసిన బాల్బన ముందుగా సుల్తాన చిహాల్గనీ సభ్యుల్లో ప్రధమయ్య భారాన్ని అడ్డు పెట్టాడు. సుల్తాన దైవాంశసంభూతుడని " భూమి పై దేవుని నీడ " అని నిర్వచించినాడు. చిహాల్గని వారిని సుల్తాన ముందు చాలా స్వల్పం చేశాడు. సిజ్దా, పైబోస్ లను చిహాల్గనీ కూడా వర్తింప చేయడంతో వారు పూర్తిగా దిగజార్చబడ్డారు. తన పదవికి తన వారసత్వం / వారసులు కుమారునికి ఈ చిహాల్గని ఉనికి తెలుసుకొని పలు క్రూర విధానాల ద్వారా దాన్ని నిర్మూలించాడు.

బాల్బను మరోవైపు తనకు విశ్వాసపాత్రులైన, విధేయులైన ప్రముఖుల వర్గాన్ని " బాల్బని ", తురుష్కని ఏర్పరచాడు. అయితే చిహాల్గని లాటి పలుకుబడి సమర్థులు

మట్టుపెట్టడం వలన రాజ్యం వారి సేవల్ని కోల్పోయింది. ఈ లోటును అంతగా అనుభవం లేని, అల్ప "బాల్బని ప్రముఖులు" తీర్చలేకపోయారు. ఇదే ఆ తర్వాత ఇల్బరీల పాలన అంతమవ్వడానికి కారణమై ఖిల్జీల పాలనకి దారులు వేసింది.

"ఇల్‌టుట్‌మిష్ కుటుంబ చరిత్ర లో ముఖ్య రాజ్యాంగ ఆసక్తి సుల్తాను కు అతని టర్కి ప్రముఖులకు మధ్య వాస్తవ అధికారం కోసం జరిగిన పోరాటం లాగే ఉంది"

— ఆర్. పి. త్రిపాఠి

Q. 'Her sex was her (Razziyya's) enemy' – Comment.

Ans: క్రీ.శ. 1236-40 ల మధ్య ఢిల్లీ నేలిన ఇల్బరీ టర్కిష్ పాలకురాలు రజియా. ఈమె ఢిల్లీ సుల్తానులలోనే గాక మధ్యయుగాలలోనే ప్రత్యక్షంగా ఢిల్లీ సింహాసనం అధిష్టించిన ఏకైక మహిళ.

ఇల్టుట్మిష్ బాల్యం నుంచి యుద్ధవిద్యలో శిక్షణ అందిస్తూ రజియాను కొడుకు లాగానే పెంచాడు. సార్వభౌమ లక్షణాలు ఆమెలో గమనించి తనతర్వాత ఆమెనే తన వారసురాలిగా ఇల్టుట్మిష్ ప్రకటించాడు. అయితే అతని మరణానంతరం స్త్రీ చే పాలింపబడటం అవమానకరంగా భావించి టర్కీ ప్రముఖులు అతని కొడుకుని సుల్తాన చేశారు. అది లానే 'అరది' కావడం రజియాకిలా చుక్కెదురైంది.

కాని సుల్తాన రుక్నుద్దీన దుష్ట పాలన, రజియాపై ప్రజాభిమానం [illegible] ఆమెను సుల్తాన చేశారు. ఒక స్త్రీ సుల్తాన కావడం పై టర్కు ముస్లిం మత గురువులు, టర్కు చహల్గానీ ప్రముఖులు అనేక అసంతృప్తులనే ఉన్నారు.

రజియా సుల్తాన అయిన వెంటనే 'విభజించి పాలించు' విధానం ద్వారా తనకు వ్యతిరేకంగా ఉన్న టర్కీ ప్రముఖుల ఐక్యత ని విచ్ఛిన్నం చేసింది. వజీరు జునైది పారిపోయి సిర్మూర్ (Sirmur hills) కొండల్లో దాగవాల్సి వచ్చింది. లక్నో నుంచి దేబల్ దాకా, మాలికలు, అమీరులు ఆమెకు తమ విధేయతని ప్రకటించారు. ఇట్లా రజియా స్వతంత్ర పాలకురాలిగా ఎదిగి చిహాల్గనీ లాంటి ఉండేందుకు నిరాకరించింది.

తను చెప్పుచేతల్లో మెలిగే సుల్తాను కోసం చూస్తున్న టర్కీ ప్రముఖులకు రజియా స్వతంత్రత మింగుడు పడలేదు. ఎలాగైనా ఆమె అడ్డు తొలగించుకోవాలనుకున్నారు. ఇదే ఆమె పతనానికి ప్రథమ కారణం. చిహాల్గని అధికార వాంఛయే ఆమె ప్రథమ శత్రువు.

రజియా రణతంత్రం భారత ని సేవించి సైనిక పాలనా సామర్థ్యాన్ని చూపింది. స్వయంగా న్యాయవిచారణ చేసి సరైన తీర్పులు చెప్పేది. దేశంలో శాంతి భద్రతలకు, చక్కని పాలనకు మొక్కలకు సమానముగానా ఆజ్ఞలు జారీ చేసి పారపాలన లో నేర్పు చూపింది.

దారిలో సంప్రదాయ, సనాతన ముల్లాలు, చాందసవాద ప్రముఖులు కాక, పరిపాలన లో రజియా తెలివితేటల్ని చూసాక ఆమె వ్యక్తిత్వానికి లోపాల్ని అంటగట్టారు.

రజియా పాలనా ప్రారంభం నుంచీ పరదా తొలగించి పురుష వేషధారణలో కొలువు తీర్చి పాలించేది. సైన్యాన్ని ఉత్తేజపర్చటానికి వేట చేసేది. ప్రజాదరణ పెంపొందించుకోవటం కోసం ఏనుగుపై వీధుల్లో రాజ ఊరేగింపులు జరిపేది. ప్రజలు వీటి పట్ల హర్షాతిరేకాలు చూపిస్తే ముల్లాలు, చాందసవాద మాత్రం ఇస్లాం సంప్రదాయాన్ని కాలరాస్తుందని ప్రచారం చేసారు. పైగా (పబ్లిక్, ఇల్తుట్మిష్ కాలంలో కూడా ఉన్నత పదవులందే ఉన్న) అబిసీనియన్ బానిస జాలాలుద్దీన్ యాకూబ్ ను రజియా రాజ అశ్వాలకు అధిపతిగా నియమించటాన్ని సాకుగా చూపి వారిద్దరికి అక్రమ సంబంధాన్ని అంటగట్టారు.

ఢిల్లీలో రజియాకి కొంత ప్రజాభిమానం ఉండటంతో ఢిల్లీ బయట ఆమెని అంతమొందించదలిచారు. యాకూబ్ తో సంబంధం టర్కీల ఔన్నత్యానికి భంగకరమని లాహోర్ గవర్నరు కబీర్ ఖాన్ తిరుగుబాటు చేయగా రజియా స్వయంగా వెళ్ళి అణచివేసింది. కానీ భటిండా

గవర్నర్లు తిరుగుబాటు అంచేత బలహీనపడింది.
చిహాలగనీ భటిండా గవర్నర్లు అల్తూనియా కి
సరైన ప్రోత్సాహం ఇవ్వలేదు. దాంతో రజియా అల్తూనియా
ని వివాహమాడి ఢిల్లీ గద్దె కి చివరి పోరాటం
చేస్తూ మరణించింది.

రజియా నామమాత్ర పాలకురాలి
గా ఉండకపోవడం వల్ల చిహాలగని లాంటి వారికి నచ్చక
పోవటం ఆమె కి ప్రథమ శత్రువు. అయితే సైనిక,
పౌర పాలన లో అసాధారణ ప్రజ్ఞ గల రజియాను
తొలగించేందుకు వేరే మార్గం లేక ఆమె స్త్రీత్వం
ఆధారంగానే ఆమె ని తొలగించ గలిగారు
శత్రువులు. అందువల్ల ఆమె స్త్రీత్వం రజియా కి
ద్వితీయ శత్రువు.

రజియా స్త్రీ యే అయినా
చిహాలగనీ చేతి లో బొమ్మ అయినట్లయితే
సుల్తాన్ గా కొనసాగ గలిగేది. లేదా రజియా స్త్రీ
కాక పురుషుడిగానే జన్మించినట్లయితే తన
సామర్థ్యం చేత చిహాలగనీ ని అదుపులో ఉంచి
చిరకాలం పాలించి ఉండేది. ఈ రెండూ
జరగక పోవటమే రజియా పతనానికి కారణం.

ఏ మైనా మినహాజుస్ సిరాజ్
తన 'తబకత్ ఇ నాసిరి' లో అన్న

సుల్తాన రజియా గొప్ప
పాలకురాలు. ఆమె తెలివి, న్యాయం, ఉదారత కలిగినట్టిది.
తన రాజ్యానికి మేలు చేకూర్చేది. సరైన న్యాయం
అందించింది. తన ప్రజల రక్షకురాలు. తన సైన్య
నాయకురాలు. ఒక రాజుకి ఉండాల్సిన లక్షణాలన్నీ
ఆమెకి ఉన్నాయి, కాని ఆమె సరైన లింగంలా
జన్మించలేదు. అందువల్లనే మగవారి అంచనాలా
ఈ గొప్పలక్షణాలన్నీ కొరగానివి విలువలేనివి"
అన్న ఈ మాటలు చేదునిజాలు.

30.7.03

# అల్లాఉద్దీన్ ఖిల్జీ రెవెన్యూ మరియు మార్కెట్ సంస్కరణలు

క్రీ.శ. 1296 - 1316 మధ్య కాలంలో ఢిల్లీనేలిన 'అల్లాఉద్దీన్' ఖిల్జీ వంశీయులలోనే గాక ఢిల్లీ సుల్తానులందరిలోనూ సమర్థుడు. ఇతడు అద్భుతమైన తన నవీన సంస్కరణలచే చరిత్రలో తర్వాత షేర్షాసూర్, అక్బరులకు సైతం మార్గదర్శకుడు కాగలిగాడు.

## రెవెన్యూ సంస్కరణలు :- లేదా వ్యవసాయ చర్యలు :-

కారణాలు : 1) సుల్తానుల పై స్వామ్యాన్ని నిర్మూలించుటకు

2) ప్రభుత్వమును నిర్మూలించుటకు

3) ~~గ్రామాల్లో~~ ఉన్నత వర్గం వారు పెద్దలు తమ పన్ను భారాన్ని రైతుల మీదకి నెట్టి విలాసవంతమైన జీవితం గడుపుతున్నారు. వారి వైభవం వారిని ధిక్కారులుగా చేసింది. వారు రెవెన్యూ అధికారులను గౌరవించటం లేదు. కనీసం కలిసి వస్తున్నా వారు రెవెన్యూ అధికారులను

తెలపడం లేదు. వీరి పొగరు ఉలేమాలకి ఇష్టంలేని కొత్త సంస్కరణలు చేయక తప్పలేదు.

4) ఇక్తాదార్లని పూర్తిగా పెట్టి కేంద్రాన్ని లేదా సుల్తాను స్థితిని పటిష్టం చేయడం కోసం.

5) ప్రైవేటు వ్యక్తుల దగ్గర అదనపు ప్రముఖుల దగ్గర అధిక ధనం ఉండడం వారిని తిరుగుబాటుకి ప్రోత్సహిస్తుందని సుల్తాన నమ్మాడు. అందువల్ల ఈ ప్రమాద మూలాల్ని నిర్మూలించడం కోసం ఖిల్జీ కొత్త ఆర్థిక విధానాన్ని, రాజ్య రెవెన్యూ వ్యవస్థలో మార్పుల్ని ప్రవేశపెట్టాడు.

6) దీపాల్పూర్, లాహోర్ల నుంచి కారా (ఆధునిక అలహాబాదు వద్ద) వరకు గ్రామాల్ని ప్రభుత్వానికి చేరువగా తీసుకొచ్చాడు, రైతులతో ప్రభుత్వానికి ప్రత్యక్ష సంబంధాలు ఏర్పరిచాడు.

7) తన పాలనలో చైతన్యాన్ని, సామర్థ్యాన్ని నింపేందుకు

8) పాలనలో మౌలికమైన మార్పు ద్వారా దేశవనరుల్ని పూర్తిగా సద్వినియోగం చేసుకుని తన ఆదాయాన్ని ఉత్పత్తుల శిస్తు ద్వారా పెంచడం.

సంస్కరణలు :-

1) ఆలి బర్నీ ముస్లిం ప్రముఖులకు, మత పెద్దలకు మునుపటి సుల్తానులు బహూకరించిన మిల్క్ (ప్రభుత్వమిచ్చిన ప్రైవేటు భూములు) ఇనాము (ఉచిత బహుమతి) ఇద్రాత్ (పింఛను) వక్ఫ్ (ఎండోమెంట్లు) మొ॥ వాటిని రద్దు చేశాడు. అయితే బహుమానాల కింద వారి వద్ద ఉన్న భూమిని రాజ్యం తన పరం చేసుకుంది.

ఐతే అందరి భూములూ పూర్తిగా రాజ్యం వశపర్చుకుందనడం నమ్మశక్యం కాదు. కొందరి భూములు అసలు ముట్టుకోలేదని తెలుస్తుంది. ఆ తర్వాత రాజు/సుల్తాన్ పాలనాకాలంలో ఇలాంటి బహుమానాల భూములు గలవారు ఎందరో

ఉండడమే లేదని నిదర్శనం.

2) అల్లాఉద్దీన్ రాజ భూముల్లో 'జమిందారీ ఇద్దారీ' ని రద్దు చేశాడు. జాగీర్లను, వ్యక్తుల్ను రాజ్యం వశపర్చుకుంది. రాజ్యానికి చేసిన సేవకు గాను భూముల్ని ఇవ్వడానికి స్వస్తి చెప్పి ధనాన్ని ఇచ్చేవాడు.

అయితే ఈ భూముల్ని ఆదాయాన్ని రాజ్యం పూర్తిగా వశపర్చుకుని ఉండదు. ఆ భూముల 'నిర్వహణ' ని మాత్రమే ప్రభుత్వం అనపరం చేసుకుని ఉంటుంది అని కె. ఎస్. లాల్ తన "ది ఖిల్జీస్" లో అభిప్రాయపడ్డారు.

3) ఢిల్లీ సుల్తానుల కాలం నాటి భూములలో చాలా భాగం హిందూ తెలియబడినవారల కింద వారసత్వ హక్కుగా ఉండేది. బరనీ వీరిని 'బలాహార్లు' అన్నాడు. ఆ కాలంలో 'రాయ్', 'రావత్', 'ఠాకూర్' లని పిలవబడే వారు, (బరనీ వీరిని 'ఖుట్స్' 'ముకద్దమ్స్' 'చౌధరి' లుగా చెప్పాడు) వీరు semi-official కొందరుండేవారు. వీరు గ్రామ నాయకులు, గ్రామ పెద్దలు. వీరు

"బీసవ" ను కొత్త కులాల ప్రమాణంగా నిర్ణయించారు. (ప) భూస్వామ్య దివాండుగా ఉత్పత్తిలో సగ భాగాన్ని నిర్ణయించారు. మహాలులో ఏ మాత్రం తగ్గుదలకు అవకాశం లేదు. ఈ నియమం ఖూటేలు (భూస్వాములు) మరియు బలూతోళ్ళు (సాగుదారులు) లకు ఏ మాత్రం తేడా లేకుండా ఒకే విధంగా వర్తిస్తుంది.

2) రెండవ చర్యగా పశువుల మీద పన్ను విధించాడు. పచ్చిక బయళ్ళని వాడుకున్నందుకు ప్రతి పశువుకి నిర్దిష్ట పన్ను విధించాడు. ఇది ధనికులకి, పేదలకి ఉన్నత, తక్కువ వర్గాల వారందరికీ వర్తిస్తుంది.

అల్లావుద్దీన ఈ ఖూట్లకి ఉన్న ప్రత్యేక హక్కు 'ఖూతి' - శిస్తు వసూలు చేసినందుకు పొందే ప్రతిఫలాన్ని రద్దు చేశాడు.

ఖూటేలు విషయాలలో వివరాలు సరిగా తెలియడం లేదు. బరాని చెప్పినదాన్ని బట్టి బహుశా వీరు వారి వ్యక్తిగత సాగులోని ఉన్న భూమికి మాత్రమే పన్ను కట్టాలి గాని ఇతర రైతులందరి తరఫున పన్ను కట్టడం నియమం అయ్యి ఉండదు. ఇదే నిజమైతే

ఉన్నదే కానీ ఢిల్లీ సుల్తానులెవరూ క్షుణ్ణంగా దీన్ని అమలుపరచలేదు. అందువల్ల ఈ విధానాన్ని పునరుద్ధరించి అధికారికంగా ప్రవేశ పెట్టిన ఘనత అల్లాఉద్దీన్ ఖిల్జీదే! తన శిస్తు నిర్ణయానికి ముందుగా పట్వారీ రికార్డుల నుంచి మొత్తం సాగు భూమి ఎంత, తన రాజ్యంలో ప్రతి గ్రామ ఆదాయం/రెవెన్యూ ఎంత మొ॥ విషయాల వివరాలు సేకరించాడు — “బందోబస్తు” చేశాడు.

అయితే అల్లాఉద్దీన్ రాజ్యం తరువాత ఈ భూ కొలతల్ని (paimaish) ప్రవేశపెట్టడం సాధ్యపడలేదని బరానీయే రాశాడు.

*) సాగులో ఉన్న భూమి కొలతల మీద, ఒక బిస్వాకు (బిఘాలో $\frac{1}{20}$ వ వంతు) ఎంత పంట పండుతుందన్న లెక్క మీద ఆధారపడి ప్రభుత్వ వాటా నిర్ణయించబడేది. ఇది గాక చరాయి (పుల్లరి) ఘరీ (ఇంటిపన్ను) ఉండేవి. భూమిశిస్తును ధాన్య రూపంలో కాని ధన రూపంలో కాని కోరేవారు. అందువల్ల తెలంగాణ బంజారాలు & [illegible]దమో స్థానిక మండీలలో అమ్మేయడమో చేసేవారు.

6) తన రెవెన్యూ సంస్కరణలు సమర్థంగా అమలు జరగడానికి నిజాయితీపరులైన, సమర్థులైన అధికారులు ఎంతో అవసరం. అయితే శిస్తు భూముల్లో పెంచడం వలన ఎంతో మంది ముస్తౌఫీలు(accountants), అమీలులు (collectors) మరియు గుమాస్తాలు కావాల్సి వచ్చారు. అల్లాఉద్దీన్ ~~ఈ~~ అధికారుల అకౌంట్లను / ఖాతాలను సరిగ్గా ఆడిట్ చేయడానికి నాయబ్ వజీర్, షరఫ్ ఖైస లను నియమించాడు. గ్రామ ఖాతా పుస్తకం పట్వారీల వద్ద ఉంటుంది. వీరి నిజాయితీని కాపాడటానికి అల్లాఉద్దీన్ వీరికి మంచి వేతనాలు ఇచ్చేవాడు.

## సమకాలీన సమాజంపై రెవెన్యూ సంస్కరణల ప్రభావం :

1) గ్రామ ప్రాంతాల ప్రజలలో ప్రభుత్వ సంబంధాలు పెరుగుటకు ఈ రెవెన్యూ సంస్కరణలు ఎంతో దోహదం చేశాయి.

2) ఈ సంస్కరణ ఫలితంగా పెరిగిన రెవెన్యూ భారాన్ని అన్ని వర్గాల ప్రజలు రైతులు, భూస్వాములు, ఖోతులు, వర్తకులు అందరూ మోయాల్సి వచ్చింది. కొందరు భూస్వాముల వక్ఫ్ భూముల్ని రద్దు చేయడంతో పాటు ముస్లిం ప్రముఖుల వద్ద నుంచి ఇనాము భూముల్ని కూడా ప్రభుత్వం

జప్తు చేసింది. అందువల్ల ఈ సంస్కరణల వెనుక మంచి ఉద్దేశం ఉందని చెప్పలేము. అయితే శిస్తుపద్ధతిని గురించి ఏదో గాని భూమి మీద ఆధారపడ్డ వారిలో అత్యధికులు పేదవాళ్లే కావడం వలన అధిక భారం వారే మోయాల్సి వచ్చింది.

3) భూమిశిస్తు వసూళ్లలో అవినీతి పెరిగిపోయింది.

4) భూస్వాములు తమ పన్ను భారాన్ని రైతుల మీద నెట్టే దుష్టచర్య ఆరంభమయింది.

5) అయితే అధిక భూమిశిస్తు వల్ల భూస్వాములు తమ ప్రాభవం కోల్పోవటమే గాక సామాన్య రైతులు సైతం నానా కష్టాలు పడాల్సి వచ్చింది.

6) ఈ రెవెన్యూ సంస్కరణల అమలుకు నియమించబడ్డ అధికార్లు అవినీతి సుల్తాన్ లాగా శాసించేవారు.

"ప్రజలు రెవెన్యూ అధికార్ల జ్వరం కంటే ఘోరమైన విధంగా చూసేవారు. గుమాస్తాపని గొప్ప నేరం, ఏ మనిషీ తన కుమారుణ్ణి ఒక గుమాస్తాగా పెట్టేవాడు కాదు"

— బర్నీ

సరియైనా లెక్క పన్ను లేదా భూమిశిస్తు కట్టడం,
విధేయులుగా ఉండడం చేసి ఉండవచ్చు.

9) గ్రామాల్లో సామాన్య ప్రజలపై స్థానిక ఉన్నతవర్గాల వారి ఆగడాలు తగ్గించాడు.

10) స్థానిక అధికారుల ఖాతాలను ఆడిట్ చేయడానికి (ledger books) పత్రాలు అనే గ్రామ పట్వారీ పుస్తకాన్ని వాడడం మొ॥ సూక్ష్మ వివరాలు, ప్రమాణాలుగా దిశానిర్దేశంగా చేసి అల్లాఉద్దీన్ తర్వాతి సుల్తానులకు, షేర్షా సూర్, అక్బరులాంటి వారికి ఆదర్శమయ్యాడు.

11) ఉన్నత వర్గాల వారి ఆదాయాల్ని పరిమితంగా ఉంచాలన్న అల్లాఉద్దీన్ కాంక్ష పాక్షికంగా మాత్రమే నెరవేరింది. అతని తర్వాత వచ్చిన సుల్తాన్ ముబారక్ షా ఖిల్జీ, తుగ్లక్‌ల గౌరవ వర్గాల్ని ప్రసన్నం చేసుకున్నాడు. పైగా అల్లాఉద్దీన్ రెవెన్యూ సంస్కరణలు చాలా సడలించివేశాడు, ఎత్తేశాడు. అందువల్ల దీర్ఘకాలిక ప్రభావం ఉన్నట్లు కన్పించదు.

12) ఈ సంస్కరణలు గ్రామాల్లో మార్కెట్ ఆర్థిక వ్యవస్థని నెలకొల్పాయి. దాంతో నగరాలకి, గ్రామాలకి సన్నిహిత సంబంధం పెరిగింది. ఇది సుల్తానులా కేంద్రీకృత పునర్నిర్మాణానికి తోడ్పడం చేసింది.

13) ధన రూపంలో శిస్తు – రైతుల కష్టాలు.

Causes :

1) మత్తు పదార్థాల వాడకం పై నిషేధం, జూదగృహాల మూసివేత వంటి చర్యల ద్వారా ప్రభుత్వ ఖజానాకు వచ్చిన నష్టాన్ని అసాధారణంగా భూమిశిస్తు పెంచడం ద్వారా అల్లావుద్దీన్ ఖల్జీ పూడ్చుకున్నాడు.

30.7.03

# మార్కెట్ సంస్కరణలు

అల్లాఉద్దీన్ ఖిల్జీ సంస్కరణలన్నింటిలోకి అతనికి మిక్కిలి పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టినవి ఈ మార్కెట్ సంస్కరణలే.

కారణాలు:

1) సుల్తానుల సామ్రాజ్యాన్ని నిర్వహించాల్సి రావడం, మంగోలుల ఉపద్రవం నుంచి తన రాజ్యాన్ని కాపాడుకోవాలన్న తపన అల్లాఉద్దీన్ ను పెద్ద సైన్యం ఏర్పాటుకు ప్రోత్సహించాయి. 1303 లో ఆయన చిత్తోడ్ ఆక్రమణ ఇటు మంగోలుల దాడి మధ్య చిక్కుకొని రెంటినీ సమర్థంగా ఎదుర్కొన్నాడు. అయితే ఈ విధ సంఘటనల తర్వాత శాశ్వత, విస్తృత సైన్యాన్ని సర్వ సన్నద్ధంగా ఉండే విధమున ఏర్పాటుకై ఆలోచన పెట్టింది. అయితే అల్లాఉద్దీన్ సైన్యం సుల్తానులకు ప్రముఖులైనా సుఖ జీవనాన్ని గడిపేవారు. అందువలన అల్లాఉద్దీన్ కు సాధారణ జీతాలతో వారి జీవన ప్రమాణాన్ని దెబ్బతీయకుండా సైనికుల సంఖ్య పెంచడం ఎలాగా అన్న సమస్య వచ్చింది.

2) దక్షిణ దిగ్విజయ యాత్రల వల్ల అధికంగా రాజధాని
లోకి వచ్చిన బంగారం, వెండి ఫలితంగా ధరలు పెరగడం
జరిగింది. సైన్యానికి పెంచితే వారి జీతాల రూపంలో
ధన ప్రవాహం పెరిగి ధరలు మరింత పెరగడం సహజంగా
జరుగుతుంది. (ఇది (మళ్ళీ) సైనికుల జీతాల్ని
వచ్చే సంవత్సరాల్లో పెంచడానికి) ధరలు పెరగడమన్నది
రాజ్య కాలంలో సైనికుల జీతాల్ని పెంచాల్సి రావడానికి
కారణం కావచ్చు. ఈ విధంగా కనుక జరిగితే
సుల్తాన్ ఖజానా ప్రస్తుతం నిండుగా ఉన్నప్పటికీ 5, 6
ఏళ్ళల్లో ఖాళీ అయిపోయే ప్రమాదం ఉంది.
అందువల్ల సుల్తాన్ రాజ్య ఆర్థిక వ్యవస్థని ద్రవ్యోల్బణానికి
వినాశనం నుంచి, ధరల పెరుగుదల నుంచి
కాపాడటానికి ఆతురతతో ఉన్నాడు.

3) ముస్లిమ్ రాజులు సాధారణంగా జీవితావసరాలు
ముఖ్యంగా ఆహార ధాన్యాలు నగర ప్రజానీకానికి
సరసమైన ధరలకు లభించేలా చూడాలని కోరుతూ
కోరేవారు. ఎందుకంటే ముస్లిం ప్రపంచమంతటా
శక్తి, అధికార కేంద్రాలుగా నగరాలే ఉండేవి. గ్రామ
ప్రజల్ని వెనుకబడిన వారిగా, తమ ఇరుకు ప్రపంచాల
మునిగిపోయేవారిగా పరిగణించేవారు.

4) బరానీ చెప్పిన మరొక కారణం (సైన్యం కోసం కాక) అల్లాఉద్దీన్ ఏ సాధారణంగా ఉన్న ఖాందా ప్రజావిధాన్ని విడదీసి చేసివేయాలని విధానాలు. అలా చేయడం వల్ల వారికి సుల్తాన్ పై తిరుగుబాట్లు పన్నే అవకాశం, సమయం, ఆలోచన ఉండదని సుల్తాన్ భావించాడని బరానీ వివరించాడు.

5) "ఖైరుల్ మజలిస్" లో అల్లాఉద్దీన్ కాలంలో హమీద్ ఉద్దీన్ ప్రస్తుత సందర్భానంగా తాను ప్రజలు మేలు చేయడం గురించి తీవ్రంగా యోచిస్తున్నానని సుల్తాన్ చెప్పినట్లు ఉంది. అల్లాఉద్దీన్ తన సంపదనంతా పంచివేయడం, గ్రామ విభజన మొ॥ ప్రభుత్వ చర్యలు నాలుగింటి వారికి ధరల నియంత్రణ పద్ధతి పైన వెలుగు చూపాడని ఇందులో ఉంది.

బరానీ కూడా "ఫత్వా-ఇ-జహాందారీ" లో ధరల నియంత్రణ అనేది ప్రజలు స్థిరమైన, సౌకర్యవంతమైన జీవితాన్ని గడపటానికి అన్ని కాలాల్లో రాజులు తీసుకునే చర్యల్లో ముఖ్యమైనదని చెప్పాడు.

అమీర్ ఖుస్రూ కైతం తన

Effect " ఖజాయిన్-ఉల్-ఫుతూహ్ " లో సామాన్యులకు కాక
తనకు కావాల్సినవి చౌకగా పొందేందుకు అల్లాఉద్దీన్
మార్కెట్ సంస్కరణలు లాంటివి ప్రవేశపెట్టాడని పేర్కొన్నాడు.

అయితే ఈ వాదనని అంగీకరించడం
కష్టం. "ఖైరుల్ మజాలిస్" లో వర్ణించబడిన సంఘటనని
మరో రకంగా చెప్పలేరు. పైగా ఇది ముస్లిం సూఫీల
గురించిన గ్రంథమే గాని రచన చరిత్రకి చెందినది కాదు. ఇది
సమకాలీన గ్రంథం కూడా కాదు. అయితే సుల్తాన్
అల్లాఉద్దీన్ కు తన ప్రజల్ని సదా సంతోషంగా,
అన్ని స్థితుల్లో ఉంచాలి తద్వారా తిరుగుబాట్లు
రావని నమ్మినట్లు ఇతర ఆధారాల ద్వారా తెలుస్తుంది.
అయితే ఇది సైనిక రాజ్యం కాబట్టి కావల్సింది పటిష్టమైన
సైన్యమే గాని ప్రజాసంతృప్తత కాదు. అందుకే ప్రజల్ని
తృప్తి పరచేందుకు ఈ సంస్కరణలు చేపట్టాడనడం సబబు
కాదు.

అల్లాఉద్దీన్

కాల్బల సైనికునికి — 78 టంకాలు/సాలుకు
అశ్వికుడు (ప్రభుత్వ గుర్రం) — 156 "
అశ్వికుడు సొంత గుర్రం — 234 "
అశ్వికుడు రెండు గుర్రాలు — 312 "

గా జీతాన్ని నిర్ణయించాడు. ఈ జీత నిర్ణయం 31.7.
స్థిరంగా, శాశ్వతంగా ఉండాలని సుల్తాన్ కాంక్షించాడు.
అందుకు జీవిత అవసరాల వస్తువుల ధరలు చాలా
చౌకగా ఉండాలి, ఇది ~~ఆహార ధాన్యాల్లో~~ నియంత్రణాలలో
మార్కెట్లలో ఆహార ధాన్యాల ధరల్ని స్థిరపరచనిదే
సాధ్యం కాదని సుల్తానుకు సలహాదారు తెలియ
చెప్పారు.

అలాయీ ప్రత్యేకమైన మార్కెట్

నియంత్రణలు చేపట్టడాన్ని గురించి వ్యాఖ్యానిస్తారు. ధరల నియంత్రణ వ్యవస్థని కేవలం సైనికులకు అవసరమైన వస్తువులకు మాత్రమే పరిమితం చేయలేదు సైనికులు వినియోగించని పలు ఇతర వస్తువులను కూడా దీనిలో చేర్చాడు. మంగోలుల నుంచి ప్రమాదం తప్పిపోయిన తర్వాత కూడా ధరల నియంత్రణ కొనసాగింది. నియంత్రణ ధరల వస్తువులు సైనికేతరులకు కూడా అమ్మబడేవి.

ఖిల్జీకి ఉన్న సైనికావసరం దృష్ట్యా

పరిధి ఏదైనా ఈ మార్కెట్ సంస్కరణల వెనుక ఉన్న బలీయమైన కారణం ఇదేనన్పించక మానదు.

31.7.03 **సంస్కరణలు :-**

తక్కువ వేతనానికి సైనికులు సుఖమైన జీవనం గడిపేందుకు ఖిల్జీ వివిధ జీవితావసరాలు సదా సరఫరా అయ్యేట్లు, వాటి ధరలు స్థిరంగా ఉండేట్లు, ఏ విధమైన అసౌకర్యం కలుగకుండానూ చర్యలు తీసుకున్నాడు.

సుల్తాన ధరల్ని నిరంకుశంగా నిర్ణయించలేదు. అస్థిరంగా ఉండే గిరాకీ-సరఫరాల ను బట్టి గానీ, వారి వ్యాపారం మంచి-చెడుల్ని, వ్యాపారవర్గ ప్రయోజనాల్ని బట్టి గానీ ధరలనిర్ణయం చేయలేదు. వస్తువుల ధరల్ని "ఉత్పత్తి వ్యయం" అనే ప్రమాణాల సూత్రం ఆధారంగా మాత్రమే నిర్ణయించాడు.

అల్లావుద్దీన మొత్తం 3 విభాగాలైన (3 sets of regulations) నియమావళి ని విడుదల చేశాడు.

మొదటి విభాగంలోని 8 నియమాలు ఆహార ధాన్యాలకు చెందినవి. అయితే బరానీ వద్ద నియమావళి అసలు ప్రతి లేనందున వాటి వివరాలు లోపాలున్నాయి.

మొదటి నియమం (జబిత) : ఆయా ఆహారధాన్యాల ధరల్ని నిర్ణయించింది.

గోధుమలు - 7.5 జీతలాలు / మౌండ్
బార్లీ - 4 జీతలాలు / మౌండ్
మొ॥.

రెండవ నియమం : మాలిక్ కాబుల్ ను ఆహారధాన్యాల మార్కెట్ కు (షహనాయిమండి) కంట్రోలర్ గా నియమించాడు.

(ఢిల్లీ పెద్ద బజారులో ఒక ప్రత్యేక మార్కెట్ ను ఏర్పాటు చేశారు. ఢిల్లీ మార్కెట్ల ఒక 'షహనా' పర్యవేక్షకుడు గా ఉండేవాడు. ఇతడు ముఖ్య పర్యవేక్షకుడి కింద పనిచేస్తాడు.)

మూడవ నియమం : ఖాలిసా గ్రామాల నుంచి భూమి శిస్తు ను ధాన్య రూపంలో సేకరించాలి.

ధాన్యం ఢిల్లీ ధాన్యాగారాల్లో నిల్వ చేయబడి కరువు సమయాల్లో ప్రజావసరాల దృష్ట్యా బయటకు తీసి ఇచ్చేవారు.

నిర్దేశించిన ధరలకు (అమ్మకాలు జరిగేలా చూసేవారు.)

వర్తకులు తాము కొన్న వెలకు, రవాణా ఖర్చులు కూడా కలిపిన తర్వాత కొంత లాభం వేసుకుని అమ్మవచ్చు. అయితే ప్రభుత్వం నిర్ణయించిన ఈ లాభం (margin of profit) ఎంత తక్కువగా ఉండేదంటే ఆరంభ కాలంలో కొందరు కొరవాళ్ళు ప్రభుత్వ నియమాల్ని పాటించేవారే కాదు.

ఏడవ నియమం: మార్కెట్ ధరలను గురించి, వస్తువుల వ్యవహారాలని గురించి సుల్తాన్ కు మూడు మార్గాల్లో - మార్కెట్ నియంత్రకులు, బరిదులు, ముస్హిలు ద్వారా నిత్యం నివేదికలు అందేవి

వేగు-మూడు

ఎనిమిదవ నియమం: కరువు, క్షామాలప్పుడు ఆహార ధాన్యాలను రేషనింగ్ చేయాలని ఈ నియమం చెబుతుంది.

* సాగు చేసే రైతు నుంచి ధాన్యం కొనుగోలు కేవలం ప్రభుత్వం అనుమతించిన వ్యాపారులు తప్ప ఇంకెవ్వరూ చేయరాదు.

* అంతర్వేది లోని అధికారులు లిఖిత పూర్వకంగా తాము ఎవ్వరికీ ధాన్యాన్ని

దాచిపెట్టు (hoarding of grain) నేరమని ప్రారంభంలో ఇవ్వాలి.

* ప్రోవాయులకి నిర్దిష్ట మొత్తంలో ఆహారధాన్యాన్ని సరఫరా చేస్తామని ప్రభుత్వం తో ఒప్పందం కుదుర్చుకునేలా చేసేవారు.

* రైతులు ధాన్యాన్ని ఎక్కువ లాభాలకి అధిక ధరలకు అమ్మకుండా అధికార్లు పన్ను / భూమిశిస్తు వసూళ్ళు కఠినంగా చేసేవారు. చివరకి చెల్లింపులు పోగా మిగిలిన (surplus) పంటని కూడా సుల్తాన్ నిర్ణయించిన ధరకే ప్రోవారులకి అమ్మేయాలని బలవంత పెట్టేవారు.

* అల్లాఉద్దీన్ 3 అంశాల మీద దృష్టి కేంద్రీకరించాడు.

1) గ్రామాల నుంచి నిరంతరంగా ఆహారధాన్యాల సరఫరా.

2) నగరాలకు ధాన్యాన్ని ధాన్య వర్తకులు (కార్వాణీలు, బంజారాలు) రవాణా చేయడం.

3) పౌరులకు / ప్రజలకు సక్రమంగా పంపిణీ కావడం

* చౌకగా ఆహార ధాన్యాల సరఫరా జరిగేందుకు గాను అల్లావుద్దీన్ అంతర్వేది ప్రాంతాన్ని అంటే యమునానది దగ్గర మీరట్ నుంచి [illegible] వద్ద కారా వరకు భూమిశిస్తు ను కేంద్ర ప్రభుత్వానికి ప్రత్యక్షంగా చెల్లించాలి, అంటే ఆ ప్రాంతాన్ని ఖాల్సాగా [illegible].

దీంతో పాటు భూమిశిస్తు ను పంటలో సగభాగానికి పెంచాడు.

[వస్త్ర వ్యాపారానికి ప్రసిద్ధమైన ముల్తాన్ వ్యాపారులకి ప్రభుత్వం విలువైన వస్త్రాల్ని ఎక్కడ నుంచైనా తెచ్చి ఢిల్లీలో వారు ఎంత వెలకైనా అమ్మకానికి అమ్మేందుకు అనుమతులు ఇస్తూ వచ్చేది. ఈ వ్యాపారులు ఒక మాటలో చెప్పాలంటే ప్రభుత్వానికి కమిషన్ ఏజెంట్లుగా ఉండేవారు. ఈ వ్యవహారంలో నష్టమంతా రాజ్య కోశాగారం భరించేది. అందువల్ల వీరు అమ్మకాన్ని రేషన్ చేశారు. 'రాయిస్ పర్వానా' ప్రముఖులకు వారి హోదా, ఆదాయం దృష్టిలో ఉంచుకుని నిర్ణీత పరిమాణాల మేరకే వస్తువుల (విలువైన వస్త్రాల) కొనుగోలుకు పర్మిట్లు ఇచ్చేది.]

3) మూడవ విభాగంలో నియమాలకి జీవుల వ్యాపారానికి చెందింది — గుర్రాలు, పశువులు, బానిసలు.

అల్లాఉద్దీన్ 3 రకాల గుర్రాలకి ధరలు నిర్ణయించాడు.

| | | |
|---|---|---|
| మొదటి శ్రేణి | — | 100 నుంచి 120 టంకాలు |
| రెండవ | — | 80 నుంచి 90 " |
| మూడవ | — | 65 నుంచి 70 " |

యుద్ధానికి పనికిరాని గుర్రం వెల – 12 నుంచి 20 టంకాలు.

సుదూర ప్రాంతాల నుంచి నాణ్యమైన గుర్రాల్ని తెచ్చిన వ్యాపారులు వాటిని నేరుగా ఢిల్లీకి మార్కెట్లోకి తేకుండా నిరోధించింది ప్రభుత్వం.

[illegible] స్థానిక వర్తకులు అధిక ధరలు వేయకుండా
వ్యక్తిగతం, వినియోగదారుల నుండి అధిక ధరలు వసూలు
గా కొనుగోలు చేసే
చేయకుండా ( ద్వితీయ లక్ష్యాల ద్వారా, మధ్యవర్తులుగా
(dallals) వ్యవహరించడం ద్వారా) నిరోధించింది-
ప్రభుత్వం స్థానిక దలాల్‌కు, ధనికులకు నగరాల
కొనుగోలుకై పర్మిట్లు ఇచ్చేది. మొత్తం నగరాల
వ్యాపారం అంతా ఈ నిర్ణీత మార్కెట్లలోనే
జరిగేది. అప్పుడప్పుడు (periodical) సుల్తాన్
స్వయంగా ఈ మార్కెట్ వ్యవహారాల్ని
పర్యవేక్షించేవాడు.

పశువులు – గేదెలు, ఆవులు, ఎద్దులు,
బంటులు, మేకలు, గొర్రెలు, గుర్రాలు మొ॥ వి
పెంపుడు జంతువులకి ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే
లాభదే కొనుగోళ్లు - అమ్మకాలు జరపాలి.
ఇంటి పని కూడా చౌకగా సాగేందుకు
బానిసల ధరల్ని కూడా ప్రభుత్వమే నిర్ణయించేది.
మధ్యవర్తుల ప్రమేయం లేకుండా
నగరపు వర్తకులు ప్రత్యక్షంగా గ్రామాలను
[illegible] (దివాన్ ఇ రియాసత్) అమ్మకాలు

పెట్టేవారు.] వారు అందరికీ ఉద్దేశించిన నియమాలకి అంగీకరించే దాకా, ఒకరికొకరు బెయిల్ ఇచ్చుకున్నంత దాకా నిర్బంధించి ఉంచేవారు.

* (ధాన్య వర్తకుల్ని వారి భార్యా పిల్లలతో సహా (5) యమునా నది ఒడ్డునున్న గ్రామాల్లో స్థిరపడమనేవారు. ఆ ద్వారా వారు వివిధ దేశ ప్రాంతాల నుంచి ధాన్యాన్ని అధికారుల పర్యవేక్షణలో రవాణా చేస్తారు, తద్వారా సుల్తాన నిర్ణయించిన దానికి మించి ధాన్యం ధరలు పెరగకుండా చూడవచ్చు. ఫలితంగా రాజధాని కి ఎంతో ధాన్యం చేరి సాధారణ సమయాల్లో రాజ ధాన్యాగారం తెరవాల్సిన పనే ఉండేది కాదు.)

* (6) దొంగవ్యాపారం నియంత్రించడానికి గానూ దాచి పెట్టిన ధాన్యం దొరికితే దాన్ని రాజ్యపరం చేసి ఆ వ్యాపారిని శిక్షించేవారు.

* బరనీ వర్ణించిన దాని ప్రకారం ఒకసారి కరువు సమయంలో ఒక జూనియర్ వ్యాపారి ఒకటిరెండుసార్లు ధాన్యం ధరలు అర్థ జీతల్ పెరిగినట్లుగా నివేదించినందుకు గానూ అతన్ని కర్రలతో ఇరవై దెబ్బలు కొట్టారని తెలుస్తుంది.

* రాజ్యాంగంలోని ఆర్థిక సాధారణ మార్కెట్లు
సంప్రదాయ పాలనా నిర్మాణం ప్రకారం
" దివాన్-ఇ-రియాసత్ " (Ministry of Commerce)
కిందికి వస్తుంది. సాధారణ కార్యాలయం —
తూనికలు, కొలతల పర్యవేక్షకుడు దీని కిందికి
వస్తుంది, దీనిని అంటర్యాగమే!

(11)

## అల్లావుద్దీన్ 'మాలిక్ యాకూబ్'

ఇతని నిజాయితీ పరుడు, నిష్పక్షపాతంగా పనులు
చేయగల నేర్పుని దివాన్ ఇ రియాసత్ గా
నియమించాడు. ఆర్థిక మార్కెట్లు ధాన్యం,
వస్త్రాల మార్కెట్లు గుర్రాల మండీ, బానిస వర్తకాలతో
సహా అన్ని మార్కెట్లు ఇతని కింద ఉంచబడ్డాయి.
ఈ విధంగా మొత్తం రాజ్యంలో ఆర్థిక సంస్కరణల
అమలుకు దివాన్ ఇ రియాసత్ బాధ్యత
వహిస్తుంది. ఈ పదవికి మంత్రి (వారి ధర్మాలతో
ఇచ్చేందుకు అల్లావుద్దీన్ యాకూబ్ ను ప్రజల
నైతికతని ప్రమాణీకరించే) "ముహతసిబ్" గా
కూడా నియమించాడు.

యూరోపులో ఒక నియంతలాగా
విధించాల్సిన శిక్షలు విధించాడని / శిక్షలు
క్రమాలు కఠినపరచాలని నిర్దాక్షిణ్యంగా వ్యవహరించి
అందరు సొంతానికి వారి గుండెల్లో భయప్రకంపనలు
సృష్టించాడు. కోటీశ్వరుని కూడా అమ్మేవారిలాగా పాటించా
దయ చూపేవాడు కాదు. రద్ద మార్కెట్లు లో శిక్షలు
(కొరడా దెబ్బలు మొ॥) అమలు పర్చేవాడు.

## సమకాలీన సమాజం పై (ప్ర)భావం (V. imp)

* ధాన్యం సరఫరా కోసం ఏర్పాటైన అన్ని చర్యలు ఫలితంగా ఎలాంటి ధాన్యం మార్కెట్లు చేరి సాధారణ సమాజంలో రాజ ధాన్యాగారాల్ని (1) తెరవాల్సిన అవసరమే ఉండేది కాదు.

* ఈ నిర్ణీత ధరలు ఏర్పాటైన అల్లావుద్దీన్ కాలం 'వర్షాలు విరివిగా ఉన్నా, లేకపోయినా' అన్న దానితో సంబంధం లేకుండా స్థిరంగా (2) కొనసాగాయి.

"మార్కెట్లు లో ఆహార ధాన్యాల ధరలు ఏ మాత్రం మార్పు లేకుండా స్థిరంగా ఉండడం సమకాలీన వింతలలో ఒకటిగా చూడబడేది"

— బరానీ

* [ఆహార ధాన్యాల మార్కెట్ సంస్కరణల వలన] అప్పుడప్పుడు కరువు, కొరతలు ఉన్నప్పటికీ తీవ్రంగా ధరలు పెరగడం గాని ఆకలి చావులు (3) సంభవించడం గాని అల్లావుద్దీన్ పాలనా కాలంలో జరగలేదు. ఇది తెలివైన ఆర్థిక సంస్కరణల వల్ల, మార్కెట్లపై ప్రభుత్వం కఠిన నియంత్రణలు ఉండటం వల్లనే సాధ్యపడింది.

"నిజంగా ఇది యుగానికే వింత. మరే చక్రవర్తి దీన్ని అమలు చేయలేకపోయాడు" — బరని

[This was indeed the wonder of the age; and no other monarch was able to affect it.]

* అయితే అల్లావుద్దీన్ ధరల స్థిరీకరణ ప్రయోజనాలు ప్రజలు ఎన్నో స్వేచ్ఛలు (4) కోల్పోవాల్సి వచ్చింది. ప్రజలు ఖరీదైన వస్త్రాలు, సిల్క్ దుస్తులు ఇష్టంగా ధరించరాదు. కేవలం సుల్తాన్ అనుమతితోనే ధరించవచ్చు. ఈ అనుమతి కేవలం

ఉత్తమ తారా గల వారికే దక్కేది, అని ఫరిష్టా రచనల వలన తెలుస్తుంది.

* ఈ సంస్కరణల వల్ల ప్రావిన్సుల (5) విభజనకి తెర పడింది. దొంగవ్యాపారం, నల్ల మార్కెట్లు, దాచిపెట్టడాలు, లోపాలు - అక్రమ మోసాలు అరికట్ట బడ్డాయి.

" శిస్తు యొక్క తప్పనిసరి గుణం ప్రాంతీయ నిబంధనలతో పాటు, తక్కువ భూముల ~~ఉంచింది~~ ఇతర మోసాలకి దూరంగా ఉంచింది. పైపెచ్చు వారు మంచి లాభం ఇవ్వడం చేత కమతాలదార్లకి తరచుగా కొంత అధికంగా కూడా దక్కేది" — బదౌని

*

" అక్బరుద్దీన పాలనాంతానికి ఈ ధరలు స్థిరంగా ఉన్నాయి. వర్షాలు లేకపోవడం లాంటి క్షామ కారణాల వలన కూడా ఎట్టి మార్పులూ కలుగలేదు. ఇది ప్రత్యేకమైన చెప్పుకోదగ్గ విజయం. ఇలాంటిది మునుపెన్నడూ సాధించ బడలేదు, మళ్ళీ ఇది సాధ్యమౌతుందని కూడా ఎవరూ చెప్పలేరు."

— ఫరిష్టా

(జహాంగీరు కాలంలో)

ఫిరోజ్ షా పాలనా కాలంలో గడచిన కాలాన్ని గుర్తు చేసుకుంటూ (షేక్ నాసిరుద్దీన్ చిరాగ్) ఇలా అన్నాడు

"అప్పట్లో వస్తువులెంత (6) చౌకగా ఉండేవి! ఆ రోజుల్లో నూలు బట్టలు లేని బిచ్చగాడే ఉండేవాడు కాదు. ఈ నూలు బట్ట ఎంత ఖరీదు చేసేది? ఒక టంకా, మేలైన నూలు వస్త్రం అయితే లేక నాణ్యమైన నూలు వస్త్రం అయితే 2 టంకాలు 20 జీతలు. దర్జీ వాడి వేతనాలు 4 నుంచి 6 జీతలు ఉండేవి. మరి ఈ రోజుల్లోని నూలు వస్త్రాలు టంకా కి తక్కువ గా ఎవరూ కుట్టడం లేదు."

* ధరల నియంత్రణ వ్యాపారాన్ని (7) ప్రభావితం చేసింది. వర్తకులు సరిపడా లాభాల్ని పొందలేక పోతున్నారు. తప్పు చేసిన వర్తకులకి తీవ్రంగా శిక్షలు విధించటం చేత వ్యాపారాలు మానుకుంటుండేవారు.

వ్యవసాయం కూడా (8) దెబ్బతింది. రైతులు మిగిలిన పంట ని ఇళ్ళ కి తీసుకెళ్లేందుకు వీలు లేక పోయింది. సగం పంట ని భూమిశిస్తుగా చెల్లించినా మిగిలింది కూడా పన్నులు గల వ్యాపారులకి సుల్తాన్ నిర్ణయించిన కట్టుబాటు గానే ధరలకి అమ్మేయాల్సి వచ్చేది. వాంట్లో చాలామందికి వ్యవసాయం మీద ఆసక్తి చచ్చిపోయింది.

మహమ్మదీయులు ఢిల్లీలో చేరగా

(9) ఈ విషయం తెలిసి అనేకులు ఢిల్లీకి వెళ్ళ పోవడం ప్రారంభించింది. వారిలో విద్వాంసులు, మంచి హస్తకళాభిజ్ఞులు కూడా ఉండేవారు. ఫలితంగా ఢిల్లీ పేరు ప్రఖ్యాతులు విస్తరించాయి. ఢిల్లీ సుల్తానులు సుఖ సంతోషాలలో ఉండేవారు. అందువలన వారు రాజ్యం విధించే నిబంధనలకు లోబడి ఉండేందుకు సిద్ధంగా ఉండేవారు. వారిలో క్రమశిక్షణ పెరిగింది. అందువల్ల నేరాలు తగ్గాయి. ఇది రాజ్యానికి ఎంతో మేలు చేకూర్చింది.

(10) ధరల నిర్ణయం వలన అల్లాఉద్దీన్ సైన్యం బాగా పెరిగింది. ఈ సైన్యం సుల్తానుల రాజ్యాన్ని మంగోలుల ఉపద్రవం నుంచి కాపాడేందుకు, హిందూ ముఖ్యులను నియంత్రణలో ఉంచేందుకు, దక్షిణ భారత దిగ్విజయ యాత్రలు చేసేందుకు తోడ్పడింది. ఈ దక్షిణ దిగ్విజయ యాత్రలు అల్లాఉద్దీన్ కు ధనాగారం మళ్ళీ నింపేందుకు తోడ్పడింది. అల్లాఉద్దీన్ నియంతృత్వానికి ఎదురు లేకుండా పోయింది. ఎందుకంటే అది సుల్తానుకు కేవలం ఢిల్లీ పౌరులకే కాకుండా సార్వభౌమత్వమైన ప్రతిష్ఠ అందించింది.

(11) ద్రవ్యోల్బణాన్ని ఎదుర్కోవడం, ప్రజల జీవన ప్రమాణ వ్యయాన్ని తగ్గించడం అన్న సుల్తాన్ ముఖ్యమైన లక్ష్యాలు నెరవేరాయి. కనీసం ఢిల్లీ వరకైనా ద్రవ్యోల్బణం సమర్థంగా అదుపు చేయబడింది.

* ఈ సంస్కరణల వలన కరువు సమయాల్లో కూడా ఆహార ధాన్యాల కొరతగానీ, ధరల్లో ఒడిదుడుకులు, లేదా ద్రవ్యోల్బణము పెరుగుదల గానీ ఢిల్లీ ఎరుగదని బరానీ రాశాడు.

బరానీ సమకాలికుడైన ఇసామి రచనలు దీన్ని సమర్థిస్తాయి. ఒక సారి కరువు సందర్భంగా ధాన్య మార్కెట్లలో ఎంత మంది వాగయ్యా-రంటే 8 జిత్తీసలాకు ఇద్దరు-ముగ్గురు చొప్పున మాత్రమే కూడా లేని ఇసామి వర్ణించాడు. అల్లాఉద్దీన్ ధాన్యాన్ని సేకరించి కరువుకు ముందున్న ధరల ప్రకారమే అమ్మాలని చెప్పాడు.

వస్త్ర విపణిలో ఈ సంస్కరణల ఫలితంగా ఢిల్లీకి ఎంతో వస్త్రం తేబడి కొన్ని సంవత్సరాల పాటు అది (12) నిరుపయోగంగా పడి ఉండాల్సి వచ్చింది.

* ఈ సంస్కరణలు కేవలం అల్లాఉద్దీన్ బలప్రదర్శన వల్లే అమలు కాబడినట్లు కన్పించినా ప్రజల, వ్యాపారుల కనీస మద్దతు / సహకారం లేకుండా ఒక దీర్ఘకాలం వీటిని అమలుపరచడం సులభం గా సాధ్యం కాదు.

* ఇవి ఏవో ఒక మత ప్రజలని బాధించేందుకు ఉద్దేశించినవి కావు. రిజిస్టర్ నందు నమోదైన ఢిల్లీలో హిందూ ముస్లిం వ్యాపారులిద్దరూ ఉన్నారు.

* ముల్తానీలు, (13) దల్లాలు ప్రభుత్వ నియంత్రణలచే ఎంతగా విసిగి పోయారంటే వారు చావుని కోరుకునేవారు.

* ఎక్కువ భూమిశిస్తు, తక్కువ ధాన్యపు ధరల వలన రైతులు కూడా కష్టపడినట్లు తెలుస్తుంది.

* సంస్కరణల కార్యం ఢిల్లీలో రెండురకాల వ్యాపారులు మార్కెట్ నిర్వహించేవారు. ఢిల్లీలో శాశ్వత దుకాణాలున్నవారు ధాన్యాన్ని చిల్లరగానూ, టోకుగానూ అమ్ముతుండేవారు. వీరు ఒక రకం వ్యాపారులు. ఇక రెండో రకం వ్యాపారులు లేదా బిడారుల నాయకులు ఇతర ధాన్యాలను ఢిల్లీకి తెచ్చి ఈ వ్యాపారులకి, ఇతర ప్రజలకి అమ్మేవారు. సుల్తాన నిర్ణయించిన ధాన్యపు రేటు వల్ల లాభము వచ్చే ఆదాయం స్వల్పంగానే ఉన్నందువల్ల ~~ఆ~~ బిడారులు (14) సంస్కరణల అనంతరం క్రమంగా ఢిల్లీకి రావడం మానేసారు.

* సుల్తాన ఈ వ్యాపారస్థులకు నివేదికలు

వారిచ్చిన శాసనాల్నింటిని రద్దు చేశాడు ]

అల్లావుద్దీన నిబంధనలు అనేక సమస్యాత్మకమైన, అధికారస్వామ్య నియంత్రణలకు చివరికి దారి తీశాయి. బహుశా అతడు కేవలం అత్యవసర వస్తువుల ధరలు మాత్రమే నియంత్రిస్తేనో లేదా సైనికులకి ప్రత్యక్షంగా అవసరమయ్యేవాటిని మాత్రమేనా నియంత్రిస్తేనో ఎక్కువ విజయవంతమయ్యే ఉండేవాడు. కాని అతడు ప్రతిదాని ధరనూ "టోపీల నుంచి సాక్సుల దాకా, దువ్వెనల నుంచి సూదుల దాకా, కూరగాయలు, సూపులు, మాంసం నుంచి చపాతీల..." ఇలా అన్నింటి ధరలూ అదుపు చేయ బూనుకున్నాడు.

ఇలాంటి విస్తృతమైన, కేంద్రీకృత నియంత్రణలు ఉల్లంఘనలకు దారి తీయడం సహజం. ఇది శిక్షలను ఆహ్వానిస్తుంది. ఫలితంగా అసంతృప్తి, నిరసన, నిరాశ కలుగుతాయి.

కాబట్టి, అల్లావుద్దీన మార్కెట్ సంస్కరణలు వాటి సహజస్వభావం చేతనే తాత్కాలికమైనవి, ఒక అత్యవసర పరిస్థితిని ఎదుర్కొనేందుకు ఉద్దేశించబడినవి లేదా ఒక నిర్దిష్ట సందర్భాన్ని దాటేందుకు ఏర్పాటు చేయబడ్డవే గాని శాశ్వతంగా మిగిలిపోదగ్గ సంస్కరణలు కావని చెప్పొచ్చు.

* మార్కెట్ సంస్కరణలు కేవలం ఢిల్లీ కి మాత్రమే నని బరనీ చెప్తాడు. అది ఏమైనా నిజమయితే మొత్తం ఉత్పత్తి అంతా ధాన్యం సరఫరాని నియంత్రించాల్సిన అవసరం లేదు. పైగా సైన్యం, వారి కుటుంబాలు కేవలం ఢిల్లీ లోనే ఉండరు, పలు నగరాలు-పట్టణాలు (qasbas) లాహోర్ నుంచి అవధ్ మధ్య అంతా సైన్యం ఉంటుంది.

పైగా బరనీ రాజనీతి సిద్ధాంతాలపై రాసిన ఒక గ్రంథంలో రాజధానిలో ఏదైతే జరిగేదో దాన్నే ఇతర పట్టణాల్లో అనుసరించేవారు రాశాడు. అయితే అంత పెద్ద రాజ్యంలో అంతకాలం పాటు ధరల నియంత్రణ చేయటంలో సులభమేమీ కాదు.

ఏదైనా, ఢిల్లీ గాక ఇతర నగరాల్లో, పట్టణాల్లో ధరల నియంత్రణ ఎంత వరకు అమలు జరిగిందన్నది తెలుసుకోవడానికి మనకి ఏ ఆధారాలూ లేవు.

# Additional points

* అల్లాఉద్దీన్ ఖిల్జీ సంస్కరణల కి ధ్యేయాలు
  1) ప్రత్యక్ష వసూళ్ళ ని ప్రవేశ పెట్టడం.
  2) మధ్యవర్తుల కి వృథాగా రాజ్యసంపద నష్టపోకుండా అడ్డుకోవడం.

* ప్రభుత్వ డిమాండు ను ధాన్య రూపంలో నిర్ణయించినప్పటికీ వసూళ్ళ మాత్రం ధనరూపంలోనే చాలా మటుకు చేసేవాళ్ళు

* సుల్తాన్ రైతులు తమ భూమిశిస్తు ను ధన రూపంలో గాక ధాన్య రూపంలోనే చెల్లించాలని ఆజ్ఞాపించినట్లు తెలుస్తుంది. కానీ ఇర్ఫాన్ హబీబ్ చెప్పినట్లు గా ఈ ఆజ్ఞ కేవలం ఖలీసా లోని కొన్ని ప్రాంతాలకే వర్తించి ఉండవచ్చు. ఆ ప్రాంతాల నుంచి సుల్తాను ధాన్యాగారాలలోకి నిల్వలను తరలించి ఇలా చేసి ఉండవచ్చు. లేకపోతే సాధారణంగా రెవెన్యూ వసూళ్ళు ధన రూపంలోనే ఉండేవి.

కారణాలు :

1) అమీర్ ఖుస్రు ఈ మార్కెట్ సంస్కరణల్ని ప్రజలందరి - ధనిక, పేదల సర్వేమాలికి, సాధ్యమైన ఉపయోగపడిన ఉదార చర్యలుగా తెలిపాడు.

2) నాసిరుద్దీన్ మహమూదు (ఢిల్లీ చరిత్ర) సుల్తాన్ కృషి నీ ప్రజలకు మంచి చేసిందని చెప్పాడు.

3) బరాని మాత్రం పెద్దపీట వేశాడు. ధ్యానాత్మక స్థానాల వద్ద తోటల నిర్మాణం, ఢిల్లీ చుట్టూ రాతి గోడల్ని కట్టించడం వంటి వాటి ద్వారా మంగోలుల నెదుర్కోటానికి సన్నద్ధమయ్యాడని భావించాడు.

అమలు జరిగిన ప్రాంతం :

ఈ విధానాలన్నీ బరానీ వాదన సమర్థనీయమనిపిస్తుంది. ప్రధాన సైనిక శిబిరాలు / లష్కర్‌గాహ్ (Lashkargah) ఢిల్లీ లోనే ఉండింది, రాజస్థానంలో చాలా వరకు ఢిల్లీలోనే దాని పరిసర ప్రాంతాల్లోనూ ఉంచబడేవారు. అందువల్ల

ధరల నియంత్రణ కి ప్రధాన కేంద్రం ఢిల్లీ యే అయి 109
ఉండడంలో ఆశ్చర్యం లేదు. అయితే ధాన్య వ్యాపారుల
చౌకగా ధాన్యం సప్లయి చేయాల్సిన అవసరం
పరిసర ఉత్పత్తి జిల్లాలలో ఉండడం చేత అక్కడ
కూడా ధరల నియంత్రణ / తక్కువ ధరలో ఉండి
ఉండవచ్చు.

విమర్శ :

ధరల నియంత్రణ విజయవంతమవ్వాలంటే సమర్థవంతమైన, అప్రమత్తమైన పంపిణీ పాలన అవసరం. అల్లావుద్దీన్ మరణానంతరం ఇలాంటి చర్యల పాలన కొరవడటం వలన అవి విఫలమయి ఉండవచ్చు.

అయితే ఇర్ఫాన్ హబీబ్ ధరల నియంత్రణ వైఫల్యం పొందటానికి మరొక భిన్న కారణం చెప్పాడు. ధరలు చౌకగా ఉండటం అంటే ఆ ప్రాంతాల నుంచి తక్కువ ఆదాయం రావడం. అందువల్ల ధరల నియంత్రణ వృద్ధి తక్కువ ధరల ప్రాంతం పరిమితంగా ఉన్నంత వరకూ, ప్రాయంలో చాలా వరకు ఆ ప్రాంతాలకే కదులుతున్నంత వరకూ బాగానే ఉంటుంది. మంగోలుల భయం వల్లనే అప్పుడు సైన్యాన్ని, వ్యయాన్ని కూడా విస్తరించాల్సి వచ్చింది, కేవలం ఢిల్లీకి దాని పరిసర ప్రాంతాలకే పరిమితం చేయడం

కుదరదు. దాంట్లో ప్రభుత్వ కోశాగారం ఆస్తి
ధరల నియంత్రణ ని ఎత్తివేయటం లోనే ఉంది.

# Slavery under Sultanate

## బానిసల నియామకం:

① [బానిస విధానం ప్రాచీనకాలం నుండి భారతదేశం, పశ్చిమ ఆసియా, యూరోప్ లలో ఉండేది. ఇంట్లో పుట్టిన బానిసలు, కొనుక్కొన్న బానిసలు, సంపాదించిన బానిసలు, వారసత్వంగా పొందిన బానిసలు అని రకాలను హిందూ ధర్మ శాస్త్రాలు చెప్పాయి. ఇన్ని రకాలు ఢిల్లీ సుల్తానుల కాలంలో కూడా ఉండేవి.]

② [అప్పటి సాధారణమైన బానిసలను సమకూర్చుకొనే విధానం యుద్ధంలో పట్టుబడిన వారిని బానిసలుగా మార్చి వేయడమే. టర్కులు ఈ యుద్ధాలు భారతదేశం లోపల, వెలుపల కూడా కొనసాగించేవారు.]

~~పశ్చిమ, మధ్య ఆసియాలలో బానిసల కోసం తరచుగా దాడులు జరుగుతుండేవి. [illegible] [illegible] [illegible] మధ్యాసియా [illegible] (వ)ల్ని నిర్బంధించి బానిసలుగా మార్చి తీసుకొచ్చేవారు~~

ఇరఫాన్ హాబిబ్ ఉద్దేశం ప్రకారం

ఉత్తర భారతంలో జరిగిన గజనీ, ఘోరీల దాడులు
జూలియస్ సీజర్ బ్రిటన్ మీద చేసిన దాడుల్లాగా
కొల్ల వరకూ బానిసలని సంపాదించడం కోసమేనని
చెప్పవచ్చు. సుల్తానుల కాలంలో ఒక ఆక్రమణ
ప్రముఖ విజయం కాదు ఆ ఆక్రమణల్లో పొందిన
బంగారం, వెండి, పశువులు, గుర్రాలతో పాటు సంపాదించిన
బానిసల సంఖ్య మీద కూడా ఆధారపడి ఉండేది.

ఢిల్లీ సుల్తానుల ను స్థాపించిన
తర్వాత కూడా సామంతులు ఆక్రమించుకోవాల్సిన
ప్రాంతాల నుండి బానిసల్ని సంపాదించడం కొనసాగింది.
బాల్బన్ రణథంబోర్ మీద చేసిన దాడులనూ,
మాలిక్ కాఫూర్ దక్కను మీద చేసిన దాడులనూ
మంచి ఉదాహరణలుగా ఈ బానిసల సంపాదనని
పేర్కొనవచ్చు.

సుల్తానులకు శిస్తు చెల్లించటానికి
నిరాకరించిన తిరుగుబాటుదారు గ్రామాలైన 'మవస్'
ల మీద జరిపిన దోపిడీ దాడుల్లో సంపాదించిన బానిసల
సంఖ్య చాలా పెద్దగా ఉండేది.

అల్లావుద్దీన్ ఖిల్జీ వద్ద కాలంలో (1296-1316)
50,000 మంది బానిసలు ఉండేవారు. కొం

ఫిరోజ్ తుగ్లక్ కాలంలో [1351-88] బానిసల (4) సంఖ్య 1,80,000 కి పెరిగింది. [సుల్తానుల వద్ద ఉన్న ఈ బానిసలే గాక సమాంతరంగా ప్రభువులు కూడా పెద్ద సంఖ్యలో బానిసల్ని, పేదల్ని కలిగి ఉండేవారు. అనేకులు <u>గౌరవనీయులైన పేదలు కూడా</u> <u>బానిసల్ని ఉంచుకునేవారు.</u>]

<u>బానిసల వినియోగం :</u>

(5) [కొత్త పాలక వర్గానికి బానిసలు చాలా అవసరమయ్యారు. వారు <u>వస్తువుల లాగ అమ్మకాలకు సులభంగా లభించడానికి వీలు</u> కావాల్సి వచ్చారు. సంప్రదాయ భారతీయ వస్త్ర కళాకారులకి మొదట్లో ఈ నూతన పాలకుల ప్రత్యేకుల అభిరుచులకు అనుగుణంగా ఉత్పత్తులు చేయడం, నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించడంలో ఇబ్బందులు ఎదురై ఉంటాయి. బానిసలయితే / ఏమైనా ఏ హస్తకళారాని బానిసలకయితే నూతన కళల్ని / ఏ కళనైనా నేర్పవచ్చు. ఫిరోజ్ తుగ్లక్ తన బానిసల్లో 12,000 మందిని హస్తకళాకారులు గా <u>మలిచాడు.</u>

కూడా 12,000 మందికి హస్తకళల్లో శిక్షణ ఇప్పించాడు.

(6) [బానిసల్ని సాధారణంగా ఇంటిపనికి, లోడీలు, వారి ప్రత్యేక సైన్యాలకు తెప్పించేవారు.]

(7) [మధ్య ఆసియాలో బందీ చేసిన ఉత్తమ బానిసల్ని సైనిక అవసరాలకి వాడేవారు. కానీ ఇందుకు భిన్నంగా ఢిల్లీ మార్కెట్ లో అమ్మబడే బానిసల్ని ప్రధానంగా ఇంటి అవసరాలకే వాడేవారు.] ఇది ఎంత సామాన్యమంటే సామాన్యులు కూడా బానిసల్ని పెట్టుకోవడం అనవసరంగా తలచేవారు కారు.

[సామాన్యులు బానిసల్ని పెట్టుకున్నప్పుడు ఇంటి పనుల్లో భాగంగా నూలు వడకడం మొ॥ చేసేవారే గాని బానిసల్ని వేరు హస్తకళల్లో శిక్షణ ఇప్పించటం సాధారణంగా చేసేవారు కారు. ఆ రోజుల్లో సూఫీ సాధువులు కూడా వారి బానిసల సంపాదన తో బతికేవారని తెలుస్తుంది,]

[ఫిరోజ్ షా తుగ్లక్ మాత్రం తన పెద్ద ప్రముఖుల్ని ప్రతి యుద్ధంలోను బానిసల్ని సంపాదించి వారిలో మేలైన వారిని సుల్తాన్ వద్దకి పంపాలని ఆజ్ఞాపించాడు. ఈ విధంగా పోగైన 1,80,000 మంది బానిసల్ని కొందర్ని మతవిద్యని

చేసుకోవడానికి పెళ్ళి చేయడానికి ప్రోత్సహించేవారు. దీంతో ఈ బానిస జంట పిల్లలు కూడా వారి బానిసలే అయ్యేవారు. హిందూస్తాన్ లో ముస్లింల సంఖ్య పెరగటానికి ఇది కూడా దోహదం చేసింది.

(10) చిన్న పిల్లల్ని (బాలురను) కూడా, యుద్ధ ఖైదీలుగా బంధీ చేసి నిర్దయగా వారిని కొజ్జాలుగా మార్చి పెద్దైన తర్వాత వారిని రాజాంతఃపురానికి, ప్రభువుల స్త్రీలుండే భవనాలకి కాపలాదార్లు గా నియమించేవారు.

(11) "స్త్రీ బానిసలు రెండు రకాలు, ఇంటి పనులకి నియమించబడిన వారు; లైంగిక సౌఖ్యానికి వాడబడేవారు. చదువు, వైశిష్ట్యం లేని కేవలం ముఖ్య ఇంటి పనులకే వాడబడే మొదటి రకం వారిని నానా అవమానాలకి గురి చేసేవారు. రెండవ రకం వారు కొంత గౌరవంగా ఒక్కొక్కప్పుడు ఇంట్లో అధికార్లు [illegible] కూడా ఉండేవారు. భారతీయ బానిస బాలికలే గాక స్త్రీ బానిసల్ని చైనా, తుర్కిస్తాన్ నుండి కూడా దిగుమతి చేసుకునేవారు. మొత్తం మీద ఓ ప్రముఖుడు [illegible] గా చెప్పినట్లు స్త్రీ బానిసల విక్రయ విధానం:

బానిసల, ముఖ్యంగా యువకుల బానిసల ధరలు కూడా అల్లావుద్దీన్ కాలంలో నిర్దుష్టంగా నిర్ణయించబడినట్లు బరనీ రచనల వల్ల తెలుస్తుంది.

(బానిసలు సమృద్ధిగా దొరకడం వల్ల తరచుగా ముస్లిం ప్రపంచానికి బానిసల ఎగుమతి జరిగేది. అయితే ఫిరోజ్ తుగ్లక్ మాత్రం బానిసల ఎగుమతిని నిషేధించాడు.)

(13) యూల్ (Yule), బార్బోసాల రచనల వలన 13 వ శతాబ్దంలో బెంగాల్ లో కొజ్జాలుగా మార్చబడిన బానిసల వ్యాపారం విరివిగా సాగేదని తెలుస్తుంది. బలమైన కొజ్జాల్ని కొన్నిసార్లు మలయ ద్వీప సముదాయం (Malay archipelago) నుండి కూడా దిగుమతి చేసుకునేవారు.

# బానిసల సాంఘిక హోదా:

(14) యజమాని - బానిస సంబంధం అనేది సుల్తానుల సమాజంలో అధికారం దానంతట అదే వెల్లడి కావడానికి అదొక రకం మార్గమయ్యింది. ప్రముఖుల్లో చాలామంది తమను తాము సుల్తాన బానిసలుగా అభివర్ణించుకునేవారు.

ప్రముఖులకే గాక కొత్త స్థాయి గల ప్రతి వారికీ బానిసలు లేకుండా వెళ్ళగడపడం అసాధ్యమయ్యింది. అందువల్లనే బానిసల్ని కలిగి ఉండడం సౌభాగ్యానికి చిహ్నమయ్యింది. ప్రముఖులు ఒకరితో ఒకరు ఖరీదైన ప్రత్యేకమైన బానిస బాలురని, బాలికల్ని కలిగి ఉండేందుకు పోటీలు పడేవారు.

(15) సుల్తానుల కాలంలో మనదేశంలో బానిసల్ని సేవకుల కంటే బాగానే చూసేవారని తెలుస్తుంది. యజమాని బానిస సొంతదారుగా ఆ బానిస భౌతిక సౌకర్యాల కల్పనకు శ్రద్ధ వహించేవాడు.

(16) తెలివిగల బానిసల్ని ఆదరంగా చూసేవారు. తమ నిపుణత కారణంగా ఉన్నత పదవులు పొందిన బానిసలు ఎందరో ఉన్నారు. సుల్తాన్ గా ఎదిగిన బాల్బన్ ఒకప్పుడు నీళ్ళు మోసే బానిసయే.

ఇబ్నబటూటా రచనల వల్ల బానిస బాలికల్ని సమృద్ధిగా సంపాదించి వారిని బహుమతులుగా, కానుకలుగా పంచేవారని తెలుస్తుంది. మహమ్మద్ బిన్ తుగ్లక్ తన బంధువులకి, ప్రముఖులకి బానిసల్ని బహుమతులుగా ఇచ్చేవాడు. అతడు వంద మంది మగ బానిసల్ని; వంద మంది హిందూ నాట్యగత్తెలు, గాయకురాళ్ళని బానిసలుగా చైనా చక్రవర్తికి కానుకగా పంపాడు.

సుల్తానులు కలిగి ఉండే బానిసల్ని " బందగన్ - ఇ - ఖాస్ " అనేవారు. వీరు సేవకి, ధనార్జనకి మూలం కావడం చేత[17] బానిసలని చాలా బాగా చూసుకునేవారు. సుల్తాన్ కొంత మంది బానిసలని తమ కొడుకులతో సమానంగా పెంచేవారని కూడా తెలుస్తుంది.

కొంత కాలం తర్వాత సుల్తాన్ తన బానిసలకి విడుదల పత్రం ఇచ్చేవాడు.

ముస్లింలు హిందూ స్త్రీలని బానిసల్ని చేయడంలో ఆసక్తి చూపేవారు. ఒకప్పుడు హిందూ 'రాజమాతల్ని' కూడా చూడకుండా బానిసలుగా మార్చి ముస్లిం అధికారుల్ని రంజింపచేయమని శాసించేవారు.

నిజాముద్దీన్ ప్రకారం ముస్లిం, సయ్యద్ స్త్రీలని రాజపుత్రులు తీసుకెళ్లి బానిసలుగా మార్చేవారని తెలుస్తుంది. ఏదేమైనా గమనిస్తే దీని వెనుక మత విద్వేషం కొంత కారణం గా కన్పిస్తుంది.

కె. ఎమ్. అష్రఫ్ తన "లైఫ్ అండ్ కండీషన్స్ ఆఫ్ ది పీపుల్ ఆఫ్ హిందూస్థాన్" లో బానిసల సమాజస్థాయి గురించి కింది అభిప్రాయాలు వెల్లడించారు.

" హిందూస్థాన్ లో ముస్లిం పాలనలో బానిసలకి నిర్దిష్ట స్థానంలేదని, హక్కులు గాని లేవని అనుకుంటాం. ఈ అభిప్రాయం వాస్తవాలు (facts) ద్వారా సమర్థించబడటం లేదు. సిద్ధాంతం రీత్యా మాట్లాడితే బానిస సాధారణంగా ముస్లిం/ఇస్లాం మతం స్వీకరించేవాడు, కాబట్టి అతడు ముస్లిం సమాజంలోని మరే ఇతర సభ్యుని వలెనే అవే హక్కుల్ని కలిగి ఉంటాడు. అవి అప్రస్తుతంగా ఉండే సౌభ్రాతృత్వం సమానత్వం అనే భావనతో. అందువల్ల, అతని నైతిక కోరికలు, అవి సరైన-ప్రతిభ గుర్తింపు పొందితే, అప్పటికీ, ఎప్పటికీ నిరాకరించబడలేదు. అతడు మొదట హిందువైతే, బహుశా తక్కువ

కులానికి చెందిన వాడయితే, అతని సామాజిక మార్పు ఉన్నతి కోసమే నని నిర్ణయాత్మకంగా చెప్పవచ్చు. ఒకవేళ అతడు ఉత్తమ కులానికి చెందిన వాడయితే అతడు హిందూ సమాజంలో తన స్థాయిని/హోదాని కోల్పోయి అవమానకర పరిస్థితుల్లో తప్ప తిరిగి హిందూ సమాజంలోకి వెళ్ళలేక పోయేవాడు."

"ప్రాచీన కాలంలో మాత్రం ఒక బానిస పరిస్థితి చాలా భిన్నంగా ఉండేది. సాధారణంగా అతడు యుద్ధ ఖైదీ. ఆ యుగపు సైనిక పద్ధతుల ప్రకారం అతని జీవితం అతన్ని బందీ చేసిన వాని దయ మీద ఆధారపడి ఉండేది. అతనికి ఖైదీని చంపేందుకు పూర్తి అధికారం ఉండేది. ఒక సైనిక విజయం మొదలుకాక ముందే ఈ విషయం ఇరువైపుల వారికీ తెలుసు. అందుకే, ఎప్పుడైనా ఒక విజేత (ఇప్పుడు బానిస కి యజమాని) అతని జీవితాన్ని రక్షించి వదిలేసి అతన్ని తర్వాత పనులకి నియమిస్తే అది ఆ విజేత చేసిన సాయం, చూపిన ఉదారత అవుతుంది. ~~ప్రదేశంగా~~ యుద్ధ ఖైదీని మార్కెట్లో అమ్మినప్పుడు ఆ కొనుక్కున్నవాడికి బానిస అతని ఇతర సొమ్ము ఎలాంటిదో అలాంటివాడే. అందువల్ల బానిసని బహుమతిగా ఇచ్చివేయడమో లేదా మరేవిధంగానైనా వదిలించుకోవడమో చేయవచ్చు. అయితే తెలివైన ఏ

బందీదారుడు గాని, కొనుక్కున్నవాడు గాని తన సంపద రక్షణ ని నిర్లక్ష్యం చేయలేడు. ఎందుకంటే సరైన శ్రద్ధ చూపితే బానిస ద్వారా (ప్రత్యక్షంగా డబ్బు సంపాదించవచ్చు), బహుశా మంచి లాభం లో కూడా."

— కె. ఎమ్. అష్రఫ్

ఇస్లాం సాంఘిక క్రమంలో

సాంఘిక సమానత్వం, సోదరభావం, గౌరవం, ఆత్మగౌరవం వంటి ఉన్నత సూత్రాలు ఉండాలి. కాని ఇస్లాం ప్రముఖుల అధికార దాహం ఉన్నత - తక్కువ జాతులని భేదం చూపేలా చేసింది. భౌతిక లాభాల కోసం మనిషి ని బానిస పేరుతో సరుకు కన్నా హీనం చేశారు. సుల్తానుల కాలంలో మేలు జాతి గుర్రాన్ని బాగా చూసేవారు, దాని ధర కూడా డజను పురుష డజను (స్త్రీ) బానిసల ధర కంటే ఎంతో ఎక్కువగా ఉండేది.

(18) [ఏదైనా ఈ బానిస పద్ధతి ఆధునిక భావాలకి విరుద్ధమైందే గాక అమానవీయమైంది, హేయమైంది.]

# Caste under Sultanate

[ఇంతకు ముందు వలె సుల్తానుల పాలన లో కూడా హిందూ సమాజం కులవ్యవస్థ తోనే నడిచింది.] తురుష్కుల పాలన వల్ల హిందువులు తమ కుల కట్టుబాట్లని మరింతగా స్వాతంత్ర్య భాగాలలా ఉన్నదానికంటే పటిష్టంగా జటిలంగా చేశారు.

తురుష్కులు అందమైన హిందూ స్త్రీలని భార్యలుగా బలవంతంగా మార్చుకునేవారు. దీన్ని నిరోధించడానికి ఉన్నత కులాల్లో బాల్యవివాహాలు, స్త్రీలని పరదాల్లో నిర్బంధంగా ఉంచటం మొ॥ నియమాలు పటిష్టం చేశారు. వితంతు వివాహాలు ఆ రోజుల్లో తక్కువ కులాల్లో తప్పించి ఉనికే కూడా లేదవి. ఉన్నత కులాల్లో మంచి స్థోమత గల కుటుంబాల్లో మాత్రమే ఆడపిల్లలు చదువుకునే అవకాశం దొరికేది. బాలుర ప్రాథమిక విద్య మాత్రం అన్ని కులాల వారికి అందేది.

హిందూ సమాజం నాలుగు ప్రాథమిక వర్ణాలుగా విభజింపబడింది — బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఇదే క్రమంలో వారి స్థాయి, హోదా తగ్గుతూ వస్తాయి. ఈ వర్ణాల ముఖ్యంగా బ్రాహ్మణ, క్షత్రియుల

విధులు స్మృతుల్లో వివరంగా చెప్పబడ్డాయి.

బ్రాహ్మణులు సూర్యోదయం నుంచి
సూర్యాస్తమయం వరకూ వెలుగులో ఉండి వారి
శక్త్యనుసారి, ఇచ్ఛాపూర్వక విధులను ఇతర గౌరవనీయ
విధులను నిర్వర్తించవలెను. కలియుగం లో
యజ్ఞయాగాలు చేయడం ద్వారా జీవితం
గడపడం కష్టమైపోయింది బ్రాహ్మణులకు
(ఇతరుల సాయం లో) కష్ట సమయాల్లో (distress)
వై కారుండా మార్గాలు సమయాల కూడా
వ్యవసాయం చేసుకోడానికి కూడా శాస్త్రాలు
అనుమతించాయి. మరికొన్ని గ్రంథాల్లో
వర్తకం కూడా బ్రాహ్మణులకు అనుమతించబడింది.

క్షత్రియులకు దుష్ట శిక్షణ
శిష్ట రక్షణ విధిగా చెప్పబడింది. ఎప్పటి
లాగానే ప్రజల్ని రక్షించడానికి గానూ ఆయుధాల్ని
ధరించే హక్కు వీరికి మాత్రమే పరిమితమవుతుంది.
చాతుర్వర్ణ సాంఘిక క్రమాన్ని సాయుధులై
తమ బలం తో కాపాడాల్సిన విధి క్షత్రియులదే.
అయితే ఆచారాలు సార్వభౌమాధికారం

తురుష్కులకి చెంది ఉండడం చేత మునుపటి పాలక వర్గానికి చెందినవారు - రాణాలు, రాజాల యొక్క కొడుకులు వెయిన వారంతా సుల్తానుల పాలనలో గ్రామ ప్రముఖులు గా / గ్రామీణ ఉన్నతవర్గం గా మారి పరిపాలనా శాఖ (administrative wing) గా ఏర్పడ్డారు. వీరి సహాయం లేకుండా ప్రభుత్వం పని చేయలేదు. ఒక రకమైన అస్పష్టంగా అధికారాన్ని పంచుకోవడం అన్నది కొందరు ప్రముఖుల వర్గానికి, నగరాల్లో ఉండే ప్రభుత్వ ఉద్యోగి కి మధ్య ఏర్పడింది. ఢిల్లీ సుల్తానుల పాలనా కాలంలో ఈ విషయం కీలక ప్రాముఖ్యత కలిగి ఉంది.

శూద్రుల విధులు, వృత్తుల గురించి భిన్న కోణాలు వెల్లడి అయ్యాయి. కొన్ని రచనల్లో శూద్రుల్ని బ్రాహ్మణులపై పూర్తి గా ఆధారపడ్డవారిగా చిత్రించారు. శూద్రుల యొక్క అత్యున్నత విధి గా బ్రాహ్మణులకి సేవ చేయడాన్ని చెప్పారు, తద్వారా మాత్రమే వారికి భగవంతుని దీవెనలు అందుతాయని పేర్కొన్నారు. ఈ సేవ శూద్రులు తమ దైనందిన జీవిక గా గల వృత్తులు నిర్వర్తిస్తూ వాటితో పాటు గా చేయాల్సి ఉండేది. క్షత్రియులకి, వైశ్యులకి సేవ చేయడం శూద్రుల కర్తవ్య ధర్మంగా

వారి భావాల్ని అన్ని నియమాలకు లోబడి ల్ని తరగతులు, వర్గాలు, కులాలు నుంచి వస్తూరావటాని తెలుస్తుంది. ఇవన్నీ ఒకరి కులానికి సంబంధించి వున్న వివాహ సంబంధాలు ఉన్నప్పటికీ కలగలుపుగానే ఉండేవి.

బాహ్యవర్ణాలలోనే పాటుగా ఎన్ని మిశ్రమ కులాలు కూడా ఉండేవి. ఇన్ని శాస్త్రాలు
10 అనులోమ వివాహాల ద్వారా జన్మించిన వారిని వారి తండ్రి కులానికి పెంచగా మరికొన్ని శాస్త్రాలు తెలిని పిల్లల్ని వారి తల్లి కులానికి చెందిస్తాయి.

'భండారులు' తెలుగువారిగా పిలువబడేవారు. వారిని తాకినవారు ప్రక్షాళన/ శుద్ధి స్నానం చేయాలి. వారితో మాట్లాడినా, నిద్రించినా, కలిసి ఎక్కడికైనా వెళ్ళినా, వారి బావిలోంచి నీరు వాడుకున్నా, భండారుని గిన్నెలోంచి ఏదైనా బావి లోంచి నీళ్ళు లాగితే లాగినా, భండారుని ఆహారం తిన్నా, తమ ఇంట్లో తెలుగుపెట్టినా, తెలుగులో కలిసి ప్రయోగం చేసినా, భండారుడు తన ఇంట్లో తెలుగు పెట్టినా బ్రాహ్మణులు ఎన్ని ప్రాయశ్చిత్తాలు, ప్రక్షాళనలు చెయ్యవలసి వచ్చేది/ చేసుకోవలసి ఉండేది.

సుల్తానుల పాలనలో ముస్లిముల్లో
కూడా కొన్ని భాగాల మధ్య తీవ్ర విభేదాలు,
తేడాలు ఉండేవి. తురుష్కులు, ఇరానియన్లు,
ఆఫ్ఘన్లు, భారతీయ ముస్లింలు వేరు వేరుగా
మాత్రమే పరస్పరం వివాహాలు చేసుకునేవారు.
[హిందువులలో కులాంతర వివాహాలు స్పష్టంగా
నిషేధించబడిన దాని ప్రభావం ముస్లిములపై
కన్పిస్తుంటుంది. హిందువులలో తక్కువ
కులాల వారు ముస్లిములుగా మతం మార్చుకొంటే
కూడా వారిని అదేవిధంగా చూసేవారు.]
[హిందువులలో ఉన్నత కులాల
వారు ముస్లిములకు శూద్రులకు విధించిన నియమాలే
వర్తింపచేసేవారు.] అయితే వివాహ సంబంధాలు
కొందరు కులాల వారి మధ్యనూ, హిందూ-ముస్లింల
మధ్యగల సాంఘిక సంబంధాల్లో ఏకరీతిగా
వ్యవహరించడానికి ఎట్టి అవరోధాలు కలిగించలేదు.

* Vol 5 BT Page: 2 లో 2 paras.

# Sufism in North India

సూఫీ తత్వ ముఖ్యాంశాలు :

భారతదేశంలోపల, వెలుపల కూడా ఎన్నో సూఫీ వర్గాలు/క్రమాలు (వీటినే సిలసిలాహాలంటారు.) ఏర్పడ్డాయి. వీటన్నిటిలో వాటి ప్రత్యేక లక్షణాలు ఉమ్మడి ఉంటాయి. అయితే సూఫీ వర్గాలన్నిటిలో సాధారణంగా కొన్ని లక్షణాలు ఉంటాయి. వాటిలో ముఖ్యమైనవి

1) ఇస్లాం ప్రపంచంలో వృద్ధి చెందిన సూఫీ తత్వం సూఫీ మార్గాన్ని అంటే "తరీఖ" ను దాటడం ద్వారా దివ్య వాస్తవంతో (హాకీకత్) ప్రత్యక్ష సంబంధం ఏర్పరుచుకునే పద్ధతి అని నొక్కి చెప్పింది.

2) సూఫీ నమ్మకాల ప్రకారం, కొత్తవాళ్ళు అనేక స్థాయిలను (ముకామత్) దాటుతూ, మనస్తత్వ మానసిక పరిస్థితుల్లో (హాలత్) మార్పుల ద్వారా భగవత్ భావాన్ని అనుభవించాలి.

3) సూఫీ మార్గాన్ని కేవలం ఆధ్యాత్మిక మార్గదర్శి యొక్క కఠిన పర్యవేక్షణలో మాత్రమే దాటగలరు. ఆ మార్గదర్శి (షేక్, పీర్, ముర్షిద్) తాను స్వయంగా ఈ మార్గాన్ని దాటి భగవంతుడితో

వారందరికీ తెలిసి ఉంటుంది.

7) ఒక్కొక్క సూఫీ వర్గం దాని కార్యకలాపాల్ని ఆవాసగృహాలనే కేంద్రంగా "<u>ఖన్‌కాహ్</u>" అను ఏర్పరుచుకునేది. ఇక్కడ పీర్ తన శిష్యులకు ఆధ్యాత్మిక బోధనలు చేసేవాడు. పీర్ యొక్క గొప్పతనం మరియు ఖన్‌కాహ్ యొక్క ప్రజాదరణ, శిష్యుల సంఖ్య ఆధారపడి ఉంటాయి. ఇవి మతపరమైన దానాలు, మొ॥ వాటి ద్వారా పోషింపబడేవి.

## సూఫీల ముఖ్య బోధనలు :

1) ఇస్లాం మతంలోని ప్రాథమిక సూత్రమైన "దేవుడు ఒక్కడే (or) "ఒకే దేవుడు" (monistic philosophy) అన్న తత్వమే సూఫీతత్వానికి మూలాధారం.

2) అయితే భారత భక్తి ఉద్యమకారుల వలెనే సూఫీలు కూడా తమ సొంత తత్వం, సొంత తాత్విక దృక్పథంతో దేవుని గురించి, మనిషికి దేవునికి మధ్య ఉన్న సంబంధాన్ని గురించి ఏర్పరుచుకున్నారు.

3) సూఫీమతం యొక్క ఏకేశ్వరోపాసన "వహదత్ ఉల్ వజూద్" (అస్తిత్వంలో ఐక్యత) మీద ఆధారపడింది. దీని ప్రకారం సృష్టించేవాడు (హక్) సృష్టించబడ్డవాడు (ఖల్క్) ఇద్దరూ ఒక్కటే. మరోవిధంగా చెప్పాలంటే అన్ని భౌతికాల వెనుక దేవుడే ఏకత్వం, పైకి కనిపించే ద్వంద్వాల వెనుక అసలు వాస్తవం దేవుడు. ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన షేక్ మొహియుద్దీన్ ఇబన్ అల్

(సూఫీలు) మాటల్లో

"దేవుడు తప్ప మరేదీ లేదు, ఆతడు తప్ప
మరి దేనికీ అస్తిత్వం లేదు, అన్నిటి యొక్క
పరమార్థం ఒక్కడే (దేవుడే)"

4) సూఫీలు భగవంతునికి ఆత్మకి మధ్య సామరస్య సంబంధాన్ని ఏర్పరచాలనుకుంటారు. అందుకే భగవంతునితో ప్రత్యక్ష సంబంధం కోసం తపిస్తారు.

5) భగవంతునితో ఈ ప్రత్యక్ష సంబంధాన్ని ఈ మానవ శరీరంతోనే (శాకి జమ) పవిత్ర ప్రేమ, భగవంతునికి పూర్తిగా అర్పించుకోవటం ద్వారా సాధించవచ్చు.

6) సూఫీ సన్యాసులు (పీర్లు) ఆధ్యాత్మిక గురువులుగా వారి శిష్యులకు (మురీదులు) ఈ శాశ్వతమైన దివ్య బ్రహ్మానందాన్ని (మారిఫత్ లేదా వస్ల్) ను అందుకోవడానికి మార్గదర్శకత్వం వహిస్తారు.

7) సనాతన ముస్లింలు భగవంతునికి, మనిషికి గల సంబంధాన్ని యజమాని, బానిస గా చెప్పారు. కానీ సూఫీలు మాత్రం దాన్ని ప్రేమించేవాడు, ప్రేమించబడేవారిగా లేదా భర్త, భార్యలుగా

చెప్పారు .

8) భగవంతుని పిలుపుని ప్రేమగా ఎవరైతే పిలవగానే పరిగెత్తుతారో వారు భగవంతుని సాన్నిహిత్యాన్ని అనుభవించగలరు.

9) భగవంతుడు కలిగించిన సంపూర్ణ శుద్ధ వాస్తవం, దివ్య సౌందర్యం వాళ్ళు దీన్ని "జమాల్" అన్నారు.

10) ఈ ప్రపంచం కేవలం భ్రాంతి కానేరాదు. ఈ ప్రపంచం కలిగించే భగవంతుని బాహ్య స్వరూపం. దీన్ని వాళ్ళు (హుస్న్) Husn అన్నారు. (ప్రేమించదగ్గ సౌందర్యం)

11) ఆత్మ - వికసీకరణ, ప్రేమించబడాలనే కోరిక - ఇవి నిత్య సౌందర్యానికి తప్పనిసరి లక్షణాలు. అందుకనే సూఫీతత్వం ప్రేమ సూత్రం మీద ఆధారపడింది. విశ్వానికి ఈ ప్రేమతత్వమే ఒక మూలంలా పరమార్థం, సృష్టి అంతటికీ కారణమూను.

12) చాలా మంది సూఫీలు సాధారణ జీవితాన్ని గడిపి భగవంతునికి భక్తిగా లొంగిపోవటం పై ప్రాధాన్యాన్ని ఉంచారు.

13) సూఫీలు ఆత్మప్రక్షాళన, పవిత్రత లాంటివి
ప్రేమించే భగవంతునిలో పూర్తిగా లీనం కావడం
కోరుకున్నారు.

14) హృదయ పవిత్రత అది ఆచారాలు, కర్మకాండల
కన్నా ఉత్తమమైంది, నిజమైన దివ్యవస్తువున్ని
తెలుసుకునేందుకు ఇదొక్కటే మార్గం.

15) భగవంతునితో సంబంధాన్ని ఏర్పరచుకునేందుకు
వ్యక్తి 10 దశల్ని దాటాల్సి వుంటుంది — అవి
(1) తౌబా (పశ్చాత్తాపం) (2) వారా (మితాహారాలు)
(3) జుహ్‌ద (భక్తి, విశ్వాసాలు) (4) Faqr ఫక్ర్ (పేదరికం)
(5) సబ్ర (ఓర్పు) (6) షుక్ర్ (కృతజ్ఞత)
(7) ఖౌఫ్ (భయం) (8) రజ (ఆశ) (9) తవక్కుల్
(తృప్తి / ఉన్నదానిలో తృప్తి) (10) రజా (భగవంతునికి
అర్పించుకోవటం)

Sheikh Shihabuddin Suhravardi in his
"Awarif ul Ma'aril" quoted in
K. A. Nizami, "Religion and Politics in India"

16) సూఫీలు ఈ భౌతిక ప్రపంచ వాంఛల్ని త్యజించి
ప్రార్థనలు చేశారు. నిజమైన సూఫీలు

వర్గార్థులుగా ఇదా ఆరేడు మంది సూఫీలు
భారత్‌కు చేరుకున్నారు. 13, 14 శతాబ్దాల్లో
భారతదేశంలో పలు ప్రాంతాల్లో సూఫీ ఖానఖాహ్‌లు
వ్యాపించాయి. ఈ సూఫీలు ఇస్లాం ప్రచారం
మరియు పలు పద్ధతుల్ని, క్రమాల్ని మన దేశంలో
పరిచయం చేశారు. వారి సాంఘిక సంస్థల్ని విస్తృతంగా
వారి ప్రభావిత ప్రాంతాల్లో స్థాపించారు. 14
వ శతాబ్దం మధ్యకల్లా ముల్తాన్ నుండి
బెంగాలు దాకా, పంజాబు నుండి దేవగిరి దాకా
సూఫీల ప్రభావం కనబడుతుంది. 14 వ
శతాబ్ద యాత్రికుడు బటూటా ద్వారా కేవలం
ఢిల్లీ ; దాని పరిసర ప్రాంతాల్లోనే దాదాపు
2000 రెండు వేల సూఫీ కేంద్రాలు, ఖానఖాహ్‌లు
ఉన్నట్లు తెలుస్తుంది.

### భారతదేశంలో సూఫీతత్త్వం

ఇతర ఇస్లాం ప్రపంచ ప్రాంతాలలోని సూఫీతత్త్వం, ఇరాన్
మరియు (ముఖ్యంగా ఇరాక్, ఖొరాసాను నుండి)
జనించింది. కాబట్టి దాని లక్షణాలలో
మార్గం లేది భారతీయ సూఫీ శాఖలు

## భారతదేశంలో సూఫీ శాఖలు:

మన దేశంలో అనేక శాఖలు (సిల్‌సిలాలు) వెలుగు చూసినాయి. వాటిలో ముఖ్యమైనవి క్రింద చర్చించబడ్డాయి.

### సుహ్రావర్ది సిల్‌సిలా:

సుల్తానుల కాలంలో సుహ్రావర్ది శాఖ ఒక ప్రముఖ శాఖ. భారతదేశంలో దీని స్థాపకుడు షేక్ బహావుద్దీన్ జకారియా (1182-1262). ఇతడు ఖొరసాను. బాగ్దాదులో ఈ శాఖని ప్రారంభించిన/స్థాపించిన షేక్ షహాబుద్దీన్ సుహ్రావర్ది కి ఇతడు శిష్యుడు. అతని ఆజ్ఞ మేరకే ఇతడు భారత్ కు వచ్చాడు. బహావుద్దీన్ ముల్తాన్, సింధ్ లను తన కార్యక్రమాలకు కేంద్రం చేసుకున్నాడు. ఈ విధంగా భారత్‌లో మొట్టమొదటి ఖానఖాలలో ఒకటి ఇతని చేత స్థాపించబడింది.

ఆ సమయంలో ఢిల్లీని ఇల్‌టుట్‌మిష్ పాలిస్తున్నాడు. ముల్తాన్ అతని నసిరుద్దీన్ కుబాచా పాలనలో ఉంది. బహావుద్దీన్ కుబాచా పాలనని విమర్శించి బహిరంగంగా

## చిష్తీ సిలసిలా :

సుల్తానుల కాలంలో మనదేశంలో

చిష్తీ సిలసిలా వృద్ధి రెండు దశల్లో జరిగింది. మొదటి దశ షేక్ నాసిరుద్దీన్ (చిరాగ్ ఇ ఢిల్లీ) మరణం తో క్రీ.శ. 1356 లో ముగిసింది. రెండవ దశ ఆరంభంలో అంటే 14 వ శతాబ్దం ద్వితీయార్థంలో క్షీణదశలో ఉండి తర్వాత పునరుద్ధరణ, దేశం లో వివిధ ప్రాంతాల్లో వ్యాపించడం 15, 16 శతాబ్దాలలో జరిగింది.

### తొలి దశ :

చిష్తీశాఖ హేరత్ నందు జన్మించింది. ప్రసిద్ధ సూఫీ సిద్ధపురుషుడు ఖ్వాజా అబ్దుల్ చిష్తీ. సిజిస్తాన నందు క్రీ.శ. 1141 లో పుట్టిన ఖ్వాజా మొయినుద్దీన్ చిష్తీ సూఫీ భారతదేశంలో ప్రవేశపెట్టాడు. అతడు ఘోరీ దండయాత్రల సమయంలో మనదేశం వచ్చాడు. 1206 ప్రాంతం లో అజ్మీర్ నందు స్థిరపడ్డాడు. హిందూ, ముస్లిం ల ఇరువురి మన్ననలు పొందాడు. అతని కార్యకలాపాల గురించి ప్రామాణికమైన ఆధారాలు ఏవీ దొరకలేదు. తర్వాత కాలం లో చాలా కథలు అతనిని గొప్ప ఎవాంజెలిస్టు (సువిశేషవక్త) గా చిత్రించారు. అయితే మల్ఫూజాత్లలో

అయినంత ఎక్కువగా ఏమీ పాల్గొనలేదు. ముఖ్యంగా అతనిపై
ఉలమా ధోరణి సనాతనవాదంగానే ఉండేది. తర్వాత
ఖ్వాజాబాబాలతో అజ్మీరు లాంటి ఉలమా సమాధి తీర్థయాత్రలకి
గొప్ప సందర్శనా కేంద్రం ఉంది. మొయినుద్దీన్
ఖ్వాజా ఉస్మాన్ హారౌని (హారూని) యొక్క శిష్యుడు.
ఇతనికి ఇద్దరు భార్యలు. క్రీ.శ. 1236 లో చనిపోయాడు.
అద్వైత తత్వాన్ని బోధించాడు. ఇతని శిష్యులు గా
హామీదుద్దీన్ నాగోరి, కుతుబుద్దీన్ భక్తియార్ కాకి మొ॥
వారిని చెప్పవచ్చు. మొయినుద్దీన్ ఏర్పరిచిన
చిష్తి సిలసిలా తప్పని సరిగా భారతీయమైనదే,
ఎందుకంటే ఇప్పటికి అఫ్ఘాన్ లో స్థాపించిన చిష్తీ క్రమం
దాదాపుగా అంతరించిపోయింది. ఆధునిక పరిశోధనల
వలన మొయినుద్దీన్ భారత్ కు ఘోరి పృథ్వీరాజ్ పై
విజయం సాధించడానికి ముందుగా కాక <u>తర్వాత</u>
మాత్రమే వచ్చినట్లు తెల్పవచ్చు. ఖ్వాజా
అజ్మీరు లో స్థిరపడటానికి కారణం అది చిష్తీ
వలె చిన్న పట్టణం, ఢిల్లీలోని రాజకీయ కేంద్రం
నుంచి దూరంగా ఉండడం. ఆధ్యాత్మిక వేత్తలకి
ఏకాంతత కు పెద్ద నగరం కన్నా చిన్న పట్టణమే
మంచిదని ఖ్వాజా నమ్మాడు. అదువల్లే ఇతని
శిష్యుడు హామీదుద్దీన్ 'నగౌర్' లోనే చిన్నపట్టణం

ఆధ్యాత్మిక గీతాలు, మంత్రాల ద్వారా రంజింప
చేయమనేవారు. ఇది సూఫీ మతంలో
సాంప్రదాయాలకు ఇంతటి విస్తృతం లేకున్నా
ఉద్దేశం లేకపోయినా పెద్ద సంఖ్యలో ప్రజలు
ఖాన్‌ఖాలకు వచ్చేవారు. భక్తియార్ కాకీ
ఆధ్యాత్మిక సంగీతమంటే ఎంతో ఇష్టపడి చివరికి
ఆ సంగీతాన్ని వింటున్నప్పుడే 1235 లో చనిపోయాడని
తెలుస్తుంది. కుతుబ్ మినార్ కట్టడం ఇతని
పేరు మీదనే జరిగిందని చెబుతారు.

సనాతన, సంప్రదాయవాదులను
పాటించి ఢిల్లీ లో సూఫీ ముఖ్యస్థుగా
చెప్పని నిర్మించిన ఘనత భక్తియార్ కాకీదే.
సనాతనులు కాకీని వెళ్లగొట్టాలని చేసిన
ప్రయత్నాన్ని ఇల్తుత్‌మిష్ వమ్ము చేశాడు.
ఉలేమాల ప్రాబల్యాన్ని సమర్థనం చేసేందుకు
ఇల్తుత్‌మిష్ ఈ చర్య తీసుకున్నాడు. అప్పటికే
కాకీ ఎంతో ప్రజాదరణ సంపాదించాడు.
అతడు ఢిల్లీ వదిలేద్దామని నిశ్చయించుకొనగా
(కొన్నాళ్లు వెళ్లాడని) ప్రజలు వేలల్లో నగరం
వెలుపల మైళ్ల దాకా అతని వెంట రావడంతో

చివరికి రాకే తన ప్రయత్నాన్ని విరమించుకుని ఢిల్లీ లోనే ఉండిపోయాడు.

సుహ్రావర్ద్దీన మార్గ శిలిసా

<u>షేక్ హమీదుద్దీన నగౌరి</u> (d. 1274). ఇతడు రాజస్థాన్ లోని నగౌరి నందు చిష్టి సిలసిలా ఏర్పరచాడు. సాంప్రదాయ రాజస్థాన్ రైతులా జీవించాడు. అధికారం లో ఉన్నవారి నుంచి వేరుపడ్డాడు/ దూరంగా ఉన్నాడు. నిష్పక్షల శాకాహారి. అతడు, అతని వారసులు ఎన్నో హిందవీ సూఫీ పద్యాల్ని స్థానిక భాష అయిన హిందవి లోకి కూర్చారు. ఈ రకమైన కవిత్వాలకు ఇవే ఆద్యమైనవి. హమీదుద్దీన వైవాహిక జీవితాన్ని గడిపినా అతి సాధారణంగా మట్టి గుడిసెలో జీవించాడు. అతని విలువల వలన హిందువుల నుంచి ఆదరం సంపాదించాడు.

భక్తియార్ కాకి తర్వాత ఢిల్లీలో అతని వారసుడిగా శిలిసా ఖ్వాజా ఫరీదుద్దీన్ మసూద్ (1175-1265) గంజ్‌షకర్ గా ఇంకా ప్రసిద్ధంగా <u>బాబా ఫరీద</u> గా ప్రముఖుడయ్యాడు. ఇతడు పంజాబు లోని అజోధన నందు ఖనకా లో స్థిరపడ్డాడు. అతడు వివిధ వర్గాలతో, ధర్మాలతో సంబంధాలను ఏర్పరిచాడు. ఇతని ఖనకా ను నాథపంథి

యోగులు కూడా దర్శించి అతనిలో మార్మికులని

స్ఫూర్తి చర్చించేవారు. అతని మరణానంతరం

300 సంవత్సరాల తర్వాత అతని పద్యాలు సిక్కు

సిక్కుల పవిత్ర గ్రంథం ఆదిగ్రంథ్ లో చేర్చ

(1604 లో 5వ గురువు అర్జున్‌సింగ సంకలనం

చేశాడు) బడటం పంజాబు లో అతనికున్న

ఆదరణను నిరూపిస్తుంది. పాకిస్తాన్ లో ఉన్న

అతని సమాధి నేడు గొప్ప సందర్శనా స్థలం.

బాబా ఫరీద్ మత కార్యకలాపాలు, మార్మికత

చిష్టీ శాఖను ఉత్తర భారతదేశంలో వ్యవస్థగా ఎదిగేలా

చేశాయి.

ఒకప్పుడు రాజకుటుంబానికి చెందిన

బాబా ఫరీద్ సాధువుగా మారాడు. అతనికి అనేక

మంది భార్యలు, పిల్లలు ఉన్నారని అందరూ కటిక

దారిద్ర్యంలోనే గడిపేవారని తెలుస్తుంది. తన

గొప్ప వ్యక్తిత్వం, కవితాభివ్యక్తి చేత చిష్టీని

దేదీప్యమానం చేయగలిగాడు. అతడు భక్తి ఉద్యమకారుల

లో, సాంస్కృతిక హిందూ ప్రజానీకం లో

మమేకమయ్యాడు. అతని ఆధ్యాత్మిక బోధలు

హిందూ, ముస్లింల అందరి దగ్గరకు వెళ్లాయి.

బాబా ఫరీద్ వేదాంతం,

ప్రాపంచిక వస్తువులు, బంధాలు మొ॥ వాటిని త్యజించటం, ఉపవాసం లాంటి నియమాల ద్వారా ఇంద్రియనిగ్రహం అలవర్చుకోవడం, ఇతరులకి సేవ చెయ్యడం, విధేయతని అలవాటు చేసుకోడం మొ॥ వాటి మీద అతను ప్రాధాన్యాన్ని ఇచ్చాడు.

షేక్ ఫరీద్ సూఫీ బోధనల యొక్క పెద్ద సమూహాన్ని ఉత్పత్తి చేశాడు. ఇస్లాం బోధనల్ని వీరు భారత్ లోపల, వెలుపల కూడా మార్మికుల ద్వారా ప్రచారం చేశారు. వారిలో మిక్కిలి ప్రసిద్ధుడు హజరత్ నిజాముద్దీన్ ఔలియా (1236-1325). ఇతడు ఢిల్లీ నందలి ఘియాస్‌పూర్ లో తన కేంద్రాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఇతడు రాజధాని సాంఘిక - సాంస్కృతిక వాతావరణానికి ఇస్లామ్ భావాల్ని అద్దాడు. తన గొప్ప వ్యక్తిత్వం, సామాజిక సేవల ద్వారా ఢిల్లీ ప్రజల హృదయాల్ని చూరగొన్నాడు. ఇతని కాలంలో ఏడుగురు సుల్తానులు ఢిల్లీ సింహాసనం పై కూర్చున్నా ఇతడు ఒక్కసారి కూడా రాజాస్థానం దర్శించడం గాని రాజాశ్రయం పొందడం గాని చెయ్యలేదు. ఔన్నత్యానికి, తనకున్న వేలాది శిష్యుల

చాలా మంది ప్రేమికులు, పండితులు కబీర్ తమ 'పీర్' (ఆధ్యాత్మిక గురువుగా) గా కీర్తిస్తారు. ఇతడు "మహబూబ్ ఎ ఇలాహీ" గా ప్రసిద్ధుడు. ప్రముఖ చిష్తీ సూఫీల్లో బ్రహ్మచర్యం ను పాటించినవానిగా ఇతడొక్కడే కన్పిస్తాడు.

నిజాముద్దీన్ బాబా, అమీర్ ఖుస్రూలు ఇద్దరి సమకాలీకులు. నాటి పాండిత్య, సాంస్కృతిక, మత సంబంధ ఉత్తర భారతీయుల జీవితాల్లో [illegible] వారిని వీరిద్దరూ ప్రశంసగా వివరించారు. ఇతని బోధనలు [illegible] [illegible] వ్రాశాయి. ఇతని సందేశాలు, సంభాషణలు (మల్ఫుజాత్) "ఫవాయిద్-ఉల్-ఫువాద్" లా అమీర్ హసన్ సిజ్జీ ద్వారా క్రోడీకరించబడ్డాయి. ఇది సూఫీల [illegible] కోసం ఎక్కువగా వారి ఆచరణాత్మక విషయాలకే చెందిన గ్రంథం. ఇతని ఖానా & ఉర్స్ లంగర్ హిందూ ముస్లింలను సమంగా ఆహ్వానించేది. ఇతడు నాథపంథ యోగులలా చర్చలు జరిపేవాడు. యోగా కి చెందిన ఉపరి అభ్యాసాల్ని నేర్చుకుని యోగుల చేత సిద్ధ (perfect) అనిపించుకున్నాడు.

నిజాముద్దీన్ మనుషుల్ని భగవంతుని ప్రేమ చేత ప్రేరేపించేవాడు, వారు తమ ప్రాపంచిక బంధాల్ని తెంచుకోవడానికి సాయం చేసేవాడు. మనుషుల మీద ప్రేమ లేకుండా భగవంతుని మీద ప్రేమ అసంపూర్ణంగా ఉంటుందని తెలిపాడు.

> "ఓ మహమ్మదీయులారా! భగవంతుని మాటగా చెబుతున్నాను, ఎవరైతే మనుషుల కోసం దేవుని ప్రేమిస్తారో అలాగే దేవుని కోసం మనుషుల్ని ప్రేమిస్తారో వారికి దేవుడు దగ్గరవుతాడు. భగవంతుణ్ని ప్రేమించడానికి, పూజించడానికి ఇదొక్కటే మార్గం"
>
> — షేక్ నిజాముద్దీన్ ఔలియా

నిజాముద్దీన్ కు చాలా మంది మంచి వారసులు ఖలీఫాలుగా ఏర్పడ్డారు. వారిలో ఒకరైన షేక్ బుర్హానుద్దీన్ ఘరీబ్ (d. 1340) మహమ్మద్ బిన్ తుగ్లక్ చేత దక్కను కు వలస పోవాల్సింది గా ఒత్తిడి చేయబడ్డ వారిలో ఒకడు. ఇతడు దౌలతాబాద్ ను తన కేంద్రంగా చేసుకుని ఇక్కడే చిష్తీ శాఖ ని వ్యాప్తి చేశాడు.

నిజాముద్దీన్ ఔలియా ఖలీఫాల్లో ప్రముఖుడు, అతని వారసుడు షేక్ నాసిరుద్దీన్ మహ్మూద్ (d. 1356) ఇతడే "చిరాగ్-ఇ-ఢిల్లీ" గా పేరుపొందాడు. ఇతను, ఇతని శిష్యులు తమవారిని చిష్టీ ఆచారాల్ని అవలంబించారు. ఉలేమాల్ని 'సమా'ల పట్ల వారి దృష్టి మార్చుకోవాల్సిందిగా కోరారు. అఖిల భారత ఖ్యాతి పొందిన చిష్టీ గురువుల్లో ఇతన్ని ఆఖరివాడిగా చెప్పవచ్చు. ఇతను మొదట్లో మహ్మద్ తుగ్లక్ సైన్యంలో తుగ్లక్ సింధ్ లో మరణించే సమయంలో సింధ్ లో ఉన్నాడు. ఫిరోజ్ సింహాసనం కి రావడానికి సాయం చేశాడు. ఫిరోజ్ ఇతన్ని గొప్పగా గౌరవించి ఢిల్లీ లో ఉన్నప్పుడు ఆస్థానానికి రావాల్సిందిగా పలుమార్లు ఆహ్వానించాడు. అయితే ఈ సాధువు రాజకీయాలకి దూరంగా ఉండడం అనే విధానాన్ని అనుసరించాడు. అతని అంచనాలకి తగ్గట్టుగా ఎవరూ కన్పడకపోవడంతో నాసిరుద్దీన్ చిరాగ్ ఎవర్నీ వారసుడిగా (ఖలీఫా) నియమించలేదు. తన శిష్యులు, బొంతల వస్త్రం, ప్రార్థనా చాప మొ|| వి అతనితో పాటే పాతిపెట్టమని ఆజ్ఞాపించాడు.

భిన్నంగా బహమనీ రాజులలో దక్కర సంబంధాలు విస్తృతంగా
రాష్ట్ర ప్రాముఖ్యం కూడా పరిగణించారు.

బహమనీ సుల్తానులు ఈ సూఫీల
రాజకీయ విధేయతలను సంపాదించి వారికి భూములు దానం
చేశారు. వీరిలో ప్రముఖ సూఫీ గురువు మహమ్మద
బందా నవాజ్, గేసుదరాజ్ (1321-1422). ఇతడు
ఫిరోజ్ షా బహమనీ నుంచి 4 గ్రామాలు బహుమానంగా
పొందాడు. ఇతను సనాతన సూఫీ, ఇస్లామిక్ చట్టం
'షరియత్' యొక్క ఆధిక్యతను ఒప్పు సూఫీ స్థానాల పైన
ఏర్పాటు చేశాడు. సనాతన ఆచారాల తో విభేదించే
పలు సూఫీ సంప్రదాయాలను గేసుదరాజ్
విస్మరించాడు. ఇంతేగాక సుందర సూఫీ సాధువుల
గాక ఇతను తసవ్వుఫ్ మీద విరివిగా రచనలు
చేశాడు. ఇతని మరణానంతరం ఇతని సమాధి వద్దకు
బహమనీ సుల్తానులు భూదానాలు చేసేవారు / చేశారు. తర్వాత
గుల్బర్గా లోని ఇతని సమాధి దర్శనస్థలం అయింది. ఇతని
ఇతని వారసులు భూస్వామిక వర్గం గా ఆవిర్భవించి సూఫీ బోధనల
పట్ల నిర్లక్ష్యం వహించడంలో సనాతన సూఫీ సంప్రదాయం
గుల్బర్గా లో అంతం అయింది. క్రీ.శ. 1422 లో
బహమనీల రాజధాని గుల్బర్గా నుండి బీదర్ కు

ఏర్పడింది.

ఉత్తర భారతదేశంలో చిష్టీల పునరుజ్జీవనం

15 వ శతాబ్దం చివర, 16 వ శతాబ్దాల్లోనూ జరిగింది. చిష్టీ సూఫీలు 3 భిన్న శాఖలకి చెందినారు. —

నగోరియా — షేక్ హమీదుద్దీన నగౌరి

సబిరియా — షేక్ అల్లాఉద్దీన అలియారి

నిజామియా — షేక్ నిజాముద్దీన అవులియా

ఇవేగాక జౌనపూర్, ఢిల్లీ సుల్తానుల రాజధాని చిష్టీలకి మరో కేంద్రం. 15 వ శతాబ్దం ప్రారంభం నుంచి లక్నో దగ్గరలోని రుదౌలి లో ఒక చిష్టీ కేంద్రం వెలసింది. తర్వాత ఆధునిక ఉత్తర ప్రదేశలోని "బహ్రైచ్" లోడీల కాలం లో చిష్టీ కేంద్రంగా వృద్ధి చెందింది. (Bahraich) యు. పి. లోని సహారాన్‌పూర్ జిల్లాలోని గాంగోహ్ సిల్‌సిలాకి కేంద్రం అయింది. ఇది షేక్ అబ్దుల్ ఖుద్దూస్ గాంగోహి (1456-1537) చే ఏర్పాటుచేయబడింది. ఇతడు సూఫీ తత్త్వం, ఆచారాలు మీద పలు గ్రంథాలు రాశాడు. ఇతడు హిందవి భాషలో ముల్లాదావూద్ రాసినట్టి చాందయాన్ ను పద్మావత్ లతో సమర్థించాడు.

రెండవ దశలో చిష్టీ కేంద్రాలు

జ్ఞాపక కట్టడాన్ని నిర్మించాడు. ఇది హిందువులకి, ముస్లింలకి ప్రముఖ పర్యాటకులందరికీ నేడు దర్శనీయ స్థలం అయింది.

## ఇతర సూఫీ క్రమాలు :

చిష్టి, సుహ్రావర్ది క్రమాలేగాక మరెన్నో సూఫీ క్రమాలు – ఫిరదౌసి, కదిరి, షత్తారి, కలందరి మొ॥ వన్నీ ఈ కాలంలో భారత్ లోకి ప్రవేశించాయి.

ఫిరదౌసి :– ఇది సుహ్రావర్ది ఉపశాఖ. ఇది బీహారు లోని రాజగిర వద్ద 14 వ శతాబ్దం చివరికి ఏర్పడింది. భారత్‌లో ముఖ్య ఫిరదౌసి గురువు షేక్ షర్ఫుద్దీన్ యాహ్యా మనేరి (d. 1380)

కదిరి :– ఇది మధ్య ఇస్లామిక్ దేశాల్లో ప్రసిద్ధం వహించింది. బాగ్దాదులో అబ్దుల్ కదిర్ జిలానీ దీన్ని స్థాపించాడు. ఇది భారత్‌లో 14 వ శతాబ్దం చివర్లో ప్రవేశించి పంజాబు, సింధ్, దక్కనులలో స్థానం పొందింది. ఇది కొంత సనాతన భావాలు కలిగింది, దీని బోధనలు సనాతన ఉలేమాల బోధనల వలెనే ఉంటాయి. కదిరి సూఫీలకి ప్రారంభంలో సుల్తానేట్ లలో పాలక వర్గాలతో దగ్గర సంబంధాలు ఉన్నాయి, రాజ సహాయాన్ని తీసుకొన్నారు. ఇది నగర – కేంద్రంగా గలది. భారత్‌లోని ముస్లింలు ఇస్లామేతర ప్రభావాలకి గురి కాకుండా భారతీయ ముస్లిముల మతాన్ని సంస్కరించడానికి ఇది ప్రయత్నించింది.

షత్తారి : ఇది షేక్ అబ్దుల్లా షత్తారి చేత మన దేశంలో 15 వ శతాబ్దంలో ప్రవేశపెట్టబడింది. ఇది కూడా సనాతన క్రమమే. బెంగాలు, జౌనపూర్, దక్కను లలో షత్తారి కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఖాదిరీల వలే షత్తారీలకి కూడా రాజాస్థానంలో దగ్గర సంబంధాలున్నాయి, రాజాశ్రయాన్ని స్వీకరించారు.

కలందరి :- ఇది సాంఘిక ప్రవర్తన సాధారణ నియమాల్ని ఉల్లంఘించి తిరుగాడే పలువిధ/రీతి లో ఉండేది. వారు తిరస్కృతమైన వారుగా, ఇస్లామిక్ చట్టానికి వెలుపలి వారిగా భావించబడ్డారు. వీరికి గుర్తింపు పొందిన ఆధ్యాత్మిక గురువుగాని స్థిరస్థానం గాని లేదు. చాలా మంది కలందర్లు తరచుగా చిష్తీ శిష్యులను దర్శించేవారు, చిష్తీ క్రమంలోనికి గ్రహించబడ్డారు. కలందర్లకు నాథపంథీ యోగులతో సంబంధాలు ఉండేవి, వీరి సంప్రదాయాలు, ఆచారాలు చెవులు కుట్టించుకోవడం మొ|| నవి కలందర్లు కూడా చేసేవారు.

రిషి : ఇది 15, 16 శతాబ్దాలలో కాశ్మీరులో పరిఢవిల్లిన సూఫీతత్త్వం. ఇది తలెత్తక ముందు హమదాన నుంచి ఒక ముస్లిం బోధకుడు మీర్ సయ్యద్ అలీ హమదాని (1314 - 1385) కాశ్మీరుకి

అనుచరుల గుంపుతో ఇస్లాం ని వ్యాప్తి చేయడానికి ప్రవేశించాడు. హమదాని, రిషి తెగలు, సూఫీల మధ్య కలహాల కాశ్మీర్ ప్రజల్ని లోతుగా ప్రభావితం చేయలేదు. ఈ రిషి క్రమం మాత్రం దేశీయమైంది, షేక్ నూరుద్దీన్ వలి (d. 1430) చేత ఏర్పాటు చేయబడింది. ఇది కాశ్మీరు గ్రామీణ ప్రాంతాలలో వృద్ధి చెంది 15, 16 శతాబ్దాలలో రైతు ప్రజల మీద అత్యంత ప్రభావం చూపింది. రిషి క్రమ ప్రజాదరణకు కారణం దాని స్ఫూర్తి ని కాశ్మీరు నందలి ప్రజల శైవ భక్తి సంప్రదాయం నుంచి పొందడం, ఈ ప్రాంత సాధువు, సాంప్రదాయాల ఒరవడిలో మమేకం చెందడం గా చెప్పవచ్చు.

## చిష్తీ క్రమం ప్రజాదరణ పొందడానికి గల కారణాలు :

సుల్తానత్ కాలంలోని సూఫీ క్రమాల్లో కూడా సూఫీల ప్రాథమిక లక్ష్యమైన ఆధ్యాత్మిక గురువు మార్గదర్శకత్వంలో సూఫీ మార్గాన్ని దాటి భగవంతునితో ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పర్చుకోవడమనే భావనను విశ్వసించారు. ఏమైనా వివిధ సూఫీ క్రమాలు భిన్నమైన ఆచార సంప్రదాయాల్ని వాటి సొంతం గా అవలంబిస్తూ రాజ్యాన్ని, సమాజాన్ని బట్టి భిన్నంగా వ్యక్తం చేశాయి. ఈ కాలంలో అన్ని సూఫీ క్రమాల కన్నా చిష్తీ క్రమం ఎక్కువ ప్రజాదరణ ను పొంది, ఎక్కువగా వ్యాపించింది. చిష్తీ ఆచారాలు, భావాలు, ఆచరణలు దాన్ని పూర్తి భారతీయ సిలసిలా గా చేశాయి.

దాని ప్రజాదరణకి కారణాలు :

1) తొలి చిష్తీల ఆచారాలు చాలా అంతకుముందే మన దేశంలో ఉన్న నాథపంథయోగులు మొ॥ వారి ఆచారాల లో చాలా దగ్గరి పోలికలు కలిగి ఉన్నాయి. నిరాడంబరమైన జీవితాన్ని గడపడం, వైరాగ్యం లో ఉండడం, గురువు ముందు ప్రణామం చేయడం, కొత్త శిష్యులకి గుండు గీయించడం మొ॥ వీటితో పాటు సామూహిక భజన్ నిర్వహించడం మొ॥

ఈ విధంగా చూస్తే సూఫీలు అప్పటికే విస్తరించిన భారతీయ సంప్రదాయాలని భాగంగా పరిగణించబడ్డట్లు తెలుస్తుంది.

2) సూఫీలు ముస్లిమేతరుల పట్ల మత సామరస్యాన్ని మత సహనాన్ని కనబర్చారు. అంతేగాక అల్పసంఖ్యాకులైన ముస్లిమేతరుల వాడుకలని, ఆచారాలని బాగుగానే గౌరవించి మెలుగుతున్నారు. వాళ్లు ప్రజాదరణ గల ప్రాకృతాలని, సామెతలని తమ బోధనలు ప్రచారం చేయటానికి వాడుతున్నారు. హిందువుల ఆచార సంప్రదాయాల్ని గౌరవిస్తున్నారు. చాలా మంది సూఫీ సాధువులు హిందవి భాషను తమ ప్రచార మాధ్యమంగా వాడుతున్నారు.

3) సూఫీ సిద్ధాంతాలలో 'ధనిక-పేద భేదాలు' లేనందున ఇవి పెద్ద సంఖ్యలో భారతదేశంలోని కింది తరగతి ప్రజల్ని ఆకర్షించాయి. మతం పట్ల సూఫీ భావాలు సమాజంలో అణగారిన వర్గాల పట్ల సానుభూతితో కూడుకున్నవి. హిందూ సమాజంలోని 'కుల భేదాలు' సూఫీ సిద్ధాంతాలలో అర్థం లేనివి అయ్యాయి. చేనేతకారులు, వర్తకులు, వస్త్రకారులు, రైతులు ఆఖరుకు దొంగలు దోపిడీవాళ్లు కూడా సూఫీమార్గాన్ని అనుసరించారు. సూఫీలు తమకన్నా పాలకవర్గం చెప్పిన 'ఉన్నత కులాలు నీచ కులాలు వంటి రెండు కులాలుగా' సమాజాన్ని విడగొట్టడాన్ని

చిష్టీల అద్భుత శక్తుల గురించిన కథలు లాల్ చిష్టీల ప్రఖ్యాతికి , మొత్తం సూఫీల మరణానంతర ప్రఖ్యాతికి కారణమయ్యాయి.

## సమకాలీన ఇస్లాం ప్రపంచాలలోని మార్మిక భావాలు భారత సూఫీతత్త్వం పై చూపిన ప్రభావం:

భారతదేశంలో సూఫీ ఉద్యమ వృద్ధి ప్రాప్తి ప్రధానంగా భారతీయ వాతావరణం చేతనే నిర్ణయింపబడినప్పటికీ బాహ్య ఇస్లాం ప్రపంచాలలోని సూఫీతత్త్వాలలో కలిగిన మార్పుల ప్రభావం కూడా ఉంది.

గొప్ప సూఫీ గురువులైన అల్-ఘజ్జాలీ మొ|| వారి సూఫీతత్త్వం విభిన్న సిలసిలాలకు చెందిన భారతీయ సూఫీలను తరతరాలుగా ప్రభావితం చేస్తూనే వచ్చింది. పర్షియన్ సూఫీలైన ఫైదుద్దీన్ అత్తార్ (d. 1220) జలాలుద్దీన్ రూమి (d. 1273) మొ|| వారి భావాలు కవిత్వాల్లోని ప్రతీకాత్మకత మొ|| సుల్తానత్ కాలంలోని భారతీయ సూఫీలను ప్రభావితం చేశాయి.

ఈ కాలంలోని చిష్టీలు సాధారణంగా స్పెయిన్ లో పుట్టిన ప్రముఖ మార్మికుడు ఇబ్న్ అరబి (d. 1240) చేత ప్రభావితులైనట్లు తెలుస్తుంది.

ఇతడు "వహదత్ ఉల్ వుజుద్" సిద్ధాంతాన్ని (Unity of the phenomenal and noumenal world) ప్రవచించాడు. దీన్ని ఉలేమాలు, సనాతన సూఫీలు వ్యతిరేకించారు. అయితే చాలా మంది సూఫీలు, అప్పటినుంచి ఈ వహదత్ అల్ వుజుద్ అను సిద్ధాంతాన్ని సూఫీ తరువాత కాలాలకి ప్రాథమిక ప్రామాణ్యం గలదిగా పరిగణించారు. వీరికి సూఫీతత్త్వం ఏదో ఒక సిద్ధాంతంగా కాక సూఫీమార్గాన్ని దాటుటకి ఉపయోగపడే ఒక ఆచరణాత్మక కార్యకలాపంగా కనిపిస్తుంది.

అలాయుద్దౌలా (1261 - 1336)

ఇతడే ఇరానియన గురువు ఇబ్న్ అరబి యొక్క సిద్ధాంతాన్ని వ్యతిరేకించాడు. ఇతడి భావాలు కూడా ఇతర భావాలను సూఫీ సంస్థలను ప్రభావితం చేశాయి. నెసుదరజ్ సిమ్నాని యొక్క సనాతన భావాల చేత ప్రభావితుడై సిమ్నాని (1261-1336) ఇబ్న్ అరబి, జలాలుద్దీన రూమి ల భావాల్ని విడిచిపెట్టాడు.

అనేకమంది పర్షియన్ కవులు సూఫీ బోధనల్ని - మార్మిక విశ్వాసం, ప్రేమలను సుదూర ప్రాంతాలకు వ్యాపింపచేశారు. వీరిలో ముఖ్యులు 4గురు. సనాయి, అత్తర్, జామీ, రూమి. వీరి కవిత్వం మార్మికత్వంలో ప్రేమలో ఉన్నతమైందిగా పేరొంది అనేక ప్రాంతాలకు, భారత్ లో సహా వ్యాపించాయి. వీరు దయాస్వభావులుగా ఉండేవారు. ఇతర మతాల వారి పట్ల సహనాన్ని ప్రదర్శించేవారు.

"నమ్మే ముస్లింలు ముస్లిమేతరులు, ఇద్దరూ పరిగెత్తుతున్నారు
అతన్ని చేరే దారిలో
మరియు ఆహ్వానిస్తున్నారు (కలిసి)
అతడొక్కడే, అతని రాజ్యాన్ని ఎవరూ పంచుకోలేరు"

— సనాయి.

అలు సనాతనముల చేత ఇలు

సూఫీల చేత పూజింపబడిన అల్- ఘజాలి (d. 1112) మార్మికతను, ఇస్లాం సనాతనతను దరి చేర్చ యత్నించాడు. చాలా వరకు సాధించాడు కూడా. పైగా ఇతడు హేతువాదతత్వానికి దెబ్బ కొట్టాడు. దేవుని గురించిన ధనాత్మక జ్ఞానం అంతని గుణాలు హేతువు ద్వారా తెలుసుకోలేము, కేవలం ఆత్మ వివేచన ద్వారా మాత్రమే

(revelation) తెలుసుకోగలము అని చెప్పాడు.
దీనివల్లనే భారత ఇతర ముస్లింలవలెనే సూఫీలు
కూడా ప్రామాణికమైనది తెలిపాడు. ఈ భావాలన్నీ
భారతీయ సూఫీలను ఎంతగానో ప్రభావితం చేశాయి.

## Impact of the Foundation of the Delhi Sultanate on Indian Society

8) భాష లో ఏకరూపత పర్షియన్ రాజభాషగా చేయడం వల్ల

1) రాజకీయాధికార కేంద్రీకరణ ... ఇక్తా విధానం ద్వారా ఫ్యూడల్ సంప్రదాయాల్ని ఛేదించి దూరప్రాంతాల్ని కేంద్రానికి కలిపారు.

2) ప్రధాన నగరాల్ని, దారుల్ని ఢిల్లీ నియంత్రణకి తెచ్చి అఖిల భారత పరిపాలన కి ఒక అస్తిత్వంగా ..... అ. భా. సర్వస్వ భావన ... ఉన్నతాధి నియామకాలు, పోస్టింగ్స్, కష్టాల, ట్రాన్స్‌ఫర్లు, ప్రమోషన్లు, సంప్రదించబడాలు మొ॥ వన్నీ వాళ్ళ రాజ్యంలో చేయగలిగారు పృథ్వీరాజ్ III కి ఇలాంటిది వీల్లేనిది కాదు — Comprehensive History of India.

3) ఆసియా లోని ప్రాంతాలతో ఆఫ్రికా సమీప ప్రాంతాలతో సంబంధాలు పునరుద్ధ
— జ. నా. సర్కార్

4) నగర విప్లవం ... టర్కులు కులవ్యవస్థ ని గుర్తించలేదు ... నగరాలు అన్ని కులాల వారికీ తెరిచారు ... కొత్తనగరాల్ని విశ్వవర్ణాల వారి నివాసాలుగా నిర్మించారు ... ఈ నగరాలే ఢి. సు. ల శక్తి కేంద్రాలుగా ... HABIB

5) సైనిక వృత్తి ఇకపై ఒక కులం / వర్గం వారి సొంతం కాదు ... ప్రతిభే కొలమానంగా నియామకాలు

6) సైనిక పునర్నిర్మాణం ఏనుగులకి బదులు గుర్రపు సౌతుల్ని ....
భారీతనం, బరువైన శక్తి కి బదులుగా మొబిలిటీ, మెరుపుదాడి ...
→ మంగోలుల దాడిని ఎదుర్కోవ ఇవి చాలా అవసరం

7) న్యాయవ్యవస్థ, కరెన్సీ, కొలతల్లో ఏకరూపత > వర్తకం వృద్ధి

# Medieval India (2)

పల్లవి. శివరాం

# Chapter : 21 Mughal Empire in the 17th Century



## Major Policies (administrative and religious) of Jahangir, Shah Jahan and Aurangzeb

### * Administrative policies of Jahangir *

క్రీ.శ. 1605 – 1627 ల మధ్య మొఘలు చక్రవర్తి గా వెలుగొందిన జహాంగీరు అసలు పేరు సలీం. ఇతడు తండ్రి కాలంలోనే సింహాసన వారసత్వానికై కుట్రలు చేసి అబుల్‌ఫజల్ హత్యకు కూడా కారణమయ్యాడు. అయితే చక్రవర్తి పదవి నలంకరించిన వెంటనే ప్రజాభిమానం చూరగొనేందుకు పలు పాలనా పరమైన చర్యలు తీసుకొని తన అధికారాన్ని సుస్థిర పర్చుకున్నాడు.

"అతనికి తన తండ్రికి గల వివేచనాశక్తి గాని, ఆధ్యాత్మిక చింతన గాని, అక్బరు విశిష్ట గుణమైన పాలనా సంస్కరణలు ప్రవేశపెట్టవలెనన్న అభిలాష గాని లేవు"

— సత్యనాథయ్యర్

పాలనా విషయాలలో జహాంగీర్ అక్బరులాగా కొత్తమార్పులు చేసి గొప్ప సంస్కరణలు ప్రవేశపెట్టక పోయినా సింహాసనానికి రాగానే ప్రజాభిమానం చూరగొనే పలు చర్యలు చేపట్టాడు.

*) తన వ్యతిరేకులను క్షమాభిక్ష ఇచ్చాడు, ఖైదీలను విడుదల చేశాడు.

*) పన్నెండు రాజాజ్ఞలు : జహాంగీరు పాలనాసంస్కరణల్లో ఇవి చాలా ముఖ్యమైనవి. తొలి నెలల్లో వీటి

ప్రత్యేకా నియమావళి' గా పాటించాలి ప్రకటించాడు. అవి

1) జాగీర్దార్లు వారి స్వలాభం కోసం విధించిన తంఘా మరియు మిర బహ్రీ ఆదితర పన్నులు రద్దు(చేశాడు) చేయాలి.

2) రహదారుల మీద దోపిడీ, దొంగతనాలకు సంబంధించిన నియమాలు

3) చనిపోయిన వారి ఆస్తులపై స్వేచ్ఛా వారసత్వం

4) అన్ని రకాల మత్తు పానీయాల అమ్మకం పై నిషేధం

5) ఇళ్లని స్వాధీనం చేసుకోవటం పై నిషేధం మరియు చెవులు, ముక్కు కోయుట మొ॥ క్రూర శిక్షల రద్దు

6) జాగీర్దార్లు గాని, ఖల్సా అధికారులు గాని రైతుల భూముల్ని బలవంతంగా స్వాధీనం చేసుకోరాదు.

7) ఆసుపత్రుల నిర్మాణం, రోగుల్ని పరీక్షించేందుకు వైద్యుల నియామకం.

8) సంవత్సరంలో అన్ని నిర్దేశిత దినాల్లో జంతువుల్ని చంపరాదు.

9) ఆదివారాన్ని గౌరవించడం

10) మన్సబులను, జాగీర్లను సాధారణంగా స్థిరపరచటం

11) మత అవసరాల కోసం, బహుమానాలు గా దానం చేసిన భూముల్ని స్థిర పర్చటం.

12) జైళ్లలో ఉన్న అన్ని రకాల ఖైదీలకు క్షమాభిక్ష ప్రసాదించటం.

ఈ రాజాజ్ఞలను నిశితంగా పరిశీలిస్తే జహాంగీరు వ్యక్తిస్వేచ్ఛ కోసం; తన ప్రజల జీవిత, ఆస్తి భద్రతల కోసం; వారి భౌతిక, నైతిక సంక్షేమం కోసం నిజంగానే పెట్టుబడి పెట్టాడని స్పష్టం అవుతుంది. ఈ నియమాలు ఆచరణలో వారి వాస్తవ ఉద్దేశాలను సాధించలేకపోయాయి అన్నది నిజమే. అయితే జహాంగీరుకు గల తన ప్రజల సుఖసంతోషాల్ని, సౌభాగ్యాన్ని వర్గ, మత భేదాలు లేకుండా వృద్ధి పరచాలన్న నిజాయితీ నిండిన కాంక్షను మాత్రం కాదనలేము. ఈ నియమాలు వారి మానవత్వానికి, న్యాయానికి, రాజకీయ వివేకానికి గుర్తులైనవి.

జహాంగీరు పేదలకు ఉచిత వంటశాలలు ఏర్పరచాడు. సైనికుల, ఉద్యోగుల వల్ల కలిగిన పంట నష్టానికి నష్టపరిహారం చెల్లించే ఏర్పాటు చేశాడు. జూదాన్ని నిషేధించాడు. 'సతి', 'స్త్రీశిశుహత్యల్ని' ఉరిశిక్షకు పాత్రమైన నేరాలుగా చేశాడు. కొన్ని జిల్లాల తయారీ, సేవనాన్ని నిషేధించేందుకు చర్యలు తీసుకున్నాడు. కాని చక్రవర్తికి, ప్రముఖుల వర్గానికి ఈ ఆజ్ఞల అవసరం చాలా ఉండినందున ఈ సంస్కరణ ఫలితాలు రాలేదు.

* వర్తక వాణిజ్యాల అభివృద్ధికి ఎన్నో చర్యలు చేపట్టాడు.
* వర్తకులకు తెలియకుండా వారి అనుమతి లేకుండా వారి సామాన్ల మూటల్ని తెరవరాదని వారికి అవసరమైన వస్తువులను గురించి చేయరాదని అధికారులకు ఆదేశించాడు.

* అధికారులు ప్రజల ఆస్తుల్ని, ఇళ్ళని ధ్వంసం చేయరాదు.

* అక్బరు జన్మించిన వారం 'ఆదివారం' అను సింహాసనానికి వచ్చిన వారం 'గురువారం' వారంలో ఈ రెండు రోజులలో జంతువుల్ని వధించరాదు.

* ప్రజాసంక్షేమ చర్యలు మంచి ఉద్యోగులతో చేపట్టాలి. రహదారుల వెంట సరాయిలు, మసీదులు, మంచినీటి వసతులు కట్టించాలి. పెద్ద నగరాలలో ప్రజలకు వైద్యశాలలు కట్టించాలి. ప్రజా ఉదార గుణాలు పెంచాలి.

* చనిపోయిన వారి వారసులు తెలిసినట్లయితే వారి ఆస్తిని ధ్వంసం చేయరాదు. వారసులు లేనివారి ఆస్తిని మాత్రం ధ్వంసం చేసి ప్రజోపయోగ కట్టడాలకై వెచ్చించాలి.

* ప్రభుత్వాధికారుల కుటుంబాల మధ్య జరిగే వివాహాలు గాని, లేదా ప్రభుత్వాధికారి కుటుంబాలకు చెందిన పరగణాలకు వారితోనే వివాహసంబంధాలు ఏర్పర్చుకోవడం గాని రాజానుమతి లేనిదే జరగరాదు.

జహాంగీరు న్యాయఘంటు : జహాంగీరు పాలనా సంస్కరణలలో మిక్కిలి విశిష్టమైంది అతని న్యాయఘంటు.

66

న్యాయపాలన చేసే అధికారులు ఆలస్యం చేస్తున్నా లేదా న్యాయం కోరుతున్న వారికి

వ్యాపారంగా రేట్లు చేస్తున్న అణచివేయబడినవారు ఈ గొలుసు దగ్గరికి వచ్చి దాన్ని ఊపడం/లాగడం (నా) ద్వారా అది కలిగించే శబ్దం వలన, దృష్టి ని ఆకర్షించవచ్చు. అది ఇలా ఉంటుంది : నేను వారికి 30 గజాల పొడవు లో 60 గంటలు గల శుద్ధమైన బంగారు గొలుసు చేయమని ఆజ్ఞాపించాను. దాని బరువు 4 భారతీయ మణుగులు అంటే 42 ఇరాకీ మణుగులు ఉంటుంది. దాని ఒక చివర ఆగ్రాకోట యొక్క షా బుర్జు కు మరొకటి నది ఒడ్డున గల రాతి స్తంభానికి వారు కట్టారు."

— జహాంగీరు.

అయితే రాజ్యంలో అత్యంత సామాన్యులు కూడా ఈ న్యాయ గంట ను వినియోగించుకొనవచ్చు, వారి కష్టాల్ని చక్రవర్తి సమక్షంలోకి/ దృష్టి లోకి తేవచ్చు. ఈ న్యాయగంట అందరికీ న్యాయాన్ని అందించాలన్న జహాంగీరు పట్టుదల కు తార్కాణం గా నిలుస్తుంది.

* జహాంగీరు తప్పుల్ని వెంటనే / సులభంగా క్షమించేవాడు. అతని జీవిత స్వీయచరిత్రలో తిరుగుబాటుదార్లని, కుట్రచేసిన అధికారుల్ని క్షమించిన ఉదాహరణలు కోకొల్లలు. తను సింహాసనానికి వచ్చిన కొత్తల్లో తన పై తిరుగుబాటు చేసిన కొడుకు ఖుస్రో ను అనుచరులను [illegible]

ఆ జహాంగీరు ఈ విధానా [illegible].

"అతను ఏ విధానాన్నీ సరైన మార్గంలా పరిగణించరాదు, మీ చర్యల ఫలితంగా కలిగే ఎట్టి నేరం గురించి ఆలోచించవద్దు. రాజ్యానికి కొడుకు గాని బిడ్డడు గాని ఎవరూ పట్టరు. రాజుకు ఎవ్వరూ బంధువులు కారు."

అయితే తిరుగుబాటు ప్రారంభించినప్పటికీ అక్బర్ జహాంగీర్ ఖుస్రో శిక్షలన్నీ పాటించకుండా క్షమించాడు.

జహాంగీర్ నిత్యం బహిరంగంగా ప్రజల మధ్య న్యాయపాలన చేయటాన్ని తన పవిత్ర విధిగా భావించేవాడు. అతడు ఆరోగ్యంగా ఉన్నా, అనారోగ్య వాతావరణం ఉన్నా ప్రజలకు అందుబాటులో ఉండేవాడు. తన దాకా న్యాయమార్గంలో రాకుండానే మరణశిక్ష విధించబడినట్లయితే దాన్ని వెంటనే అమలు జరపకుండా శిక్ష రద్దుకు, లేదా మళ్ళీ చక్రవర్తి నుండి ఆజ్ఞకై అవకాశం ఉండేలా నియమం సంధ్య దాటేంతవరకూ శిక్ష అమలు జరపరాదని ఆజ్ఞాపించాడు. అతడు నేరస్థుడి వాదాలని విని తెలుసుకుందా శిక్షలు అమలు పరిచేవాడు. ఒక వితంతువు గుజరాత్ గవర్నరు ముకర్రబ్ ఖాన్ తన కూతుర్ని బలవంతంగా ఎత్తుకువెళ్ళాడని, చివరికి ప్రస్తుతం తన కూతురు మరణించిందని ఫిర్యాదు చేసింది. జహాంగీర్ విచారణ జరిపించగా ఆ యువతి మరణానికి

ముజఫర్ ఖాన్ సైనికుల కారణమని తెలిసింది. చక్రవర్తి ఆగ్రహం చెందాడు, ముజఫర్ ఖాన్ మనుషుల ను సభాలకి రప్పించాడు, విఠలరావు & భట్టు బంధీలను ముజఫర్ ఖాన్ కు ఒప్పగించాడు.

అయితే జహాంగీరు ఉదారుడే అయినా మొగలు చక్రవర్తి గా నిరంకుశుడిగా కూడా కన్పడలేదు. ఒక సంఘటన లో పెద్దకొడుకు ను వధించడానికి ఏ మాత్రం సంకోచించలేదు. మరోసారి తాను వేటాడుతున్న నీలగాయి తప్పించుకు పోవడానికి ఇద్దరు భిక్షమొంగ కవుల్లు అకస్మాత్తుగా రావడం కారణమవడంతో వారిద్దరిని ఉరితీయించాడు.

* * జహాంగీరు తన రాజకీయ ప్రత్యర్థులందరిని క్షమించడమే గాక వారిని ఉదారంగా చూశాడు. రాజా మాన్ సింగ్ జహాంగీరు చక్రవర్తి కాగానే తనకు తిరుగుబాటు సంబంధి మేనల్లుడు ఖుస్రో లా బెంగాలు పంపేశాడు. అయితే జహాంగీరు మానసింగ్ ను, అతని రాజపుత్ర బలగాన్ని వదులుకోదల్చుకోలేదు, పైగా వారంతా రక్త సంబంధీకులు కూడా. అందువల్ల క్షమాభిక్ష ని ప్రమాణం చేసి సలహా మన్నించాడని సందేశం పంపాడు. దాంతో మానసింగ్, ఖుస్రోలు ఆగ్రా కి తిరిగి రావడం జహాంగీరు ఆహ్వానం అందుకోవడం జరిగాయి. మాన సింగ్ కొడుకు మహా సింగ్ ను 2000 మనుబుదారుగా చేశాడు. మాన సింగ్ కు ఎన్నో బహుమానాలు, గౌరవ బిరుదులు ఇవ్వడమేగాక బెంగాలు గవర్నరు పదవి ని స్థిరపరచాడు. అలాగే మిర్జా అజీజ్ కోకా యొక్క బిరుదులు, హోదా కాపాడబడ్డాయి.

రాజమార్యునిగా జహాంగీరు బులంద్ ఖాన్ వాత్స్యను చేరలేదు. ఈ నేర పాపప్రవృత్తిని, బులంద్ఖాన్ సేవలను గుర్తించుకుని గాను అతని కొడుకు అబ్దుర్ రహమాన్ కు 2000 మన్సబ్ ఇవ్వడం, ఆస్థానంలో వద్దా ఇవ్వడం చేశాడు. ~~అబుల్~~/ దారుణహత్యలో/ బులంద్ఖాన్ ను హత్య చేసిన వీరసింగ్ బుందేలా ను 3000 మన్సబ్దారుగా చేశాడు.

**జహాంగీరు సామ్రాజ్య మంత్రి వర్గాన్ని**

**పునర్వ్యవస్థీకరించాడు**. **కొత్త ఉద్యోగ పదవుల్లో తన స్నేహితులు, నమ్మకస్తులైన వారిని నియమించాడు**. అబ్దుస్ సమద్ (షిరిన్ కలం) కొడుకు షరీఫ్ ఖాన (ప్రధానమంత్రి)గా రాజముద్ర రక్షకుడిగా చేయబడ్డాడు, 5000 మన్సబ్దారు గా కూడా ఎదిగాడు. పర్షియన వలసదారు మిర్జా ఘియాస్ బేగ్ ఇతిమదుద్దౌలా బిరుదుతో సామ్రాజ్య దివాను చేయబడ్డాడు. అక్బరు కాలంలో మీర్‌బక్షి గా ఉన్న షేక్ ఫరీద బుఖారి పదవి స్థిరపరచి 5000 మన్సబుదారుని చేశాడు. వీరిలో షరీఫ్ ఖాన జహాంగీరు కు మంచి స్నేహితుడు. మిర్జా ఘియాస్ నూర్జహాన తండ్రి.

# జహాంగీరు మత విధానము

జహాంగీరు మత నమ్మకాన్ని ఖచ్చితంగా నిర్ణయించడం కష్టం. సర్ థామస్ రో అతన్ని నాస్తికుడన్నాడు. మరికొందరు సమకాలీన రచయితలు అతన్ని మత పరిశీలకుడంటే ఇంకొందరు భక్తిగల ముస్లిమన్నారు. కొందరైతే క్రైస్తవుడన్నారు. వాస్తవమేమిటంటే అతను ఏ మతం యొక్క సనాతన మార్గ నమ్మకాల్ని విశ్వసించలేదు. అతనొక ఉదార మహమ్మదీయుడు, ఇతర మతాల సూత్రాల్ని సహనంతో అర్థం చేసుకున్నాడు. అతడు దేవుణ్ని నమ్మాడు, మహాత్ముల్ని ఆదరించాడు, వారి సిద్ధాంతాల్ని ఆదరించేవాడు. సనాతన మత నమ్మకాలు తెలిపిన ముస్లిం మత మార్గాలతో విభేదించలేదు. అతను తన నిత్య ప్రార్థనలు, రంజాన్ ఉపవాసాల పట్ల నిష్ఠ అంతగా చూపలేదు. ఖురాన్ ను అనువదింపజేయటం, మానవ చిత్తరువుల్ని వేయటం - వారిని నాణెలపై ముద్రించటం మొ॥ చర్యల ద్వారా సనాతన ముస్లింలను చికాకు పరిచాడు.

జహాంగీరు సింహాసనానికి రావటం తో సనాతన ముస్లిం లు ఇస్లాం రాజమతంగా ఆధిక్యత తిరిగి లభిస్తుందని ఆశించారు. మొదట్లో జహాంగీరు మతవిధానం కూడా వారికి ఆశ కలిగించింది. జెసూట్లు సాంగత్యం విడిచాడు, నాణాలపై కలిమా ను పునరుద్ధరించాడు. అతను గద్దెనెక్కేటప్పుడు కూడా ఇస్లాం భగవన్నామాలను సంగ్రహంగా చదివించమన్నాడు.

సహితమైనా గాని పెంపకం, శిష్యుల ద్వారా గాని జహాంగీరు సూచన ముఖ్యం కాదు. అతడు మద్యపానం, నాట్యం, సంగీతాలను బాగా ఆస్వాదించేవాడు. అతని (తుజుక్-ఇ-జహాంగీరి) 'జహాంగీరు నియామావళి' లో బలవంతంగా ఇస్లాం మతం లోకి మార్చడాన్ని నిషేధించాడు. ఆదివారం తన తండ్రి జన్మదినమైనందున (అక్బర్ తండ్రి నమ్మకం ప్రకారం) సృష్టి ఆ రోజే మొదలైనందున, ఆ రోజు సూర్యదేవునికి అంకితమైనందున ఆదివారాన్ని గౌరవించాలని ఆ రోజు జంతువధ చేయరాదని ఆజ్ఞాపించాడు.

జహాంగీరు తన 'సుల్హ్-ఇ-కుల్' విధానాన్ని అవలంబించటమే గాక ముఠాలను (శత్రువుల్ని) చేపట్టటం వారికి హస్త, పాదాలను తీసివేయటాన్ని కూడా నిషేధించాడు. ఇలా చేసేవారు ఏ వర్గ మతస్థులకు దూరంగా ఉండాలని, మతానికి సంబంధించి విశ్వాసాలను అవలంబిస్తామని ప్రమాణం చేయాలి.

జహాంగీరు అక్బరు వలె హిందువుల పండుగల్ని జరిపించేవాడు. దీపావళి, హోళి, దసరా, రాఖి, శివరాత్రి మొ॥ పండుగలు అతని ఆస్థానంలో జరుపబడేవి. జహాంగీరు పంజాబు, గుజరాతులలో గోవధను నిషేధించాడు. హిందువుల దేవాలయాలు కట్టుకోవడం పై నిషేధం లేదు. అక్బరు వలెనే బ్రాహ్మణులకు దేవాలయాలకు దానాలిచ్చేవాడు.

బృందావనం లోని చైతన్య మతం వారి డాక్యుమెంట్లు ద్వారా వారికి జహాంగీరు చేసిన అపార దానాలు తెలుస్తున్నాయి. హిందువులపై తీర్థయాత్రల పన్ను ను విధించలేదు.

క్రైస్తవులు ఈస్టర్, క్రిస్మస్ ఆదితర పండుగలు జరుపుకోడానికి అనుమతించబడ్డారు. క్రైస్తవులకి కూడా భూదానాలివ్వడం, చర్చిల నిర్మాణానికి అనుమతి ఇవ్వడం జరిగింది. క్రైస్తవ మతగురువులకు అతని ఆస్థాన ఆదరణా లభించింది. చెర్రియర్ జహాంగీరు ను అక్బరు కన్నా ఎక్కువగా జెసూట్లను ఆదరించాడని వ్యాఖ్యానించాడు.

జహాంగీరు గుజరాత్ లోని జైన ఆలయాల్ని మూసేసి జైన సాధువులని రాజ్యంలోంచి వెళ్ళగొట్టాలని శాసించాడు. (1617) జైన భక్తుల భార్యలు, కూతుళ్ళు ఈ సాధువుల్ని సందర్శించేటప్పుడు వారు నివాసముండే ఆలయాల్ని దర్శించేవారు, అయితే నైతిక కారణాల దృష్ట్యా జహాంగీరు ఈ శాసనం చేశాడు. అయితే గుజరాత్ లోని ఆధారాల వలన ఈ కాలంలో జహాంగీరు జైనులకి ఆర్థిక సాయం అందించేవాడని జైన సాధువులతో సత్సంబంధాలు కొనసాగుతూనే ఉండేవని తెలుస్తుంది.

జహాంగీరు - సిక్కు సంబంధాల పరిశీలనం

అతను మొత్తం సిక్కులకి వ్యతిరేకంగా ఏదీ చేసినట్లు కన్పించదు. అయితే తనపై తిరుగుబాటు చేసిన తన కొడుకు ఖుస్రో ని ఆశీర్వదించడం, అతనికి ధనసాయం చేయడం చేసిన గురు అర్జున రాజద్రోహానికి పాల్పడ్డాడని జహాంగీరు

గవర్నర్లు ఉండేవారు.

ఏమైనా సనాతన ముస్లిం లను సంతృప్తి పరచేందుకు జహాంగీరు అవలంబించిన కొన్ని మతమౌఢ్యపు చర్యలు R.P. త్రిపాఠి వంటి పండితులు

"జహాంగీరు పరమత ద్వేష బీజమును నాటెను"

అనేలా చేశాయి. (The seed of religious intolerance was sown by Jahangir — R.P. Tripathi)

ఏమైనా స్మిత్ అన్నట్లు జహాంగీరు "దుష్పరిపాలనాధినేత" మాత్రము కాదు. స్మిత్ తో ~~ఈ~~ విషయం లో విభేదించలేము.

"దయ - క్రూరత్వము, న్యాయము - చపలత్వము, నాగరికత - మూర్ఖత్వము, సుజ్ఞానము - అజ్ఞానము, మిశ్రితమైన ఒక వింతైన రసాయనిక మిశ్రమము జహాంగీరు"

— స్మిత్

<u>పన్నెండు రాజాజ్ఞలు</u> : as given by <u>A.L. SriVastava</u>

1) తంఘా, మీర బహ్రీ మొదలైన పన్నుల్ని నిషేధించాడు.

2) రహదారుల వెంట సరాయిలు, మసీదులు, మంచినీటి బావులు కట్టించాడు.

3) వర్తకుల కి తెలియకుండా లేదా వారి అనుమతి లేకుండా వారి సరుకుల మూటల్ని (bales) తెరవరాదు.

4) ఎవరైనా చనిపోతే అతని ఆస్తి వారసులకి ఇవ్వాలి. వారసులు లేని పక్షంలో దాన్ని ప్రజోపయోగ కార్యాలకి వెచ్చించాలి.

5) మత్తు పానీయాలు, మత్తు పదార్థాల తయారీని, అమ్మకాన్ని నిషేధించాడు.

6) ప్రభుత్వాధికారులు పౌరుల ఇళ్లని స్వాధీనం చేసుకోరాదని ఆజ్ఞాపించాడు.

7) చెవులు, ముక్కు కోయటం వంటి శిక్షల్ని నిషేధించాడు.

8) రైతుల భూముల్ని బలవంతంగా లాక్కోవడాన్ని నిషేధించాడు.

9) ప్రభుత్వ రెవెన్యూ / శిస్తు వసూలు అధికారులు గాని, జాగీర్దారులు గాని రాజానుమతి లేకుండా తమ పరగణా ప్రజలతో వివాహ సంబంధాలు ఏర్పర్చుకోరాదు.

10) పెద్ద నగరాల్లో పేద ప్రజల వైద్య సేవ కోసం వైద్యశాలలు నిర్మించబడాలి / నిర్మించాలి.

11) జహాంగీరు సింహాసనాన్ని ఎక్కిన రోజు గురువారం, అక్బరు జన్మించిన రోజు ఆదివారం వారం లో ఈ రెండు రోజులు జంతువధ నిషేధించబడింది.

12) అక్బరు కాలంలో ఉన్న అధికారులకి, జాగీర్దార్లకి వారి

పరిపాలనా విధానం

పరిపాలనాపద్ధతి, వారి చాలని స్థిరపరిచాడు.

* అబ్దుర్ రహీమ్, ఖ్వాజా అబ్దుల్లాలు తనను వదిలేసి అక్బరు పక్షం చేరిన వారు. జహంగీరు వారిని క్షమించి వారి పదవుల్ని, బాధ్యతల్ని వారికే ఇచ్చాడు.

* రాజా మాన్‌సింగ్, మిర్జా అజీజ్ కోకాలు తన కొడుకు ఖుస్రోను (వారసుని గా) అక్బరు వారసుని గా సమర్థించారు. వారిని కూడా క్షమించాడు. వారు తమ పదవుల్లో యథాతథంగా కొన్ని కాలాలపాటు పనిచేసి తొలగిపోయారు.

* కొంత కాలం తర్వాత జహంగీరు బెంగాలు సవర్నరుగా [illegible] తనకిష్టుడైన కుతుబుద్దీన్ ఖాన్ కోకా ను నియమించాడు.

* జహంగీరు తన ఉదార స్వభావం చేత ప్రత్యేక సామర్థ్యాలు లేని కొందరు మిత్రులకు ఉన్నత పదవులు ఇచ్చేవాడు. షరీఫ్ ఖాన్, కుతుబుద్దీన్ కోకా, బీర్‌సింగ్ బుందేలా మొ|| వారు ఈ కోవ కు చెందుతారు.

ఇది కేవలం అతిశయోక్తి కాదు. అతని స్వీయ చరిత్ర, ఇంకా (19) ఎన్నో సమకాలీన చారిత్రాత్మక రచనలు చక్రవర్తి నిష్పక్షపాతంగా న్యాయబద్ధంగా చెప్తున్న విషయాన్ని తేటతెల్లం చేస్తున్నాయి.

> "అతడు భారతీయ చక్రవర్తుల వరుస లోనివాడు"
>
> "ఉదార స్వభావం గల మనిషిగా, క్రీడలు, కళలు, మంచి జీవితం పట్ల ఆసక్తి గలవాడుగా, అందరికీ మంచి చేయాలనే లక్ష్యం గలవాడు కాని ఉత్తమ వివేకవంతమైన గుణాలు లేకపోవడం చే గొప్ప పాలకుల స్థాయిని పొందడంలో విఫలుడౌతున్నాడు"
>
> — రిచర్డ్ బర్న్

# షాజహాను పాలనా విధానాలు



షాజహాను సమర్థుడైన పాలకుడు. అతడు పాలనలోని సూక్ష్మ వివరాలను కూడా వ్యక్తిగతంగా పర్యవేక్షించేవాడు. అతని విధానాలు పాలనావిధానాలలో / పాలనా విషయాలలో కొత్త అభివృద్ధి ఏమీ చూపదు. అతడు అక్బరు కాలంలో బలపడిన మొఘలాయి పాలనా సామర్థ్యాన్ని, స్థిరత్వాన్ని పునరుద్ధరించటం మీదనే అధికంగా దృష్టి నిల్పాడు. అతని దృష్టి క్రమబద్ధీకరించటం మీదనే ఉంది గాని నూతనత్వం మీద లేదు.

షాజహాను పాలనా వ్యవస్థను ముఖ్యంగా సైనిక పాలనని అనగా మన్సబ్దారీ విధానాన్ని క్రమబద్ధీకరించాలనుకొన్నాడు. అతడు మన్సబ్దార్ల అధిక జీతాలను తగ్గించటానికి ప్రయత్నించాడు. అలాగే మన్సబ్దార్లు వారి స్థాయికి తగినన్ని సైన్యాన్ని కచ్చితంగా నిర్వహించేలా చర్యలు తీసుకున్నాడు. ఈ విషయంలో ఇతడు చాలా వరకు విజయం సాధించాడు. షాజహాను ఈ విషయంలో చేసిన ముఖ్య నియమం - భారతదేశంలో జాగీరు పొందిన మన్సబ్దారు తన హోదా సూచించే సవర్ శ్రేణిలో[1] $\frac{1}{3}$ వ వంతు ఇతర సందర్భాలలో $\frac{1}{4}$ వ వంతు సైన్యాన్ని నిర్వహించాలి. కాగితం మీదున్న వాస్తవంగా ఉన్న సైనిక బలగాల మధ్య తేడాని అంత చేసేందుకు, నానాటికి పెరుగుతున్న మన్సబ్దార్ల సంఖ్యకి సైనిక అవసరాలకి మధ్య సమతౌల్యం సాధించేందుకు ఈ చర్య తోడ్పడి ఉండవచ్చు. షాజహాను పాలనా కాలంలో గరిష్ట మన్సబు ఒక అధికారికి చేరుకొనేందుకు వీలయిన గరిష్ట మన్సబు

9000 జాట మరియు 9000 సవర. ఇవి రాజమండలు ఎక్కువ శ్రేణి కలిగి ఉండేవారు. ఉదాహరణకు దారా మన్సబు 40,000 జాట మరియు 20,000 సవర.

షాజహాను (2) ప్రభుత్వ భూమిశిస్తు డిమాండును మొత్తం పంట లో $\frac{1}{3}$ వ వంతు నుంచి సగానికి పెంచాడు ($\frac{1}{2}$ వ వంతు). అతడు అక్బరు 'జబ్తి విధానాన్ని' వదిలేశాడు. సామ్రాజ్యభూభాగం లో $\frac{7}{10}$ వంతుల భూమి నుండి భూమిశిస్తు వసూలు చేసేవారు, ఫలితంగా ఖల్సా భూమి తగ్గించబడింది. శిస్తు మదింపు రైతులతో గాక గ్రామ పెద్దలతో చేసేవారు. కొలత, విలువ కట్టడం ఆధారంగా కాకుండా చిత్తుగా / ఉజ్జాయింపు పైర్ల ఆధారంగా శిస్తు మదింపు చేయడం మొదలైంది. రైతుల బాధలు అధికం అయినాయి. ఎందుకంటే మొత్తం పంటలో 50% చెల్లించవలసి రావడం తో పాటు వారెప్పుడు వారి కింద ఉన్న మొత్తం భూమి మీద శిస్తు కట్టాలి. అంతకు ముందు కేవలం వ్యవసాయం సాగులో ఉన్న భూమి మీదే పన్ను కట్టేవారు. ఫలితంగా రైతుల పరిస్థితి అక్బరు, జహాంగీరుల పాలనాకాలం కంటే దిగజారింది. అయితే షాజహాను ప్రభుత్వాధికారుల మీద పర్యవేక్షణ ని పెంచాడు. జీవిత భద్రతని అధికం చేశాడు. అందువల్ల ప్రభుత్వ ఆదాయాలు పెరగడంలో ఆశ్చర్యం లేదు.

అక్బరు, జహాంగీరులు కొనసాగిస్తున్న చేసినప్పటికీ ప్రోత్సాహాలు ఇచ్చి బెల్లగించి

షాజహాను పాలనాకాలం లో క్రీ.శ. 1630-31

లో మధ్య దక్కను, గుజరాతులలో భయంకరమైన క్షామం (5) వచ్చింది. ఇది ఖాందేశ్ ను కూడా వ్యాపించింది. వేల మంది ఆకలితో మరణించారు. ప్రజల కష్టాల్ని సమకాలీన చరిత్రకారుడు మిర్జా అమీన కాజ్వీని వివరించాడు. తల్లిదండ్రులు తమ పిల్లల్ని తినేందుకు పురికొల్పింది. ఎముకల పొడి ని పిండిలో కలిపి తినడం, కుక్కల మాంసం తినడం కూడా చెల్లుబాటు వచ్చింది. క్షామం తర్వాత రోగాలు ప్రబలాయి. ఇది గ్రామాలు, పట్టణాలు నిర్జనమయ్యేలా ~~అయ్యేలా~~ చేసింది. పట్టణాల్లో వీధులు శవాలతో పోగుపడ్డాయి. రోగులు ఉత్తర భారతానికి వలస పోయారు. షాజహాను మానవ బాధలు తొలగించేందుకు కొన్ని చర్యలు చేపట్టాడు. ప్రజల వంటశాలల్ని బుర్హాన్‌పూర్, అహ్మదనగర్, సూరత్ మొదలగు ప్రాంతాల్లో తెరిచారు. ధనం కూడా పంచబడింది. దాదాపు రూ. 70 లక్షల శిస్తు వసూలు నిలిపివేయబడింది. ~~[illegible]~~ జాగీర్దార్లు కూడా తమ జాగీర్లలో భూమిశిస్తు వసూలు నిలిపి వేశారు. జాగీర్దార్లు కూడా ఉపశమన చర్యలు చేపట్టారు.

అక్బరు ప్రవేశపెట్టిన ఉదార విద్యావిధానం (6)

షాజహాను పాలనాంతం వరకు పూర్తి గా అమలు లో ఉంది. తన ప్రజల విజ్ఞాన వివేకాలను, సాంస్కృతికతల పురాభివృద్ధికి తోడ్పడ గలదు కాబట్టి షాజహాను ~~ఉ~~ ఉదార విద్యావిధానాన్ని అనుసరించాడు. అక్బరు కాలంలో స్థాపించబడిన పెక్కు విద్యాసంస్థలు షాజహాను కాలం లో వృద్ధి చెందడమే గాక వాటి సంఖ్య పెరగసాగింది. ప్రభుత్వం అందించే ఉదార ఆర్థిక సాయం కారణంగా విద్యాసంస్థల

సమృద్ధిగా లభించాయి. షాజహాను స్వయంగా ఢిల్లీ లోని షాజహానాబాద్ అనే కొత్త పట్టణం లో ఓ కొత్త కార్ఖానాలను స్థాపించాడు.

న్యాయపాలన(4): తన కుటుంబీకుల వల్లే షాజహాను కూడా తప్పు చేసిన వారెవరైనా ధనిక-పేద, పుట్టుక, హోదాలతో సంబంధం లేకుండా నిష్పక్షపాతంగా తీర్పులిచ్చేవాడు. బెల్లమాంటే అనే విదేశీయుడు చెప్తున్నట్లుగా అతడు ఆస్థాని అతడు వారముకి సరైన వారముకి చెప్పేందుకు చక్రవర్తి చూపిన వ్యక్తిగత శ్రద్ధని మనుక్కి (Manucci) పొగిడాడు. చక్రవర్తి ఆస్థానం లో బుధవారాన్ని న్యాయపాలనకి కేటాయించారు.

రాయ్ భారామల్ "లుబ్బుల్ తవారీఖ్ ఇ హింద్" ద్వారా షాజహాను కాలంలో న్యాయపాలనా విధానం తెలుస్తుంది. "జాతీయ సంక్షేమం, ప్రజల మీద చక్రవర్తికున్న శ్రద్ధ కారణంగా సింహాసనానికి పెద్ద వివాదాలు చెలరేగకుండా చూసుకొనేవారు. కాని ఎప్పుడైనా వివాదం చెలరేగితే స్థానిక అధికారులు అక్కడికక్కడే వెంటనే విచారణ జరిపేవారు. ఈ విచారణ నాటి షరియాం ప్రకారం నాటి చట్టం ప్రకారం న్యాయాధికారుల తో ఏకీభవిస్తు సాగేది. ఈ తీర్పు గురించి వ్యక్తులకి నచ్చనట్లయితే వారు దివాను కి గాని సుబా యొక్క కాజి కి గాని అప్పీలు చేసుకోవచ్చు. అక్కడ తీర్పును తిరస్కరించి జాగ్రత్తగా వివక్షతలు లేకుండా తమ తీర్పు చెప్పేవారు, తొందరపాటుతో దివాను దగ్గర లేదా కాజీ దగ్గర కూడా తమకు

న్యాయం జరగలేదు చక్రవర్తి తో చెబుతారు కాబట్టి.
ఈ తీర్పులో కూడా వ్యక్తి సంతృప్తి చెందక పోతే ముఖ్య దివాను,
లేదా ముఖ్య కాజి కి విషయాన్ని నివేదించవచ్చు. ఈ అధికారులు
తర్వాతి విచారణను చేసేవారు. ఇంతగా ఇన్ని జాగ్రత్తలు
తీసుకుంటున్నప్పుడు ఏవో కొన్ని మతాలకి, రక్త సంబంధాలకి
సంబంధించిన వివాదాలు తప్ప చక్రవర్తి దగ్గరకు వచ్చే వివాదాలు
ఏముంటాయి? "

(7) శాంతి భద్రతల పాలన: షాజహాను పాలనా కాలంలో
సుస్పష్టమైన శాంతి భద్రతల పరిరక్షణ సామ్రాజ్యమంతా వెలుగొందిందని
విదేశీయాత్రికులు ఉటంకించారు. రహదారులు భద్రత గలవి.
వర్తక-వ్యాపారాలు, ప్రయాణాలు సాఫీగా సాగేవి. దోపిడీదారుల్ని
దొంగలను తీవ్రంగా శిక్షించేవారు, సంఘ వ్యతిరేక శక్తుల్ని అణచి
వేసేవారు. ప్రజల జీవితాల్ని, ఆస్తుల్ని పరిరక్షించేందుకు
తగిన చర్యలు చేపట్టారు. షాజహాను కాలంలో ప్రజలు
అనుభవించిన చక్కని భద్రతను పొగడుతూ

"ఒక రాజు ప్రజల్ని పాలించినట్లు గా
కాక ఒక తండ్రి తన కుటుంబాన్ని -
పిల్లల్ని చూసుకున్నట్లు పాలించాడు"

— టావెర్నియర్

విదేశీయాత్రికుల నిష్పాక్షికమైన రచనల ఆధారంగా

ఎల్ఫిన్‌స్టన్ కూడా తనవాదు వాల్యూ లో 'అతను ప్రజల్ని చూస్తున్న తీరు ఉదారమైంది, స్వతంత్రప్రేమగలదని' అభిప్రాయ పడ్డాడు.

# షాజహాను మత విధానము

షాజహాను సాధారణ ముస్లిం జీవిత విధానాన్ని అవలంబించాడు. అతని పాలన లో లాలనల్లో ఇస్లాం మత నియమాలకు అనుగుణంగా మతవివక్ష చూపినట్లుగా కనబడుతుంది. అక్బరు ప్రారంభించిన సిజ్దాను రద్దు చేశాడు. చక్రవర్తి చిత్రములను టోపీ మీద లేక మెడ అలంకారంగా వాడడాన్ని నిషేధించాడు. (Royal portrait) ఇల్లాహి శకాన్ని బదులుగా హిజరి శకాన్ని పునరుద్ధరించాడు. హిందువులు ముస్లిం భార్యల్ని కలిగి ఉండరాదని శాసించాడు. హిందువులు ముస్లిం లను బానిసలుగా కలిగి ఉండరాదు, ముస్లింలకోల లో చేరరాదు. ఇస్లాం నియమాలకు వ్యతిరేకమైన హిందూ ఆచారాల్ని పాటించరాదు. ఉదాహరణకు దహన క్రియ, సతి పేరిట ముస్లిం భర్తలకు సమాధులు ముస్లిం స్త్రీలకు సమాధులు ఆలయాలను దహనం చేయడం, మరియు హిందువుల ద్వారా మొ॥ వి చేయరాదు. ముస్లిం భార్యలున్న వారు వారిని విడిచి పెట్టడమో లేదా ఆ భర్తలు ముస్లిం మతాన్ని స్వీకరించి వారిని తిరిగి నిఖా చేసుకోవటమో చేయాలి. క్రీ.శ. 1633 లో షాజహాను నిర్మాణంలో ఉన్న దేవాలయాలన్నింటిని ముక్కలుగా నాశనం చేయాలని ఆజ్ఞాపించాడు. ఫలితంగా కాశీలో 76 దేవాలయాలు నేలమట్టం చేశారు. దీంతో పాటు అనేక దేవాలయాలు నాశనం చేశాడు,

Satish Chandra

షాజహాను అక్బరు ఉదార విధానాన్ని (31)

కొనసాగించాడా లేదా అనేది "అతని విద్యలలోను, నమ్మకాలలోను సనాతనుడు, పైగా సనాతనవాద్యం లాంటి అధికారంలోకి వచ్చిందని చూపేందుకు ఎన్నో చర్యలు తీసుకున్నాడు" — ఐ.హెచ్. ఖురేషి అనే చరిత్రకారుల మధ్య వివాదం కొనసాగుతున్నది.

షాజహాను మతగురువుల్ని సిజ్దా, జమీన్‌బోస్ ల నుంచి మినహాయించాడు. కానీ జహాంగీరు కూడా ఈ న్యాయ మతగురువుల్ని సిజ్దా నుంచి మినహాయించాడు. షాజహాను కాశ్మీరులో హిందూ-ముస్లింల మధ్య వివాహాలను నిషేధించాడు. జహాంగీరు కూడా రజౌరిలో ముస్లిం స్త్రీలను హిందువులు వివాహం చేసుకోవడాన్ని నిషేధించాడు.

షాజహాను పాలన ప్రారంభంలో ముఖ్యమైంది క్రీ.శ. 1633 లో జహాంగీరు కాలంలో పునాదులు వేయబడి నిర్మాణం పూర్తి కాని ఆలయాల నిర్మాణం నిలిపి వేయాలని అవి పూర్తి చేయరాదని శాసించాడు. ఫలితంగా బెనారస్ లోని 76 దేవాలయ నిర్మాణాలు ధ్వంసమయ్యాయి.

దేవాలయాలు, చర్చిలు యుద్ధాలప్పుడు కూడా ధ్వంసమయ్యాయి. బుందేలుల తిరుగుబాటు కొనసాగేటప్పుడు వీరసింగ్ బుందేలా దేవాలయాన్ని పడగొట్టి దాని స్థానంలో మసీదు కట్టారు. పోర్చుగీసులతో యుద్ధసమయంలో హుగ్లీ వద్ద గల చర్చిలు ధ్వంసమయ్యాయి. కానీ షాజహాను ఆలయాలు నిర్మించరాదన్న విధానాన్ని ఎంతో కఠినంగా అమలు పర్చినట్లు లేదు. 1629 లో శాంతిదాస్ అనే జైన వ్యాపారికి జైన బసతి నిర్మాణానికి స్థలం ఇచ్చాడు. అతడు అహ్మదాబాదులో జైన దేవాలయం కట్టాడని ఖచ్చితంగా చెప్పలేదు. పైగా ఔరంగజేబు ఈ ఆలయాన్ని మసీదుగా మార్చగా చక్రవర్తి జోక్యం చేసుకుని శాంతిదాస్

తెగలను వేటినీ షాజహాను ఆమోదించలేదు.

ఉదార వర్గం వారు 'వహదతుల్ వజూద'
పేర ఏకత్వాన్ని ప్రతిపాదించసాగారు. చిష్టి గురువులు, కబీర్ గురువు
మియాన్ మీర్ లు ఈ విషయంలో దారా, జహనారాల మద్దతు
పొందారు. షాజహాను

షాజహాను ను సమకాలీన చరిత్రకారులు కొందరు
'ముజద్దిద' (ఇస్లాం పునరుజ్జీవనకర్త) గా చిత్రించినా అతను
మాత్రం ఈ రెండు పక్షాల్లో - సనాతన, ఉదార దేనిలోనూ
చేరలేదు. అలాగే రాజ ప్రముఖులు మొత్తంగా కూడా ఏదో ఒక
పక్షంలో చేరటం కనిపించదు. వారంతా వారి మతదృష్టిలో eclectic
గానే ఉన్నారు.

<u>షాజహాను 'రాజ' మార్గాన్ని అవలంబించాడు.</u>
<u>అధికారికంగా రాజ్యాన్ని ఇస్లాం రాజ్యంగా ప్రకటించి, షరియా పట్ల
గౌరవం చూపి, వ్యక్తిగత జీవితంలో షరియా సూత్రాన్ని పాటించటం
చేసినా అతడు అక్బరు ఉదార చర్యలను</u> ఉదా: ఝరోఖా దర్శన్
తులాదాన్ మొ॥ వాటిని <u>కాదనలేదు.</u> అన్ని రాజుల మాదిరిగానే
షాజహాను రాజ్య సిద్ధాంతం మీద కాదు, అవసరం మీద ఆధారపడింది.
(based not on principle but on expediency)
<u>అందువల్ల అది ఏ పక్షాన్నీ సంతృప్తి పరచలేదు.</u> సనాతన వర్గం వారు
మాత్రం మునుపటి కంటే బాగా శక్తివంతులమని భావించసాగారు,
అందువల్ల షరియాను కఠినంగా అమలు పరిచే రాజ్యం కావాలని డిమాండు
చేయటం కొనసాగిస్తూనే ఉన్నారు.

# The Ahoms Kingdom

## అహోంల రాజ్యం

(అహోంలు మంగోలాయిడ్ జాతి వారు) వారు షాన్ తెగకు చెందిన వారు. (వారి అసలు ప్రాంతం ఉత్తర బర్మా) అయితే క్రీ.శ. 13 వ శతాబ్దం ఆరంభంలో వారు బ్రహ్మపుత్ర లోయ భాగాన్ని ఆక్రమించారు. క్రమంగా 15, 16 శతాబ్దాలలో వారు తమ రాజ్యాన్ని పశ్చిమంగా విస్తరించారు. (17 వ శతాబ్దంనాటికల్లా వారు ఆధునిక భారతంలో ఉత్తర-పశ్చిమ (లే) వాయువ్య బార నది వరకు (తూర్పులో) కలాంగ్ నది వరకు గల ప్రాంతాన్ని ఆక్రమించారు.) ఇదే క్రమంగా వారు హిందువులై హిందూ మతాచారాలని అలవర్చుకున్నారు.

అహోంలు బలిష్టమైన దేహదార్ఢ్యం గల జాతి. శత్రువులకు అడ్డుగా అలవలు కట్టడంలో నేర్పరులు. పడవ నడపడంలో, రాత్రి దాడులు చేయడంలో నిపుణులు. [వారి సమాజం భూస్వామ్య పద్ధతిలో అనేక మంది అధికారులతో నిండి ఉండేది. అధికారుల వేట్టిల్లు బానిసలతో నిండి ఉండేవి. తెగకు తండ్రిగా భావించబడే వాడు రాజుగా ఉండేవాడు. రాజును పాక్షిక దివ్యుని గా తలచేవారు. (semi-divine being) అహోంల సైన్యం లో మొత్తం కాల్బలమే ఉండేది, గజబలం వారికి అవసరం లేదు.] 15 వ శతాబ్దంలో బెంగాలు ముస్లిం పాలకులతో యుద్ధం మొదలవడంతో వారు పేలుడు ఆయుధాల వాడకం తెలుసుకున్నారు.

16 వ శతాబ్దం ఆరంభంలో ఒక మంగోలాయిడ్ సైనికుడు బెంగాల్ కు ఉత్తరాన కూచ్ బీహారులో రాజ్యాన్ని స్థాపించాడు. ఈ వంశంలో మూడవ రాజైన లక్ష్మీనారాయణ్

స్వతంత్రను తన విధేయులకు ప్రకటించాడు. ఈ కుటుంబంలో యువనుల కాలం సంకోష్ నది బార్‌నదికి మధ్యగల కామరూప (ముస్లిం రచయితలు దీన్ని కుచ్ హాజో అన్నారు) లో రాజ్యం స్థాపించారు. క్రీ.శ. 1612 లో మొగలులు ఈ రెండు రాజ్యాల మధ్యనున్న వైరాన్ని ఆసరా చేసుకొని కుచ్‌హాజో ని ఆక్రమించారు. ఇది మొగలులకి (- వీరి భూభాగం బార్‌నది వరకు విస్తరించింది కాబట్టి) అహోంలకి మధ్య ఘర్షణ తెచ్చింది. తీవ్ర యుద్ధానంతరం కుచ్‌హాజో లోని మొగలులతో అహోంలు క్రీ.శ. 1639 లో బార్‌నదిని సరిహద్దుగా గుర్తిస్తూ సంధి చేసుకున్నారు.

మొగలు వారసత్వ యుద్ధం జరుగుతూ బెంగాలు లో గవర్నరు లేకుండా పోయాడు, పైగా అస్థిరత ఏర్పడటం కూచ్ బీహారు రాజులు మరియు అస్సాం తమ సేనల్ని పశ్చిమ, తూర్పు దిశల నుంచి కామరూప మొగలు ప్రాంతాన్ని ఆక్రమించడానికి పంపారు. కామరూప ఈ రెండు రాజ్యాలకి మధ్యన ఉంది. ఈ దాడులకి తాళలేక మొగలు అధికారి పారిపోయాడు. దాంతో అహోంలు గౌహాతి ని ఆక్రమించుకున్నారు, ఈ క్రమంలో కూచ్ బీహారు సైన్యాలు కూడా పారద్రోల బడ్డాయి.

వారసత్వ యుద్ధం ముగిసిన తర్వాత బెంగాలు పాలకుడిగా మీర్ జుమ్లా నియమించబడ్డాడు, అహోం రాజులను శిక్షించాలని గా ఆజ్ఞాపించబడ్డాడు. క్రీ.శ. 1661 లో ఢాకా వదిలి వెళ్లిన జుమ్లా సేనలచే కూచ్ బీహారు రాజధానిని రాజా మరియు అతని అధికారులు భయంతో పారిపోగా సులభంగా ఆక్రమించుకున్నాయి. ఈ రాజ్యం మొగలు సామ్రాజ్యంలో కలిపి వేయబడింది. మీర్ జుమ్లా

క్రీ.శ. 1662 జనవరిలో అస్సాం పై దాడి చేశాడు. ఇక్కడ అతను, అతని సేనలు దట్టమైన అడవుల గుండా, కొండలోయల గుండా వెళ్ళాల్సి రావడంతో ఎన్నో బాధలు పడ్డారు. (అహోం సైన్యం చాలా తక్కువ నిరోధకత చూపి బ్రహ్మపుత్ర దాటి వెనక్కి మళ్ళింది. దాంతో మొగలు సేనలు ఆ దారిలో ఎన్నో కోటల్ని ఆక్రమించుకున్నాయి.) క్రీ.శ. 1662 మార్చిలో జరిగిన నౌకాయుద్ధంలో మీర్ జుమ్లా అహోంల నౌకా దళాన్ని పూర్తిగా నాశనం చేశాడు. (చివరికి మీర్ జుమ్లా అహోంల రాజధాని 'గర్హ్‌గాంవ్' చేరాడు.) అప్పటికి అది ఎడారిలా తయారైంది. మొగలులు తీసుకున్న యుద్ధ దోపిడీ సంపద చాలా విలువైంది- 82 ఏనుగులు, 300000 ల రూపాయలు, 675 pieces of artillery ఇంకా ఎన్నో 1000 పడవలు, ధాన్యం, గన్‌పౌడరు మొ॥ వి.

అస్సాం రాజు అతని ప్రముఖులు దూరంగా కొండల లోనికి పారిపోవడం చేత మీర్ జుమ్లా వారితో సంధి చేసుకోవడం కుదరలేదు. వచ్చే వర్షాలలో ఆక్రమించుకున్న ప్రాంతాల్ని అట్టిపెట్టుకోవాలని నిర్ణయించాడు. (గర్హ్‌గాంవ్ లో మొగలుల యుద్ధ దోపిడీ సంపదని రక్షించేందుకు పెద్ద ఎత్తున సైన్యాన్ని ఉంచాడు.) మీర్ జుమ్లా తాను మధురాపూర్ గ్రామంలో ఉన్నాడు. దారుల్ని కాపాడటానికి ఎన్నో అవుట్‌పోస్టుల్ని పెట్టారు. అయినప్పటికీ మొగలుల స్థితి బలంగా లేదు, ఎందుకంటే చాలా మొఘల్ నౌకాదళం గర్హ్‌గాంవ్ చేరుకోలేదు. నది లోతు లేకపోవడం వలన నౌకాదళం లఖౌ లోనే ఆగిపోవాల్సి వచ్చింది.

ఇక (వర్షాలలో రాజ్యం వరదలతో నిండి) పోయి సైనికుల కదలిక అసాధ్యమయ్యింది. అవుట్‌పోస్టుల సంబంధాలు తెగిపోయాయి. (అస్సాం లోని మొగలు సేన బందీ స్థితిలో

ఉండాల్సి వచ్చింది.) బెంగాలు నుంచి సామగ్రులు గానీ, వార్తలు గానీ వచ్చే వీలు. గుర్రాలు, బరువులు మోసే పశువులు లేకుండా చనిపోయాయి. (మొగలుల కష్టాలు తీవ్రంగా చేసినవి అహోంలు) గర్హ్‌గావ్ దగ్గర ఔటపోస్టు ను వశం చేసుకుని మొగలు సేనకు, నావాదళానికి మధ్య సంబంధాన్ని తెంచేశారు. వారు (గర్హ్‌గాంవ్ చుట్టూ చేరి దాదాపు ప్రతి రాత్రి) దాడి చేసి మొగలు సైన్యాన్ని (garrison) భయపెట్టి సాగారు. అయినా వారు నగరాన్ని ఆక్రమించుకోలేక పోయారు.) ఆగస్టు లో మధురాపూర్ లోని మీర్ జుమ్లా సేనలో భయంకరమైన అంటువ్యాధి ప్రబలింది. ఫలితంగా మొగలు సైన్య బలం నాలుగవంతు మాత్రమే మిగిలింది. చివరికి మధురాపూర్ సేనలు గర్హ్‌గాంవ్ సేనలతో చేరాయి, కానీ అంటువ్యాధి ని కూడా తమతో పాటే తెచ్చారు.

ఏమైనా ఈ వర్షాకాలం లోనూ మొగలులు తమ నావికా దళాధిపత్యతను నిలబెట్టుకోవడం గొప్ప విషయం. ఆగస్టు లో నౌకాదళం బెంగాల్ తో సంబంధాలు గల్గి ఉండడమే గాక గర్హ్‌గాంవ్ లోని సేనకి సాయంగా ఎంతో కృషి చేసింది. ఈ మధ్యకాలంలో మీర్‌జుమ్లా తూర్పున ఉన్న తీపాం వరకు సేనని నడిపించాడు. దాంతో అహోం రాజు, ఉన్నత అధికారులు నాంరూప కొండలకి పారిపోయారు. అయితే ఈ దశలో మొగలుసేనలు నాంరూప కొండల్లోకి వెళితే అంటువ్యాధులు వర్షాలు భయపడి నాంరూప్ కొండల్లోకి వెళ్ల నిరాకరించాయి. దాంతో (చివరికి అంటువ్యాధుల కు లొంగిపోక మీర్ జుమ్లా అహోం రాజు తో సంధి చేసుకున్నాడు. అహోం రాజు పెద్దమొత్తం (1) నష్టపరిహారం చెల్లించడానికి, తన (2) కూతుర్ని చక్రవర్తి హరేం కు పంపడానికి (3) కల్లాంగ్ నదికి పశ్చిమ ప్రాంతాన్ని దక్షిణ భాగం లోని మొగలులకి ఇవ్వడానికి అంగీకరించాడు.

తన తిరుగు ప్రయాణంలో క్రీ.శ. 1663 లో ఢాకా చేరకముందే మీర్ జుమ్లా మరణించాడు.

మీర్ జుమ్లా తిరిగొచ్చిన తర్వాత నాలుగేళ్ల వరకు మొగలులు గౌహతిలో సంపాదించిన భూభాగాన్ని నిలబెట్టుకున్నారు. [కాని క్రీ.శ. 1667 లో అహోం రాజు చక్రధ్వజ్ యుద్ధాన్ని పునః ప్రారంభించాడు. కోల్పోయిన ప్రాంతాలని/ గౌహతి తో సహా తిరిగి ఆక్రమించుకున్నాడు. అనిశ్చితమైన యుద్ధం తొమ్మిదేళ్ల పాటు సాగింది, ఈ కాలంలో మొగలులు నేల పై తమ అధికారాల కోల్పోయారు. కామరూప ని కోల్పోయారు. అయితే తర్వాతి దశాబ్దం లో మొగలులు అహోం రాజ్యం లోని పశ్చిమ, తూర్పు ప్రాంతాలని ఆక్రమించుకున్నారు. బెంగాలు కొత్త గవర్నర్ైన షయిస్తా ఖాన్ కృషి అందుకు తోడ్పడింది.]

— ० —

ఒక సైనిక కార్యం వ్యూహాత్మ చూస్తే

మీర్ జుమ్లా దాడి/ అస్సాం పై చేసిన దాడి విజయవంతమైనదని చెప్పాలి. అయితే ఈ విజయం ఎంతో ఖరీదైనది.

# Nature of the Mughal State

## మొగలు రాజ్య స్వభావము see page: 63

భారతదేశంలో మొగలు పాలన చాలా వరకు ప్రాథమికంగా విదేశీయమైంది (1) కేవలం పాక్షికంగానే అది భారతీయమైంది. దాని లక్షణాలన్నీ మొదలైనటువంటి విదేశీయ అరబిక్, పర్షియన్ మూలకాలతో విస్తృతంగా నిండి ఉంది. ఈ కోణం నుంచి మొగలు పాలనను "భారతీయ పరిస్థితులకు అన్వయించిన పర్షో-అరబిక్ పాలనా వ్యవస్థ" అని చెప్పవచ్చు.

"ప్రభుత్వ సూత్రం, వారి మత విధానాలు, వారి శిక్షా నియమాలు, వారి ప్రభుత్వ శాఖా ఏర్పాట్లు, చివరికి అధికారుల పేర్లు కూడా భారతదేశం వెలుపలి నుంచి సిద్ధ రూపం (readymade) లో ఉన్నవాటిని దిగుమతి చేసుకున్నారు"

— జదునాథ సర్కార్

అయితే అక్కడనుండే ఈ రంగానికి చెందిన పాలన స్థానిక వ్యవస్థతో కలిపి రాజ్యం కుదుర్చుకున్నారు. (పాలింపబడే ప్రజలకు బాగా పరిచయమున్న) దిగుమతి చేసిన వ్యవస్థ సూక్ష్మ వివరాలను స్థానిక అవసరాలకు అనుగుణంగా మార్పులు చేశారు" — జదునాథ సర్కార్ అయితే అన్ని భారతీయ పద్ధతులు, సంప్రదాయ చట్టాలు మొగలులు వాటిని అవి అన్ని చట్టం ప్రభుత్వ మత సూత్రాలకు విరుద్ధంగా లేనంత వరకూ

గౌరవించారు. సాధారణంగా చూస్తే గ్రామ పాలన, అధికార నిచ్చెనలో క్రింది స్థాయిలో భారతీయ ఉద్యోగులే కొనసాగించబడం; ఆస్థానంలో మరియు పై స్థాయి అధికార హోదాలలో కేవలం విదేశీయులతో చాలా వరకు పదవుల్ని నిర్వహింపబడం జరుగుతుంది.

అన్ని పైన ప్రభావాత్మైన హోదాలు కూడా గమనిస్తే ప్రభుత్వోద్యోగులలో విదేశీయులే ప్రబలంగా ఉన్నారు. అక్బరు కింద ఉన్నతాధికారులలో 70% మంది తుర్కులు, పర్షియన్లు, ఉజ్బెగ్‌లు మరియు ఆఫ్ఘన్లు. మిగిలిన 30% లో అధికులు భారతీయ ముస్లింలు కాగా ఆ తర్వాత కొంచెం మంది మాత్రమే హిందువులు. 40 ఏళ్లలో అక్బరు 5000 మన్సబ్, అంతకంటే పైగా స్థాయిల్లో కేవలం 21 మంది హిందువుల్ని నియమించాడు. వీరిలో 17 మంది మార్వార్, అంబర్, బికనీర్, జైసల్మేర్, బుందేల్‌ఖండ్ ల రాజపుత్ర రాజులే ఉన్నారు. 5000 మన్సబ్ కింద స్థాయిల్లో 37 మంది హిందువుల్ని నియమించాడు: వీరిలో 30 మంది చిన్న రాజ్యాల రాజపుత్ర రాజులు. తర్వాత మొగలు పాలకులందరి కాలంలో ఔరంగజేబు పాలనాంతం వరకూ కూడా ప్రభుత్వ సేవల్లో హిందువుల సంఖ్య తక్కువగానే ఉండేది.

(2) మొగలు ప్రభుత్వం ప్రధానంగా సైనిక గుణం గలది, పైగా దాని చివరి క్షణం వరకు అది ఈ గుణాన్ని నిలుపుకుంది. మొగలు ప్రభుత్వం 'విదేశీయులు' అధికంగా ఉన్న పెద్ద స్థిరసైన్యాన్ని నిర్వహించేది. వ్యూహాత్మక ప్రదేశాలలో శక్తివంతమైన సైనిక స్థావరాల్ని ఏర్పాటు చేసి ప్రజల్ని తమ సైనిక శక్తితో భయకంపితుల్ని చేసి వారిని నియంత్రణలో ఉంచేందుకు యత్నించేవారు.

మొగలు రాజ్యం లోని అధికారులందరూ సైనిక జాబితాలో నమోదు చేయించుకోవాల్సి ఉండేది. మొగలు రాజ్యం రాజ విధానాల మొత్తం సైనిక రాజ్యంగానే రవాణా ప్రధానంగా అంతర్గత, బహిర్గత రక్షణని శాంతి భద్రతలని కల్పించటం మరియు భూమిశిస్తు వసూలు చేయటం లోనే పనులే ప్రధానంగా పరిమితమయ్యింది.

చక్రవర్తులు విద్యాసంస్థల్ని తెరవడం, మఠాలలకి విరాళాలు ఇవ్వడం మొ॥ చేసినా ఈ విధంగా విజ్ఞానం లేని గద్దెమంది ప్రయత్నాలలో పరిమితమయ్యింది. సాధారణ ప్రజాబాహుళ్యంలో విద్యావ్యాప్తికి ఎట్టి కృషి జరగలేదు. అదేవిధంగా సాహిత్యం, కవిత్వం, సంగీతం, చిత్రకళ మొ॥ వాటికి ఆదరణ ఉండేది, కానీ ఇది దాదాపుగా పాలకుల వ్యక్తిగత వ్యవహారంగానే ఉండేది.

మొగలుల యొక్క గొప్ప వైఫల్యం వారు పాలించి చేసిన, అఖండ విజయం సాధించిన తర్వాత — హిందూ, ముస్లింలని శాశ్వతంగా వేరు పర్చటం. ఇది ఇస్లామిక్ సంప్రదాయం లోని ముస్లింలని ముస్లిమేతరుల్ని వేరుగా ఉంచటం, వారి పట్ల బహిర్గత భేదాన్ని చూపటం లోనే దాని సంబంధించింది.

అక్బరు ఒక్కడే తన ప్రజలలో ఒక వర్గంగా సాధించాలని ప్రయత్నం చేశాడు, కానీ అది కేవలం 25 ఏళ్లు మాత్రమే అయినా అతని మరణం తర్వాత మరుగున పడింది. జహాంగీరు పాలనలో అక్బరు-ఔరంగజేబు కాలానికి మరలి

ఐక్యం చేశాడు. ఇది వ్యక్తిగతంగా స్వాభావికంగా చేసిన వేదా పండితుల వల్ల చేసినా ఈ అలవాటులను చెప్పబడుతున్న విషయం. కారణమేదయినా అక్బరు హిందువుల్ని ముస్లిం స్త్రీలని వివాహాలు చేసుకోకుండా నిరోధించాడు. వివాహాను తన తండ్రిని అనుసరించాడు. సనాతన ముస్లిం అయిన ఔరంగజేబు కాలంలో ఈ రెండు మతాల మధ్య అగాధం మరింత లోతుగా తయారయ్యింది.

× మొగలు రాజ్యం కేంద్రీకృత నియంతృత్వం, లేదా కేంద్రీకృత ఏకచ్ఛత్రాధిపత్యము. రాజు యొక్క అధికారాలు అపరిమితమైనవి. అతని మాటే చట్టం. అతని ఇచ్ఛ ని వారు కాదనలేరు. రాజ్యాంగ, ప్రభుత్వాధి, సైనిక దళాల, న్యాయ పాలన మరియు శాసనాల అతడే సర్వాధికారి. అతడు దేవుని యొక్క ప్రతినిధి. అతను ఖురాన్ ను ఇస్లాం సంప్రదాయాలను పాటించాల్సి ఉన్నప్పటికీ అతను తలచుకుంటే ఏ పాత చట్టాన్ని కాదు ప్రవర్తించవచ్చు. ఆధునిక అర్థంలో 'మంత్రిమండలి' అనేది ఏది లేదు. మొగలు రాజులు మంత్రులు ఉన్నా వారిని చక్రవర్తి ఎప్పుడు కావాలంటే అప్పుడు నియమించవచ్చు మరియు తొలగించవచ్చు. వారి విధి కేవలం సలహాపూర్వకమైనది. మొదటి ఆరుగురు మొగలు చక్రవర్తులు అసాధారణ సమర్ధులు కలవారవటం చే ఏకచ్ఛత్రాధిపత్యం భరించలేని నియంతృత్వం గా మారలేదు, ప్రజల వాళ్ళని కాలరాయలేదు. పైగా వారు ప్రజల సంక్షేమాన్ని

ఉదార విధానాల వలె కృషి చేశారు. అయితే సామ్రాజ్య విశాలత వలన మొఘలుల ఇండియన్ చక్రవర్తుల హక్కులు పూర్తిగా నిర్ణయింపబడి కావు. అందువలనే ప్రతి చక్రవర్తి తను పాలించ వచ్చిన ప్రథమ సంవత్సరాలలో ఇవే ఉన్నట్లు మరలా నిర్ధారించడం జరుగుతుంది. అలాగే ఇండియా గవర్నర్లు చక్రవర్తి హక్కులకు విరుద్ధంగా ప్రవర్తించిన సందర్భాలు కూడా లేకపోలేదు జరిగినాయి. ఇవన్నీ మొఘలు చక్రవర్తి యొక్క అసాధారణ విస్తృత అధికారాలు కూడా కొన్ని పరిమితులు ఉన్నాయని తెల్పుతాయి.] X

* * *

సార్వభౌమత్వం : [మధ్యయుగ భారత సుల్తానుల పాలించిన వారు తమను పూర్తి సార్వభౌములుగా చెప్పుకోవటానికి సిద్ధపడే పరిస్థితులు లేవు. మొఘలులు మాత్రం వారిలా కాకుండా తమను సార్వభౌములుగా ప్రకటించుకున్నారు. బాబరు తనను 'పాదషా' గా చెప్పుకున్నాడు. హుమాయూన్ " ఏ విధంగా అయితే నక్షత్రాలు, గ్రహాల మధ్య సూర్యుడు అగ్రగామో సర్వోన్నతుడో అదే విధంగా రాజు తన ప్రజల మధ్య సర్వోన్నతుడు" అని చెప్పేవాడు. అక్బరు కూడా తనను పాదుషా గా చెప్పుకున్నాడు. ఈ అక్బరు తన స్థానాన్ని మరింత పుష్టి పరిచాడు. క్రీ.శ. 1577 లో ఇతను స్వయంగా అనంతర ఖలీఫాల పద్ధతిని అనుకరిస్తూ 'ఖుత్బా' ను చదివాడు. సిక్కా మరియు జమీన్ బోస్ లను ప్రారంభించాడు. క్రీ.శ. 1579 లో రాజ్య మహజర్ ఉలేమా

చేసిన ప్రకటన లో చక్రవర్తి ని 'ఇమాము-ఇ-ఆదిల్' ఇత్యాది గా వర్ణించారు. మొఘల్ చక్రవర్తులు తైమూరు వారసులుగా — 16, 17 శతాబ్దాలలో పాలించిన వారు తమ ను పూర్తి సార్వభౌములుగా భావించుకున్నారు.

దివ్యత్వ భావన :

మొఘలు పాలకులు తమను దేవుని ప్రతినిధులుగా, దేవుని కిరణాలుగా, పాదుషా దివ్యులుగా చెప్పుకున్నారు. వారు తమ వ్యక్తిత్వం లోని దివ్యత్వాన్ని నొక్కి చెప్పారు. వారు చక్రవర్తిత్వానికి మత ఆధారం కల్పించారు. ఈ ఆలోచన ముఖ్య ఉద్దేశం వారు భగవంతుని అనుమతి తో పాలించడమే గాక భగవంతుని అంగీకారంతో పాలిస్తున్నామని చెప్పుకోవడమే. (Not only by divine permission but also by divine approval).

చక్రవర్తి ని పూజించడం / ఆరాధించడం మొదలైంది. ప్రజలు తమ రోజువారీ పనులు మొదలు పెట్టడానికి ముందే వారి సౌభాగ్యం కోసం చక్రవర్తి వారికి దర్శనమిచ్చేవాడు. ముస్లిములకు చక్రవర్తి వారి సార్వభౌమత్వానికి చిహ్నం కాగా ముస్లిమేతరులకు క్రమబద్ధతకు, ఉదార ప్రభుత్వానికి చిహ్నం. రాజత్వం దివ్యకాంతి లో నిండినది అనే ఆలోచన సనాతనులకు సనాతన ముస్లిం లేదా ఇస్లాం వ్యతిరేకంగా కనిపించింది. కానీ ప్రజల మాత్రం ఈ భావన కు మంచి ఆదరణ ఉండేది.

× ప్రజల్లో విశ్వాసం :

అక్బరు చక్రవర్తి కి రాజ్య విశేష అధికారాన్ని అందించాడు. ఝరోఖా-ఎ-దర్శన్ ను ప్రారంభించాడు. ఢిల్లీ, ఆగ్రా

రాదు. ఈ విధానాలు చక్రవర్తిలో ప్రత్యేకంగా అనేక మతాల ఉన్న ఘర్షణ భావాలన్నింటిని తొలగిస్తుంది.

ఉదాహరణ : మొగలు రాజరికం లో మన చెప్పుకోదగ్గ గుణం ఉదార స్వభావం.

జవాబుదారీతనం :

మొగలు చక్రవర్తులు మంచి బాధ్యతాయుతంగా వ్యవహరించేవారు. అందుకే వారు తమ సమయంలో చాలా భాగాన్ని తమ వార్తాహరుల నివేదికలు వినేందుకు ఉపయోగించేవారు. చక్రవర్తులు క్రమబద్ధమైన వార్తా సేవలు, సైన్య - ఆర్థిక విషయాలపై చాలా శ్రద్ధ తీసుకునేవారు. దీని కోసం వారు తమ జీవనశైలినే మార్చుకునేవారు. వారి సమయం లో చాలా తక్కువ సమయం మాత్రమే విశ్రాంతికి కేటాయించి అధికారం ప్రజా కార్యకలాపాలకే వెచ్చించేవారు.

న్యాయము & ప్రాధాన్యత:

మొగలు చక్రవర్తుల ఈ జవాబుదారీతనానికి సహజ ఫలితంగా సరైన న్యాయాన్ని అందించాలన్న తపనని చెప్పవచ్చు. మొగలు చక్రవర్తులు న్యాయం లేకుండా రాజ్యం మనలేదన్న సామెతను గాఢంగా విశ్వసించారు. న్యాయాన్ని అందించటంలో గడిపే 24 క్షణం 70 ఏళ్ళ భక్తి కన్నా అధికమైందన్న ప్రవక్త వచనం వారికి శిరోధార్యమైంది. మొగలులు విస్తృతమైన న్యాయవ్యవస్థని ఏర్పాటు చేశారు. తప్పుడు నియమాన్ని అవి కచ్చితంగా పాటించేవి. ఈ న్యాయవ్యవస్థలు సాధారణంగా అందరి కోసం అంటే క్రమమైన సాంఘిక జీవనం ఎదగడానికి బాగా తోడ్పడేవి.

Sri Vastava

శ్రీవాస్తవ చరిత్రకారులు అందరు మొఘలు రాజ్య ఉదార స్వభావాన్ని అంగీకరించి చెప్పటం ప్రస్తుతం ఉంది. మొఘలు పాలన ని 'జాతీయ పాలన' గా మొఘలు కాలాన్ని 'భారతదేశ జాతీయతా యుగం' గా అభివర్ణిస్తారు. ఈ విధంగా చెప్పటానికి కారణాలు

1) మొఘలులు బ్రిటిషు వారికి అన్యులు కారు. ఢిల్లీనే వీరి కేంద్రంగా, దేశభక్తి భావనతో పరిపాలించారు వారు బ్రిటిషు వారికి ముందున్న కాలం భారతీయులకు అనుకూలమైనదిగా చెప్పారు. ఫలితంగా మొఘలు కాలంలో భారతదేశం భారతీ-యుల చేతనే పాలించబడిందని చెప్పి అందువల్ల ఇది జాతీయతా యుగమని చెప్పారు.

2) సుల్తానుల యుగం (1206-1526) కన్నా విస్తృతంగా మొఘలు ప్రాభవం ఉండడంతో. సుల్తానుల పాలనలో ప్రజలు పరమత సహనం కనబడ లేదు, వారు ప్రజాహితం లో లేని సామ్రాజ్యాన్ని కొందర్ని ఎంతో పోషించి గని చేశారు. అందువల్ల సరసమైన మొఘలు పాలన చరిత్రలో ప్రత్యేకంగా కల్పించి ఉండొచ్చు.

3) మొఘలు సామ్రాజ్యం అక్బరు రూపంలో ఉత్తమ చక్రవర్తిని అందించింది. అతడు జాతి, మత భేదాలు లేకుండా నిష్పక్షపాతంగా ప్రజలందరి భౌతిక, సాంస్కృతిక అభివృద్ధి కి కృషి చేశాడు. అతని ఉదారత అతని తర్వాత వచ్చిన వారసులు అనుసరించారు, అంత స్థాయి లో కాకపోయినప్పటికీ. మొఘలు పాలన సంక్షేమ పాలన గా

ప్రధాన విధానం మొత్తం 250 ఏళ్ల మొగలు పాలనలో 90 ఏళ్లు మాత్రమే ఉన్నది. ఈ 90 ఏళ్లలో కూడా కలహాలు, పోరాటాలు ఎన్నో తీర్చి ఈ విధానాన్ని బలహీనపరిచిన లోపాలు ఉన్నాయి.

అందువల్ల మొత్తం మొగలు కాలాన్ని 'భారత ఇస్లామియ యుగం' గా చెప్పటం చారిత్రకంగా తప్పవుతుంది. నిజానికి అది భారతీయ - భారతేతర భావాల మధ్య మైత్రి ఘర్షణ యుగం. ఇరువిధాల ఆలోచనల మధ్య ఘర్షణ యుగం. క్షాత్రధర్మాల కాలంలో ఇస్లాం రాజుల సూత్రాలు, పద్ధతులు మతసామరస్యంలో పునరుద్ధరించ బడ్డాయి ఈ దేశంలో.

* ప్రభుత్వ ఉద్యోగులుగా అధికులు విదేశీయులే ఉన్న ప్రభుత్వాన్ని జాతీయ ప్రభుత్వం అని అనలేము. భారతీయ ముస్లింలకు మొగలు చక్రవర్తుల విధాన రూపకల్పనలో ఏ భాగస్వామ్యం లేదా ఏ పాత్ర లేదు.

* మొగలు సామ్రాజ్యసేవలో అధికారులందరూ మనసబ్దార్ గా అంటే సైనిక కమాండర్లు గా చేర్చబడేవారు. స్పష్టమైన పౌరసేవ లేదా పౌర యంత్రాంగం అన్నది లేనేలేదు.

Nature of administration

patrimony = inheritance



మొగలు పాలనావ్యవస్థ మిక్కిలి కేంద్రీకృతమైనదని అన్నారు. ఈ కేంద్రీకరణ భూమిశిస్తు వ్యవస్థ, మనసబ మరియు జాగీరు, ఏకీకృత నాణేల విధానం మొగలు సమర్థవంతంగా పని చేయటం ద్వారా నిరూపితమౌతుంది. కాని స్టీఫెన్. పి. బ్లేక్ మరియు జె. ఎఫ్. రిచర్డ్స్ కేంద్రీకృత లక్షణాల అంగీకరిస్తూనే మొగలు పాలన లని "వారసత్వ పైతృక ఉద్యోగిస్వామ్య" లక్షణాన్ని చూపించారు. (patrimonial bureaucratic) వారి ప్రకారం సామ్రాజ్య రాచ కుటుంబం మరియు విస్తృత ఉద్యోగిస్వామ్యం మీద కేంద్రీకృతం అయ్యింది. స్ట్రూసాండ్ (Streusand) దృష్టిలో మొగలు పాలన కేంద్రీకృతమయినప్పటికీ దాని సరిహద్దు ప్రాంతాల్లో మాత్రం అది తక్కువ కేంద్రీకరణం చెందింది. చేతన్ సింగ్ ఈ దృష్టిని సమర్థిస్తాడు. అతని దృష్టిలో 17 వ శతాబ్దంలో మొగలు పాలన అంతగా కేంద్రీకరణం చెందలేదు. అతని జాగీర్దారి విధానం సమర్థంగా పని చేయటం వల్ల కేంద్రీకరణ సాధ్యం నియంత్రించబడటం అది సవ్యంగా కాలేదు. అతని దృష్టిలో జాగీర్ల బదిలీలు నిజానికి అవి ప్రణాళికలో లాగా ఏమీ జరగలేదు, అదీగాక సరిహద్దుల్లో ఉండే స్థానిక రాజులు కేంద్ర విధానములను ప్రభావితం చేయటంలో విజయవంతమయ్యాయి.

ప్రకారంలో మొగలు రాజ్యం ఎంత వరకూ కేంద్రీకృతం అయింది అన్న అంశం చర్చనీయాంశమైనది. అయితే సిద్ధాంతప్రకారం మొగలుల పాలనా వ్యవస్థ మిక్కిలి కేంద్రీకృతమైంది మరియు ఉద్యోగిస్వామ్యీకరణ చెందింది అని తెలుస్తుంది. చక్రవర్తి

# Late 17th Century Crisis : Revolts

మొగలు పాలనలో తెగల నాయకులు లేదా తెగల సర్దార్లు, గ్రామ సంఘాలు వంటి అధికారాలు కేంద్రీకరణం చేయడానికి ప్రయత్నించినా తెగల నిరసన ఎప్పుడూ వ్యక్తమౌతూనే ఉండేది, అది క్రూరంగా అణచివేయ బడేది కూడా. మరోవైపు ఈ తెగల నాయకులు లేదా గ్రామ ఉన్నత వర్గాలు బహుమానాలు, మినహాయింపులు మొ॥వి ఇవ్వడం ద్వారా పాలన లో లేదా భూమిశిస్తు మదింపు, వసూలు లో భాగస్వాములు చేయడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. అడపాదడపా అణచివేతలు, సముదాయింపు ప్రయత్నాలు ఎప్పుడూ సాగుతూనే ఉండేవి. అయితే 17 వ శతాబ్ది చివరి భాగంలో మాత్రం ఈ నిరసన ఉధృతమవడం, వ్యవస్థీకరణను ఏర్పర్చుకోవడం [స్థానిక భూస్వాముల ద్వారా లేదా ప్రాంతీయ నాయకుల ద్వారా] పోరాడటం కొత్త లక్షణాలుగా చెప్పవచ్చు.

సాధారణంగా ఈ తిరుగుబాట్లన్నింటినీ ఔరంగజేబు మతమౌఢ్యానికి వ్యతిరేకంగా హిందువుల ప్రతిచర్య అని లేదా మొఘలుల ఆర్థిక దోపిడీకి నిరసన అని దీనికి కారణం అంటూ చెప్పడం జరుగుతుంటుంది. మతం లేదా ఆర్థిక దోపిడీ ఈ తిరుగుబాట్లలో నిజంగానే పాత్ర వహించాయి. అయితే ఈ తిరుగుబాట్లలో ఒక్కొక్క దాని విశిష్ట / విలక్షణ లక్షణాలు తెలుసుకోవడానికి

ఇది సహాయ పడదు. మధ్యయుగం లో అన్ని ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలు మతం మీద ఆధారపడటం, మత నినాదాల సాధనగా వాడుకోవటం మనం గమనించాలి. జాట్, శిఖ్ ఉద్యమాలు ప్రత్యేక స్థానిక రాజ్యాల నెలకొల్పడానికి దారి తీశాయి. ఆఫ్ఘన్లు కూడా తమ ప్రాంతంలో ప్రత్యేక రాజ్యానికి కృషి చేశారు, కానీ అది కొనసాగించబడటం వీలు కాలేదు.

అందువల్ల ఈ తిరుగుబాట్లలో చాలా వాటికి ప్రాంతీయ లక్షణం ఉంది.

1) <u>జాట్లు</u> : ( 1667- 89 )

జమునా నది కి ఇరువైపులా ఉండే జాట్లు బలమైన తెగ సాంప్రదాయాల్ని, సమానత్వ భావాల్ని కలిగి ఉండేవారు. ఫలితంగా 'భాయ్ చారా' అనే జాట్ తెగ వ్యవస్థ ఏర్పడింది. జాట్లు ప్రధానంగా సాగుచేసే రైతులు, అంతర్వేదిలో కొద్దిమంది జమిందార్లు మాత్రమే ఉండేవారు. కేంద్రీకృత మొగలు రాజ్యం వీరి జీవిత విధానాలకి జీవన శైలి కి రైతుల సాదరత్వానికి ప్రమాదంగా కన్పించి ఉండొచ్చు, అన్యాయం జరుగుతుందని భావిస్తే ఆయుధాలు పట్టడానికి వారెప్పుడూ వెనుదీయరు. అందువల్లే జహంగీరు, షాజహాను కాలంలో కూడా ఈ జాట్ల ప్రాంతంలో ఎన్నో తిరుగుబాట్లు జరుగుతుండేవి. కాని సుదీర్ఘమైన విస్తృతమైన తిరుగుబాటు మాత్రం ఔరంగజేబు కాలం లోనే జరిగింది. మధుర లోని ~~స్థానిక~~ మసీదు అధికారి అబ్దుల్ నబి హిందూ వ్యతిరేక ధోరణి, అధిక దోపిడి ( అతని మరణానంతరం 93,000 బంగారు మొహరీలు మరియు 13 లక్షల రూపాయలు ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది) జాట్ల తిరుగుబాటు ను ప్రేరేపించి ఉండొచ్చు.

క్రీ.శ. 1667 లో మథురలోని జాట్ జమీందారు గోక్లా నాయకత్వం లో చెలరేగిన తిరుగుబాటు పరిసర గ్రామాలకు పాకి తిరుగుబాటుదార్ల సంఖ్య 20,000 కు చేరింది. అబ్దుల్ నబి చంపబడ్డాడు. కొ సంవత్సరాలపాటు జాట్లు దోపిడీ చర్యలు అధికమవడంతో ఔరంగజేబు ఢిల్లీ నుంచి ఆగ్రా వచ్చాడు. భీకర యుద్ధంలో గోక్లా బందీ కాబడి చంపబడగా అతని కుటుంబాన్ని ఇస్లాం లోకి మార్చారు.

జాట్ల తిరుగుబాటు ఈ ఒక రైతు విప్లవానికి ఉండాల్సిన లక్షణాలన్నీ లేవు. అబ్దుల్‌నబి మథురలో దేవాలయ శిథిలాలపై పెద్ద మసీదు కట్టించినప్పటికీ ఈ తిరుగుబాటు లో మతం పాత్ర లేశమైనా కన్పించదు / ఉన్నట్లు కన్పించదు. ఏదైనా మథుర లోని వీరసింగ్ దేవ బుందేలా కట్టిన ఆలయం మాత్రం జాట్లు నిర్మించిన 'తర్వాత' ధ్వంసం చేశారు.

గోక్లా అంతమైనా జాట్ల నిరసన మాత్రం అంతం కాలేదు. క్రీ.శ. 1680ల నాటికి జాట్లు భూమిశిస్తు చెల్లింపులు నిలిపివేశారు. ఫలితంగా క్రీ.శ. 1681లో ఆగ్రా పరగణాల ఫౌజుదారు ముల్తఫత్ ఖాన్ సినసిని జాట్ గ్రామం పై దాడి చేశాడు. సినసిని జమీందారు రాజారాం ఆ ప్రాంత జాట్లని వ్యవస్థీకరించి వారికి సైనిక శిక్షణ ఇచ్చాడు. దాంతో వాళ్లు ఆగ్రా ని బుర్హాన్‌పూర్, అజ్మీర్ లతో కలిపే రాచ రహదారి పై దోపిడీలు చేసేవారు. జాట్ తిరుగుబాటు స్వభావం కొంత మారి ఆ ప్రాంతంలోని జాటేతర జమీందార్ల ని పారద్రోలి జాట్ల ఆధిక్యత గల రాజ్య స్థాపన దిశగా ఉద్యమం సాగింది. ఇది జమీందారీ వర్గాల పై జాట్లకు రాజపుత్రులకు మధ్య ఘర్షణకు దారి తీసింది.

సాగుచేసే రైతులు - భూమి యజమానులు లేని ప్రాంతాల జమీందార్లుగా 
జాట్లు ఉండగా భూమిశిస్తు వసూలు చేసే పాలక రాజపుత్ర
జమీందార్లు ఉండేది. ఈ పరిస్థితి ని తీవ్రంగా తీసుకొని
ఔరంగజేబు కచ్చావహా రాజపుత్రుడు "బిషన్ సింగ్" ను తిరుగుబాటుని
అణచివేయుటకు నియమించాడు. తర్వాత మధుర ఫౌజుదారుగా నియమించి
ఆ ప్రాంతాలన్నింటిలో అతనికి జమీందారీ హక్కు ఇచ్చాడు. జాట్లు తీవ్ర
నిరసన వ్యక్తం చేశారు. ఏమైనా క్రీ.శ. 1691 నాటికి రాజారాం
తరువాత వారసుడు చూరామన్ లొంగిపోవాల్సింది గా ఒత్తిడి చేయ
బడ్డారు. ఏమైనా జాట్ల తిరుగుబాటు ఉద్యమాలన్నీ దీని
వారి దోపిడీల ఫలితంగా ఢిల్లీ - ఆగ్రా రహదారిలో భద్రత కరువైంది.
18 వ శతాబ్దంలో మొగలుల కేంద్రీకృత పాలన, కేంద్ర ప్రభుత్వ
బలహీనతలను ఆసరాగా చేసుకొని చూరామన్ జాట్లకు ప్రత్యేక
రాజ్యం స్థాపించడంలో, రాజపుత్ర జమీందార్లని పారద్రోలడం
లో విజయం సాధించాడు.

ఈ విధంగా ఒక రైతుల తిరుగుబాటుగా
మొదలైన జాట్ల ఉద్యమం దాని స్వరూపాన్ని స్వభావాన్ని మార్చుకొని
(diverted from its character) దాని స్వభావం నుంచి మరల్చబడి
జాట్ ప్రముఖుల పాలక వర్గం గా ఒక రాజ్యం గా అవతరించింది.

2) సత్నామీలు :

క్రీ.శ. 1672 లో రైతులకు, మొఘలులకు మధ్య 'నర్నౌల్' వద్ద ఘర్షణ జరిగింది. ఈ ఘర్షణ ఒక మతవర్గమైన 'సత్నామీల'తో జరిగింది. 'సత్-నామి' అనగా మంచిపేరు గలవారు. వీరు వైరాగులు. ఏకేశ్వరోపాసన ను నమ్మి అవసర ఆచార ఆడంబరాల్ని వీరు ఖండించారు. వీరు తల, మీసం, గడ్డాలు గొరిగించుకోవడం వల్ల ముండియాలు గా పిలువబడేవారు. వీరికి పేదల పట్ల సానుభూతి, ధనికుల పట్ల వ్యతిరేకత ఉండేది. అందువల్ల సాంప్రదాయ దిగువ వర్గాల వారిలో వారి గౌరవం పెరిగేది. వీరు వైరాగులైనా వ్యవసాయం, చిన్న వ్యాపారాలు చేసేవారు. వారు కేవలం నీతిబద్ధ మార్గాల్లోనే ధనం సంపాదించాలనే నియమం గలవారు. వారు కులం, హోదా మొ॥ వాటి ఆధారంగా, హిందూ-ముస్లిం అనే భేదభావాల్ని చూపలేదు. కఠిన ప్రవర్తనా నియమావళి ని పాటించేవారు.

> "ఎవరైనా తప్పు చేయడానికి ప్రయత్నించినా,
> వారిని బలం తో అణచివేయాలని చూసినా,
> అధికారం లో ఉన్నవారైనప్పటికీ వారు
> సహించరు"
>
> — ఖాఫీ ఖాన్

స్థానిక మొఘలు ఫౌజ్దార్ కి సత్నామి రైతుల కు మధ్య చెలరేగిన వివాదం కాస్తా బహిరంగ తిరుగుబాటు గా ఎదిగింది.

సత్నామీలు స్థానిక ఫౌజుదారు ను ఓడించి అనేక గ్రామాలు దోచుకున్నారు. నార్నౌల్, బైరాట్ నగరాల్ని స్వాధీన పరుచుకున్నారు. ఈ తిరుగుబాటు (ప్ర)భావంగా ఢిల్లీ ప్రజలు ఆహార ధాన్యాలు లేక అలమటించారని తెలుస్తుంది. మధ్య సమయంలో సత్నామీలని ఖడ్గాలు ఏమీ చెయ్యలేవని వారికి మంత్రశక్తులున్నాయని ప్రజలు భయపడ్డారు. స్థానిక మొఘలు సేనలపై సత్నామీలు సాధించిన విజయాలు వారికి (బలాన్ని) మానసిక ధైర్యాన్ని ఇచ్చాయి. పరిస్థితి చెయ్యి దాటిపోతుందని ఔరంగజేబు 10,000 సైన్యం; ఫిరంగిదళం అనేక ఆయుధాలతో రాజా బిషన్ బిషన్ సింగ్ తో పాటు రదనదజ్ ఖాన్ (Radandaz Khan) నాయకత్వంలో పంపబడ్డారు. మొఘలు సేనల మానసిక ధైర్యం కోసం చక్రవర్తి స్వయంగా మంత్రాల్ని రాసిన కాగితాల్ని మొఘలు జెండాలకు కట్టారు. సత్నామీలు తీవ్రంగా పోరాడినా ఈ దాడి సేనకు లొంగక తప్పలేదు. వేల మంది మరణించగా కొద్ది మంది తప్పించుకో గలిగారు. పోరాటంలో ఈ ప్రాంతం సత్నామీల నుంచి వేర్పడింది.

3) బుందేలులు :

ఉత్తర భారతంలో ఔరంగజేబు పై విజయవంతమైన శత్రువు చంపత్‌రాయ్ బుందేలా కుమారుడు ఛత్రసాల్. క్రీ.శ. 1661 లో ఔరంగజేబు సైన్య బలానికి చంపత్‌రాయ్ తలవంచాల్సి వచ్చింది. అప్పుడు ఛత్రసాల్ మొగలు సేనల్లో చిన్న అధికారిగా చేరి దక్షిణాన రాజా జైసింగ్ కింద యుద్ధాలు చేశాడు. అప్పుడు శివాజీ వ్యక్తిత్వం నుంచి స్ఫూర్తి పొంది మొగలు సామ్రాజ్యానికి వ్యతిరేకంగా శివాజీ అనుమతిని కోరాడు. అయితే శత్రువుకి దృష్టి మరల్చటానికి ఛత్రసాల్ ను బుందేల్‌ఖండ్ నాదే తిరుగుబాటు చెయ్యాలని శివాజీ సలహా ఇవ్వటంతో ఛత్రసాల్ బుందేల్‌ఖండ్ చేరాడు. ఔరంగజేబు మతమౌఢ్యంతో విసిగి ఉన్న వాళ్ళ సహాయం(తో) అతనికి తోడ్పడింది. అనేక మంది ప్రజలు చేరి అతన్ని బుందేల్‌ఖండ్ రాజుగా ఎన్నుకున్నారు. అతడు మొగలు సేనల్ని ఓడించి ధమోని, సిరోంజ్ లను దోచుకున్నాడు. అంతేగాక వారి దక్షిణ మొగలు స్థావరాలనుంచి 'చౌత్' వసూళ్ళు మొదలుపెట్టాడు. కొద్ది సంవత్సరాలకే ఛత్రసాల్ కాలింజర్, ధమోని లను స్వాధీనం చేసుకొని మొత్తం మాళ్వాను దోచుకున్నాడు. అతని విజయాలతో చివరికి క్రీ.శ. 1705 లో ఔరంగజేబు అతనితో రాజీ ఒప్పందం చేసుకొని అతన్ని 4000 మన్సబ్దారుగా నియమించాడు. చక్రవర్తి మరణం తర్వాత క్రీ.శ. 1707 లో ఛత్రసాల్ బుందేల్‌ఖండ్ లో స్వతంత్ర పాలకుడయ్యాడు.

మన్సబు పెంపుతో ఉన్నత పదవి లో నియమించాడు. చక్రవర్తి మరణం తర్వాత ఛత్రసాల్ బుందేల్‌ఖండ్ కి తిరిగొచ్చి

సంజాయిషీ ఇవ్వమన్నాడు. గురు తన కొడుకు రాం రాయ్ ని పంపాడు. గురువు ప్రవర్తన విశ్వాసపాత్రమైనదిగా విధేయంగానున్నంత దేశద్రోహంగా కనబడలేదు. కాని తండ్రి ప్రవర్తన కి భద్రత గా రాము రాయ్ ని ఢిల్లీ నగరే నిర్బంధించారు. భవిష్య గురువు ను మొఘలు కి అనుకూలంగా మలచేందుకు కూడా ఇలా నిర్బంధించి ఉండొచ్చునని A.C. బెనర్జీ అభిప్రాయ పడ్డాడు.

> "చక్రవర్తి భవిష్య శిక్కు గురువు ను సామ్రాజ్య ఆస్థానం లో దగ్గరి సంబంధాలు ఏర్పరచటం ద్వారా మొఘలు ప్రభావానికి అనుకూలంగా మార్చడానికి కూడా ఈ విధంగా చేసి ఉండొచ్చు"
>
> — ఎ.సి. బెనర్జీ

ఏదేమయినా ఆస్థానంలో రాము రాయ్ ప్రవర్తన గురు హర్ రాయ్ కి సంతృప్తి గా లేక తన చిన్న కొడుకు "హరికిషన్" ను గురువు గా నియమించాడు. ఔరంగజేబు రామ్ రాయ్ కి ఆదరణ అందించాడు, డెహ్రాడూన్ వద్ద అతని నివాసానికి ఏర్పాటు చేశాడు. శిక్కు గురువుల వారసత్వం లో ఔరంగజేబు జోక్యం చేసుకున్నట్లు కన్పించదు. నిజానికి ఆ సమయం లో ఏ ఘర్షణ కూడా లేదు. క్రీ.శ. 1664 లో కొత్త గురువు తేగ్ బహదూర్ పీఠానికి వచ్చాడు. అస్సాం దాడి లో వీరుడు రాజా జై సింగ్ కొడుకు రాజా రామ్ సింగ్ తో కలిశాడు.

గురు తేగ్ బహదూర్ క్రీ.శ. 1671 లో

పంజాబు అరిగాప్పుడు. క్రీ.శ. 1675 లో ఢిల్లీ లో గురువు ని బంధి చెరసాలం ఉరి / చంపడం వీటికి దారి తీసిన సంఘటనలపై భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. మొగలు అధికారులు శిక్కు గురు తేజ్ బహదూర్ లో హింద ని భగ్నం చేసే చట్టవిద్రోహి ని చూశారు, అందువల్ల అతని కి శిక్షం వేశా బాళ్ళు చివరి క్షణం గా ఇవ్వడం లో తప్పు లేదన్నారు. శిఖ్ఖులు తమ గురువులో అనాచారాలకు వ్యతిరేకంగా పోరాడిన మహావీరుని, మతస్వేచ్ఛ కోసం ప్రాణత్యాగం చేసిన వీరుని చూశారు.

గురు తేజ్ బహదూర్ వీరమరణం తో సిక్కులు సాయుధ వ్యతిరేక ఉద్యమం గా రూపు మార్పు పొందారు. ఇందులో ప్రధాన పాత్ర వహించింది చివరి గురువు గురు గోవింద్ సింగ్. పంజాబు కొండలలోని వెలివాలు గురు లాంఛనలకు చక్కపెట్టం తయారు చేశాడు. క్రీ.శ. 1699 లో గురు గోవింద్ శిక్కుల సైనిక సాధ్యాత్వం తెలా "ఖల్సా" ను ఆనందపూర్ లో ఆరంభించాడు.

కొండ రాజ్యాల రాజులు మొదట్లో తమ అంతర్గత యుద్ధాల్లో సాయం కోసం ఆహ్వానించి అతడు ఆధిక్యవంతుడు పెరగటం గమనించారు. అందువల్ల కొండ రాజ్యాల సైన్యాన్ని కలిపి గురు గోవింద్ పై దాడి చేశారు, కాని ఓడి పోయారు. ఈ కొండ రాజులు సహాయం తో తమ అరదున గురు గోవింద్ లో పోరాడాల్సింది గా మొగలు ప్రభుత్వాన్ని కోరారు.

ఔరంగజేబు కూడా పెరుగుతూ పోతున్న గురు గోవింద్ శక్తి ని గమనించి తన ఫౌజ్దార్ లకు "గురువు కి బుద్ధి చెప్పాలి" అని ఆజ్ఞ. (to admonish the Guru) ఔరంగజేబు

గురువుని తను కలవాల్సిందిగా ఆహ్వానించాడు. క్రీ.శ. 1706 చివరి కాలంలో గురువు దక్షిణమునుండి బయలుదేరి ఔరంగజేబు మరణించిన సమయంలో దారిలో ఉన్నాడు. కొందరు పండితుల ప్రకారం గురుగోవింద్ ఆనందపూర్ ను విడిచి తనను నమ్మని ఔరంగజేబు ని ఒప్పిద్దామనుకున్నాడు.

గురుగోవింద్ మొగలుల శక్తి ముందు నిలువ లేకపోయినా అతడు ఒక సంప్రదాయాన్ని సృష్టించాడు, తర్వాత సిక్కు రాజ్యం స్థాపించబడటానికి ఒక ఆయుధాన్ని రూపొందించాడు. ఒక సమానత్వాన్ని బోధించే మత ఉద్యమం కొన్ని పరిస్థితుల కారణంగా రాజకీయ, సైనిక ఉద్యమంగా మలుపు తిరగడాన్ని ఒక తర్కంగా ప్రాంతీయ స్వాతంత్ర్యం వైపు కదలడాన్ని ఇది సూచిస్తుంది. సిక్కుల సైనిక చైతన్యం మొగలుల పతనానికి ఒక ముఖ్య కారణం అయ్యింది.

# ఔరంగజేబు మత విధానము



ఔరంగజేబు మతవిధానం గురించి చరిత్రకారులు భిన్నాభిప్రాయాలు వెల్లడించారు. కొందరు ఔరంగజేబు అక్బరు యొక్క పరమత సహన విధానాన్ని తలకిందులు చేసాడని తద్వారా సామ్రాజ్యానికి హిందువుల విధేయతని దక్కనీయకుండా చేసాడని అన్నారు. మరికొందరు ఔరంగజేబు అనవసరంగా అన్యాయంగా క్రూరంగా చిత్రీకరించబడ్డాడని అన్నారు. ఔరంగజేబు పూర్వీకుల ఉదారతనం వల్ల హిందువులు అవిధేయులయ్యారని అందువల్ల ఔరంగజేబు కు దీర్ఘకాలంలో సామ్రాజ్య సుస్థిరత కోసం అవసరమైన ముస్లింల మద్దతు సంపాదించటానికి కఠిన చర్యలు తీసుకోవడం మినహా వేరే గత్యంతరం లేక పోయిందని అంటారు. ఇటువంటి కాలంలో అతని మత విధానాన్ని సాంఘిక, ఆర్థిక, మరియు వ్యవస్థాపరమైన పురోగతుల దృష్ట్యా పరిశీలించడం జరుగుతుంది.

ఔరంగజేబు అతని మత నమ్మకాలలో సనాతనుడని చెప్పటానికి సంశయం లేదు. అయితే ఔరంగజేబు మతవిధానాన్ని అతని వ్యక్తిగత మత నమ్మకాలకే ఉన్న చట్రం లోంచి మాత్రమే చూడడం సరి కాదు. అతని మతవిధానాన్ని విశ్లేషించటానికి గాను క్రీ.శ. 1679 వరకు ఒకటవ దశగా క్రీ.శ. 1679 నుంచి

క్రీ.శ. 1707 లోగా తన మరణం వరకు రెండవ మరియు చివరి దశ గా విభజించవచ్చు.

మొదటి దశ : క్రీ.శ. 1658 - 1679.

సింహాసనాన్ని రాగానే ఔరంగజేబు అనేక నైతిక, మత నియమాలు చేశాడు. భగవంతునికి మాత్రమే చెందాల్సినదని 'సిజ్దా'[1] ను రద్దు చేశాడు. నాణేలపై 'కల్మా'[2] అవమానానికి గురయ్యే అవకాశం ఉందని దాన్ని రద్దు చేశాడు. జొరాస్ట్రియన్ల ఆచారమైన 'నౌరోజ్'[3] ను జరుపరాదన్నాడు.

'హరాం' మరియు 'మక్రూహత్' (అనైతిక వాసనాలు) ల ద్వారా నిషేధింపబడినవాటిని బహిరంగంగా ధిక్కరించకుండా ఉండేందుకు 'ముహతసిబ్'[4] లనే (ప్ర)భుత్వాధికారులని నియమించాడు. అయినప్పటికీ బహిరంగంగా ధిక్కారం కొనసాగిందని మనుచ్చి (Manucci) రచనల వల్ల తెలుస్తుంది. ముహతసిబ్ ల నియామకం ద్వారా ఔరంగజేబు రాజ్యం (ప్ర)జల నైతిక సంక్షేమానికి కూడా బాధ్యత వహిస్తుందని చెప్పదల్చుకున్నాడు.

ఔరంగజేబు తన పదకొండవ పాలనా సంవత్సరంలో (1669) అనేక మత పవిత్ర శుద్ధి చర్యలు చేపట్టాడు. (puritanical measures) కొన్ని మొదట్లో చాలా వరకు నైతిక, ఆర్థిక స్వభావాన్ని లేదా మతాతీతమైన స్వభావం కలిగినవే. ఆస్థాన గాయకుల్ని[5] తొలగించి వారికి పింఛను ఏర్పాటు చేశాడు. కాని, 'నౌబత్' మరియు

వాయిద్య సంగీతాన్ని మాత్రం అనుమతించాడు. గాత్ర సంగీతం అప్పటి ఆదరణ పొందకపోయినా హారెం లో, ప్రముఖుల చేత ఆదరించబడింది. ఇస్లాం కు వ్యతిరేకమైన అంధవిశ్వాసమని 'ఝరోఖా దర్శన్'(6) ను రద్దు చేశాడు. అక్బరు కాలం లో మొదలైన, చిన్న ప్రముఖులకు భారం గా పరిణమించిన 'తులాదానాన్ని'(7) నిలిపి వేశాడు. కాని సామంతుల అభిప్రాయాలకు లొంగి తన కొడుకులు అస్వస్థత నుండి కోలుకున్నప్పుడు తులాదానాన్ని చేసేవాడు. జ్యోతిష్యులు(8) పంచాంగం తయారు చేయడాన్ని రద్దు చేశాడు. కాని రాజ కుటుంబం లో సభ్యులు అందరూ దీన్ని ధిక్కరించినవారే. చక్రవర్తిగా 'తిలకాన్ని'(9) పెట్టుకోవడం మానేశాడు. హోలి, మహర్రం వంటి మత(10) ఉత్సవాలను రద్దు చేశాడు. ఆస్థానాధికారులు పట్టువస్త్రాలు ధరించవద్దని; వెండి సిరాబుడ్డీ ను వాడరాదని; సింహాసనం గది నిరాడంబరంగా(11) ఉండాలని మొ॥ ఎన్నో అటు మతపరమైన ఇటు ఆర్థికపరమైన చర్యలు తీసుకున్నాడు. ఆర్థిక చర్యగా చివరికి అధికారిక చరిత్ర రచన శాఖ ను కూడా రద్దు చేశాడు.

ఈ చర్యలు మతపరమైనవి గా కన్పిస్తున్నా కొంతవరకు ఇవి ఆ సమయంలో ఔరంగజేబు ఎదుర్కొన్న ఆర్థిక సంక్షోభం ఫలితం కూడా. అంతర్గత వారసత్వ యుద్ధం ఆపైన క్రీ.శ. 1660 నుండి వర్షాభావం పంటల వైఫల్యం జరిగాయి. ఔరంగజేబు 13 వ పాలనా సంవత్సరంలో ఖర్చులు ఆదాయాన్ని మించిపోయి చక్రవర్తి కుటుంబ ఖర్చులు తగ్గించాడని 'మాసిర్-ఇ- ఆలంగిరి' వల్ల తెలుస్తుంది.

రాజ్యపాలనలో ముస్లింలకు ప్రాధాన్యత

ప్రోత్సహించేందుకు[12] క్రీ.శ. 1665 లో ముస్లింల దిగుమతి సుంకాన్ని 5% నుండి 2½ % కి తగ్గించాడు, మరో రెండేళ్ళకి మొత్తం రద్దు చేశాడు. కాని ముస్లిం వ్యాపారులు హిందువుల దిగుమతుల్ని కూడా తమవిగా చూపుతుండటంతో తిరిగి 2½ % దిగుమతి సుంకం విధించాడు, హిందువులకి ఇది 5% గా ఉండేది.

అలాగే క్రీ.శ. 1671 లో ఖలీసా యొక్క 'కరోరీలందరూ (Karoris) ముస్లింలే ఉండాలని, ప్రాంతీయ గవర్నర్లు, రెవిన్యూ అధికార్లు దివాన్, పేష్కర్ లుగా ముస్లింలనే[13] నియమించాలని ఆజ్ఞ చేశాడు. కాని అంతమంది తెలివైన ముస్లింలు లేక ఈ శాసనాన్ని వెనక్కి తీసుకున్నట్లు ఖాఫీఖాన తెలిపాడు.

పైవన్నీ ఈ చర్యలు ఔరంగజేబు యొక్క ఇరుకైన, మతపర దృష్టికోణాన్ని తెలుపుతున్నాయి.

హిందూ దేవాలయాలు:

ఔరంగజేబు ఫర్మానా ప్రకారం 'ఇప్పటి నుండి[14] ఉన్న దేవాలయాల్ని ధ్వంసం చేయరాదు కాని క్రొత్తవాటిని కట్టనీయరాదు' అని 'పాత ఆలయాల్ని మరమ్మత్తులు చేయించవచ్చు' అని నిర్దేశించాడు. అయితే ఈ దేవాలయాలు చెడిన కారణం క్రొత్తదేమీ కాదు. సుల్తానుల కాలంలో ఉన్న దాని పాలకాను పునరుద్ధరించిన దానికి ఇలాడు

మళ్ళీ చెప్పాలంటే.

ఔరంగజేబు శాసనం వల్ల పెద్ద సంఖ్య లో దేవాలయాల ధ్వంసం ఏమీ జరుగలేదు.

అయితే మరాఠాలు, జాట్లు మొ॥ వారి నుంచి రాజకీయ ప్రతిఘటన ఎదురవడంతో కొత్త ఆదేశం వేశాడు. స్థానికులతో ఘర్షణలప్పుడు శత్రువుల నుంచి ఈ దేవాలయాల్ని కూల్చడం కూడా న్యాయమైందేనంటూ ఇది శిక్షగా, హెచ్చరికగా తోడ్పడుతుందని చెప్పాడు. ఇంకా దేవాలయాల్ని చెడు ఆలోచనలకి తెలిపే కేంద్రాలని (నూతన ముస్లింలను నమ్మని) భావించాడు. కొన్ని దేవాలయాలకి హిందువులు, ముస్లింలు కూడా దూరాలనించి రావడం చూసి అలాంటి వాటిని ధ్వంసం చెయ్యమన్నాడు.

అయితే ఈ దేవాలయాల ధ్వంసంలో 'రాజకీయ ఉద్దేశం' కూడా ఉందని మధుర లోని కేశవ రాయ్ ఆలయాన్ని ధ్వంసం చేసే సమయంలో ముస్తాయిద్ ఖాన్ 'మాసిర్ ఇ ఆలంగిరి' లో చేసిన వ్యాఖ్య చెబుతుంది

"చక్రవర్తి యొక్క విశ్వాస శక్తిని, భగవంతుడికి విధేయమవడంలో అతని మహాత్మ్యాన్ని ఈ సంఘటన ద్వారా చూసి గర్వంతో ఉన్న రాజులు బిగుసుకుపోయారు, ఆశ్చర్యంతో గోడకేసి చూస్తున్న బొమ్మల్లా నిలబడిపోయారు."

అయితే ముస్తాయిద్ ఖాన్ చెప్పినట్లు ఔరంగజేబు ఇస్లాం స్థాపన కై అన్ని దేవాలయాల్ని ధ్వంసం చేయమన్నాడు విశ్వసించ లేము నమ్మడం సరికాదు, ఎందుకంటే అది పరిపాలన ని తప్పుడు అర్థంలో రాసినట్టు.

(విరోధం ఉన్న సందర్భాల్లో మాత్రం మథురలో మార్వార్, ఉదయపూర్, జోధపూర్ ల లో ఎన్నో "దేవాలయాల్ని" ధ్వంసం చేశారు.)

(ఇలాంటి విధాన విషయాలు ఔరంగజేబు పరిపాలన కు లోబడే ఉన్నాయి అది ఆతని పూర్వీకుల సమతా విధానాలకి ముప్పు తెచ్చింది) ఔరంగజేబు హిందూ ఆలయాలకి, మఠాలకి దానాలిచ్చిన సాక్ష్యాలు ఉన్నా మొత్తం మీద ఈ కోణాన్ని పరిమితం చేయటమే కనిపిస్తుంది.

మొత్తం మీద ఔరంగజేబు యొక్క హిందువుల పట్ల పరిపాలన విధానం, ఏదో కారణం మీద పాత దేవాలయాల్ని కూడా ధ్వంసం చేయటం సమాజంలోని హిందువుల్లో అసంతృప్తిని రగిల్చి ప్రతిఘటనలకి దారితీసింది.

జిజియా

ఔరంగజేబు తమను ప్రజలకు రక్షకుడిగా చెప్పుకొను ఉలేమాకి, మత గురువుల ప్రాబల్యం పెరిగిపోయిన అవసరం రావటానికి కారణాలున్నాయి. అతడు తండ్రిని జైల్లో పెట్టటం,

సంబంధం ఉంటుంది? మత విషయాలలో మతవైరంలా ప్రవేశించాల్సిన ఏం పని ఉంది? నీకు నీ మతం, నాకు నా మతం అంతే. ఈ నియమం (మీరు చెప్పింది) కనుక పెడితే అందరు (హిందూ) రాజుల్ని వారి ప్రజల్ని సమూలంగా నాశనం చేయడం నా విధి అవుతుంది"

— ఔరంగజేబు

రెండవ దశ : క్రీ.శ. 1679 – 1707

"వయసు గాని అనుభవం గాని ఔరంగజేబు యొక్క మతదురాభిమానాన్ని తగ్గించలేకపోయాయి"

[అన్న జదునాథ సర్కార్ అభిప్రాయం ఇటీవలి పరిశోధనల దృష్ట్యా [illegible] మార్చుకోవాల్సి వస్తుంది.]

అన్న జదునాథ సర్కార్ అభిప్రాయంతో ఇటీవలి పరిశోధనల దృష్ట్యా ఏకీభవించలేము.

క్రీ.శ. 1679 - 1687 ల మధ్యకాలంలో ఔరంగజేబు తనను "ముస్లింల రక్షకుడిగా", "కేవలం నిజ విశ్వాసవంతుల్ని గౌరవించేవాడిగా" చెప్పుకున్నాడు. దక్కను ముస్లిం పాలకుల్ని "వ్యామోహంగలవారిగా హిందువులుగా" చెప్పాడు, వారు మరాఠాలతో చేతులు కలపడమే అందుకు కారణం. ఈ కాలంలోనే ప్రత్యేకంగా మత మార్పిడులకు అనేక ప్రలోభాల

భారత్ ను 'దారుల్ హర్బ్' (ముస్లిమేతరులు ఉండే భూమి) నుంచి 'దారుల్ ఇస్లాం' (ముస్లింలు నివసించే భూమి) గా మార్చేందుకు నిర్దేశించినప్పటికీ, అది సబబు కాదు. షరియా ప్రకారం ఇస్లాం చట్టాలు అమలు చేసినా, చక్రవర్తి ముస్లిం అయితే ఆ రాజ్యం 'దారుల్ ఇస్లాం' అవుతుంది. అంతేగాని మొత్తం ప్రజలంతా ముస్లింలు కానవసరం లేదు.

ఔరంగజేబు ఇస్లాం కు మతమార్పిడులు ప్రోత్సహించటం న్యాయమని తలచినా బలవంతంగా మతమార్పిడులు పెద్ద సంఖ్యలో గాని వ్యవస్థీకృతంగా పద్ధతి ప్రకారం జరిపించినట్లు గాని సాక్ష్యాధారాలు లేవు.

'అథార్ అలీ' అధ్యయనాల ద్వారా ఔరంగజేబు పాలనాయంత్రాంగంలో గల ఉద్యోగులలో పాలన ద్వితీయార్థంలో, హిందువులు మరాఠాలతో సహా ప్రముఖుల్లో $\frac{1}{3}$ వ వంతుకు పెరిగినట్లు తెలుస్తుంది (x) కాని మరాఠాలకు వారికి ముఖ్య విధులు గాని పదవులు గాని ఇవ్వలేదు. సామ్రాజ్య సేవలో వారిని అంతర్భాగం గా కూడా పరిగణించలేదు. అలాగే వారితో వ్యక్తిగత లేదా స్నేహపూర్వక సాన్నిహిత్య సంబంధాల ఏర్పాటుకు కృషి చేయలేదు, (రాజపుత్రులతో

(x) ఔరంగజేబు తన పాలన ద్వితీయార్థంలో మరాఠాలను విరివిగా సేవలో చేర్చుకున్నాడు.

మాదిరిగా వీరితో పెళ్లిళ్లు మొ|| చేసుకోలేదు). మరాఠా మన్సబ్దార్లు సాధారణంగా మూడు నెలల జీతాన్ని కలిగి ఉండేవారు, ఇందులో $\frac{1}{4}$ వ వంతు తగ్గించేవారు.

ఔరంగజేబు చర్యల్ని అందరు రచయితలు కేవలం మతపరమైనవన్నారు. ఇవి అంధ మతమౌఢ్యం వలన ఏర్పడిన చర్యలని, జేబు కు తక్కిన విషయాలన్నింటిలో నిష్పాక్షికంగా ఉన్న గొప్ప వివేకానికి ఏ మాత్రం తగనివి గా ఉన్నాయని (శ్రీ) రాం శర్మ అన్నారు. అక్బరు ప్రవేశపెట్టిన, ఆచరించిన మత సహన విధానాన్ని తలకిందులు చేయడం ద్వారా సామ్రాజ్యాన్ని అనేక విధాలుగా బలహీనపర్చాడు, దాన్ని పతనావస్థకు చేర్చాడు. ఇతని మత విధానం చివరకు జాట్లు, సత్నామీలు, సిక్కులు, బుందేలులు, రాజపుత్రులు మొ॥ అనేక తిరుగుబాట్లకు కారణమైందని ఈ వర్గం వారంటారు.

ఆధునిక చారిత్రకారులు అందరు ఔరంగజేబు సహనం గలవాడని చెప్పేందుకు శ్రమ పడ్డారు. అతనిని అన్ని కోణాల్లో ఉదహరించారు. ఆలయాల ధ్వంసం మతేతర కారణాల వల్ల జరిగిందన్నారు. సైనిక సేవ చేయకుండా రాజ్యరక్షణ పొందుతున్నందుకు జిజియా విధించడం సబబన్నారు. పత్రాల ప్రకారం భారీగా మతమార్పిడులు జరగక పోవడాన్ని గుర్తు చేస్తారు. పాలన ద్వితీయార్ధంలో హిందూ ప్రముఖుల సంఖ్య పెరిగిందని చెప్తారు. (షాజహాను కాలంలో 1/4 వ వంతు జేబు కాలంలో 1/3 వ వంతుకు)

ఏక పాలకుడుగా ఔరంగజేబు అనేక రాజకీయ, ఆర్థిక, సాంఘిక మరియు పాలనా పరమైన సమస్యల్ని ఎదుర్కోవాలి. రాజ్యం మరియు ను ఉల్లంఘించరాదని ఎంతో ఉత్సుకతతో ఉన్నా స్వతంత్రమైన, శక్తివంతమైన హిందూ ప్రముఖుల్ని, రాజులని, జమీందార్లని, ప్రజలని పూర్తిగా నిర్లక్ష్యం చేసే ఏ విధానం కూడా పనిచేయదనే రాజకీయ వాస్తవాన్ని ఎరిగినవాడు.

# అయువాలన ఔరంగజేబు రాజ్య స్వభావం

మార్పిడికి యత్నించకపోయినా దాని ఇస్లాం లక్ష్యాన్ని నాకు చెప్పాడు. తన ప్రజానీకంలో ఎక్కువ హిందువులే తో వారు తమ మతంతో గాఢంగా పెనవేసుకుపోయారని తెల్సినవాడు. హిందువులను సంపూర్ణంగా వేరుపరచే ఏ విధానమూ పని చేయదని రాజకీయ సత్యం గ్రహించాడు. ఒక సనాతన ముస్లింగా ఇస్లాం శాసనాన్ని వీలున్నంతా అమలు పరచాలనుకున్నాడు. కానీ ఒక పాలకునిగా తన సింహాసనాన్ని బలపర్చటానికి, విస్తరించటానికి చేసే ప్రయత్నాల్లో హిందువుల మద్దతు కోల్పోరాదనుకున్నాడు.

ఏదేమయినా అతడు హిందువులకు, వారి ప్రార్థనా స్థల, విద్యాలయాలకు చేసిన (హాని) చర్యలు మొగలు సామ్రాజ్యానికి ముప్పు తెచ్చాయి. రాజపుత్రుల తిరుగుబాట్లకు, మరాఠాల విజృంభణకు రాజకీయ విధానాలతో కారణమైనప్పటికీ ఈ కష్టాల్లో రగులుకుంటున్న మతం కూడా పాత్ర వహించిందనడం కాదనలేనిది. ఈ తిరుగుబాట్లు సామ్రాజ్య శాంతిని భంగం చేశాయి, దాని ఆర్థిక వ్యవస్థను కుంటుపరిచాయి, సైనిక శక్తిని కుంగదీశాయి. ఇవన్నీ ఔరంగజేబు వైఫల్యాలకు తర్వాత సామ్రాజ్య పతనానికి దారి తీశాయి.

* ఇవన్నీ ఔరంగజేబు వి సిద్ధాంతాలు మాత్రమే కాదు. (93)
అతడేం చెప్పాడో దాన్ని ఆచరించి చూపాడు. అతని వ్యక్తిగత
జీవితం అత్యుత్తమ శైలిని వర్తనం గలది, సమకాలీన రాజుల్లో
ఏ పాలకునైనా అందరి దాన్ని ఆచరించి చూపాడు. తన కాలం లో
చక్రవర్తి కి సాధారణంగా ఉండే వ్యసనాలన్నింటికీ మిక్కిలి దూరంగా
ఉండేవాడు. సమకాలికులు అందుకే అతన్ని 'జిందా పీర్' గా
పిలిచేవారు. ( living saint )

## ఔరంగజేబు మత విధానం

గిస్ట్

Intro < అక్బరు పరమతసహనాన్ని తలక్రిందులు చేశాడని / జేబు అనవసరంగా క్రూరుడిగా చిత్రీకరించబడ్డాడని

→ వ్యక్తిగతంగా సనాతన ముస్లిం -- కాని వ్యక్తిగత మతవిశ్వాసాల దృష్ట్యా రాజ్యమత విధానాన్ని ముడి వేయలేదు.

మొదటి దశ (1658 - 1679)

సిక్కా, కల్మా, నౌరోజ్ ల రద్దు
ముహతసిబ్ ల నియామకం
ఆస్థానగాయకులు, ఝరోకాదర్శన, మత ప్రార్థనలు,
తులాభారం / తులాదానం,
పంచాంగం, తిలకం, మొ॥ రద్దు
→ నిరాడంబరత ↑
→ ముస్లింల & దిగుమతి సుంకం 2½ %
హిందువులకు 5 %
→ ఖాళీగా ఖాజీలు, ప్రాంతీయ గవర్నర్లు అంతా ముస్లింలే

# ఔరంగజేబు పాలనా విధానము

ఔరంగజేబు పాలన మిక్కిలి కేంద్రీకృతమైన నియంతృత్వము. అధికారమంతా అతను చేతుల్లోనే కేంద్రీకృతం అయినది. అతడే అతనికి సొంత ప్రధానమంత్రి, అతనికి స్వభావసిద్ధమైన అనుమానగుణమే అందుకు కారణం. అధికారుల మీద నమ్మకం లేక ప్రతి పాలనా వివరాన్ని స్వయంగా చూసేవాడు. తనకి నివేదించబడ్డ (పిటిషన్లను) విజ్ఞాపనలను తానే స్వయంగా చదువుతుండేవాడు. తనే వాటికి సొంతంగా జవాబుల్ని రాయటమో లేదా చెప్పి రాయించటమో చేసేవాడు. అతని మంత్రులు, అధికారులంతా అతని కఠిన నియంత్రణలో ఉండేవారు. వారు అతనితో పాటు ప్రభుత్వ విధానాల్ని రూపొందించటంలో భాగస్వామ్యం తీసుకునే వీలు లేదు. ఔరంగజేబు రాజు ప్రత్యేకవార్తలపై విపరీతమైన జాగ్రత్త గలవాడు. అతడు తన జవాబుల్ని అమలు పర్చటంలో చాలా కఠినంగా ఉండేవాడు. ఫలితంగా అతని అధికారులు, మంత్రులు కేవలం గుమాస్తాలుగా దిగజార్చబడ్డారు. దానితో పాలన నిస్సహాయంగా, భ్రష్టంగా తయారైంది.

ఔరంగజేబు దారుణమైన మతభ్రష్ట పద్ధతులకి, అన్నలకి వ్యతిరేకంగా యుద్ధ వ్యూహం ఆచరించటంగా సింహాసనం పొందాడు. అందువల్ల సున్నత శాస్త్రం నియమాన్ని కోసం పునరుద్ధరించటం అవసరం కాదు. అయితే ఒక రాజకీయ పోటు లో ఒక మానవ జాతి ని అధిక్యతకి చేయాలనే ప్రయత్నం విఫలమవుతుంది. మతపరమైన, వైయక్తికమైన నియమాల్ని ఒకసారి కఠినంగా అమలు చేయటం; అల్లాల మినహాయింపులు ఇవ్వటం చివరికి ప్రజల అభిమానం

తెలుసుకొని పూర్తిగా నిషేధించటం చేసి తనను తానే పరిహాసం చేసుకున్నాడు. అతడు చేసిన తప్పిదం ఏమిటంటే ప్రజల్ని లోతైన ఉత్తమ ఆలోచనలు చేసేలా ప్రోత్సహించకుండా కేవలం ఈ సైనిక నియమాల్ని కేవలం పర్యవేక్షించటం. ఫలితంగా మంత్రులు, కాజీలు కూడా శిక్ష వద్ద లంచాన్ని ప్రేమించేవారు. అతని స్థావరాల కూడా వాదం మొదలైంది. నాట్యగత్తెలకు, ఆస్థాన గాయకులకు పెళ్లి చేసుకోవటం లేదా దేశం విడిచి వెళ్ళటం చేసిన ఆజ్ఞ నిరుపయోగమయ్యింది.

క్రీ.శ. 1707 లో అతని మరణ సమయానికి మొగల్ సామ్రాజ్యం 21 ప్రావిన్సులు కలిగి ఉంది — ఆరు దక్షిణ లో ( ఖాందేష్, బేరార్, ఔరంగాబాద్/అహ్మదనగర్, బీదర్, బీజాపూర్ మరియు గోల్కొండ ) మరియు 15 ఉత్తర భారతంలో ఆఫ్ఘనిస్థానంతో సహా , కాశ్మీరు, లాహోర్, ముల్తాన్, సింధ, అజ్మీర్, ఢిల్లీ , ఆగ్రా , అలహాబాదు, అవధ్, బీహారు, బెంగాలు, ఒరిస్సా, మాళ్వా మరియు గుజరాత్. అక్బరు కాలం నుండే చక్రవర్తి నియమించిన వారు ప్రావిన్సు గవర్నరు గా ఉండేవారు. ఓ దివాను, అనేక ఇతర అధికారులు చక్రవర్తి చేతనే నియమించబడి ప్రావిన్సు పాలన లో గవర్నరుకు సహాయపడేవారు. ఔరంగజేబు కాలంలో, సమర్థత లేని ఉన్నతులు ఉత్తర భారతంలో లేకపోవటం, దాదాపు 25 ఏళ్ళ పైగా దక్షిణ లో నిరంతర యుద్ధాలు కొనసాగించటం కారణంగా ప్రావిన్సుల పాలన దిగజారి పోయింది. స్థానిక పెద్దలు, జమిందార్ల చే అనేక ప్రావిన్సుల్లో కేంద్ర అధికారం బలహీనం పడటంతో కొంత భద్రతలు భంగపడ్డాయి. ఈ కేంద్ర అధికారం బలహీనమవడానికి

ఢిల్లీ చక్రవర్తి నిరంతర యుద్ధాలు, అతని మత సహనం లేక
పోవటం కారణాలుగా చెప్పవచ్చు.

ఆర్థిక రంగంలో ఔరంగజేబు ఎంతో మేలు చేశాడు. ఖురాన్ సూత్రాలనుబట్టి పన్నుల్ని, అక్రమమైన వసూళ్ళని (అబ్వాబులు) నిరంతరం వ్యతిరేకించాడు. క్రీ.శ. 1659 లో అతడు రోడ్లమీద రవాణా సుంకం (రహదారి) ని అక్ట్రాయ్ (పండారి) ని పెద్ద నగరాల్లో సరుకులని బయట నుంచి తెచ్చే సరుకుల వ్యాపారపదార్థాలు, పాడియాల మీద పండారి ని నిషేధించాడు. సాధారణంగా భూమిశిస్తు లేదా దిగుమతి సుంకాలతో పాటు అదనంగా అనేక 'అబ్వాబులు' వివిధ కారణాల మీద విధించేవారు. ఈ అబ్వాబులు దోపిడీ, లోభిమేత సాధనాలుగా మారేవి, ఎందుకంటే సాధారణంగా వాటిని చెల్లించేది పేద ప్రజలే కాబట్టి. ఉత్పత్తుల స్థానిక అమ్మకాల మీద సుంకం (అక్ట్రాయ్) అధికారులు ప్రభుత్వం తరఫున వసూళ్ళు ఫీజులు, కమీషన్లు విధించటం, కొన్ని వ్యాపారాలు చెల్లించాల్సిన లైసెన్సు రుసుములు, అధికారులకి బహుమానాలు, హిందువుల మీద ప్రత్యేక విధింపులు ఇలా అనేక మార్గాల ద్వారా డబ్బు గుంజేవారు.

హిందువుల మీద ప్రత్యేక పన్నులు పవిత్ర జలాల్లో స్నానం చేసినందుకు, గంగ లో కలిపేందుకు తీసుకెళ్లే అస్థికలపై విధించే పన్ను మొ॥ ఉండేవి.

సామాన్య ప్రజల భయస్వభావం, కేంద్ర ప్రభుత్వ బలహీనత ప్రాంతాల్లో, అధికారపదవుల విశ్వసనీయమైన ప్రతినిధులు ప్రాంతాల్లో కేంద్రానికి లేకపోవడం

పైన కారణాల వలన బహదూర్‌షా ఉదార శాసనాలు చేసినా ప్రజలు లాభం పొందలేక ప్రాంతీయ అధికారుల చేతుల్లో అణచివేతకు గురయ్యారు.

భూమిశిస్తు మదింపు మరియు వసూళ్ళకై అక్బరు ఏర్పర్చిన పద్ధతులు ఉపయోగించడం మానేశారు. దాని స్థానంలో శిస్తు కౌలు పద్ధతి (tax farming) ప్రవేశపెట్టారు. దీని కింద భూమిని సాగుచేసే రైతుల దగ్గర నుంచి ప్రభుత్వ పన్నువసూళ్లని ప్రభుత్వాధికారులు వసూలు చేయడం ఉండదు, కాంట్రాక్టర్లే ఆ వసూళ్ళు చేస్తారు. ఫలితంగా రైతుల పరిస్థితి మరింత దిగజారింది.

దక్కను యుద్ధాల ఫలితంగా మొఘలు సైన్యం బాగా పెరిగింది. కాని ఔరంగజేబు కఠిన క్రమశిక్షణ, మెళకువ మరియు సైనికులుగా సమర్థత ఇవ్వ కలిగి ఉన్నప్పటికీ అక్బరు కాలంతో పోలిస్తే సైనిక వ్యవస్థ మరియు క్రమశిక్షణ చాలా నాసిరకంగా తయారయ్యింది.

ఔరంగజేబు మొదలు నుంచి చివరిదాకా తన ప్రభుత్వానికి సైనిక స్వభావాన్ని నిలిపి ఉంచాడు. తన ప్రజల సాంఘిక, ఆర్థిక సంక్షేమానికి గాని లేదా వారి నైపుణ్యాలకు అభివృద్ధికి గాని కళలు నేర్చుకునేందుకు, వృద్ధి చెందేందుకు గాని ఎట్టి సదుపాయాలూ కల్పించలేదు,

4.9.03

# Shivaji and the Early Maratha Kingdo



## : శివాజీ వ్యక్తిత్వము :

భారతదేశ చరిత్రలో శివాజీ గొప్ప ఆకర్షణీయమైన వీరుడు.

“శివాజీ కేవలం తన సమకాలీనులకే గాక మొత్తం ఆధునిక యుగంలోనే విలక్షణమైన వ్యక్తిగా విస్మరించలేనివాడుగా నిలుస్తాడు. చుట్టూ చీకట్లు అలుముకొన్నా శివాజీ తెలివైన ప్రకాశంగా తన కాలానికి ఎంతో ముందుగా వెలుగొందుతాడు”

— సర్కార్

హిందూజాతి ఉత్పత్తి చేసిన ఆఖరు నిర్మాణాత్మక మేధావి, జాతీయరాజ్య స్థాపకుడు (nation builder) శివాజీ అని జదునాథ్ సర్కార్ అభిప్రాయ పడ్డాడు.

(అతడు తగిన కొడుకు, ఆధారపడదగ్గ స్నేహితుడు, ప్రేమించదగ్గ భర్త, మంచి తండ్రి.)

శివాజీ బాధ్యతగల కొడుకు, శ్రద్ధగల భర్త, ప్రేమగల తండ్రి, దయగల స్నేహితుడు. అతడు తల్లిని దైవంగా ఎంచాడు. తండ్రిని గౌరవించాడు. భార్యాపిల్లల్ని ప్రేమించాడు. పేదసాదలకి నేస్తం. అక్షర జ్ఞానం లేకపోయినా

మంచి విజ్ఞానవంతుడు, నేర్పరి. అసాధారణమైన తెలివితేటలు, అద్భుతమైన సమయస్ఫూర్తి, విమర్శనాత్మక విచక్షణ జ్ఞానం ఉన్నాయి. అతడు ఏ వ్యసనాలూ లేని తీవ్ర మతధ్యాస గలవాడు. నూతన హిందూ ధర్మ బద్ధుడైనమా మత మౌఢ్యుడు కాదు. సమకాలీనుడైన ఔరంగజేబు ఆ శివాజీ విధానాలకు పూర్తి విరుద్ధంగా ఉన్నాడు. శివాజీ పరమతాలను సహనంతో చూశాడు. హిందూ, ముస్లిం సాధువుల్ని ఒకేలా ఆదరించాడు.

శివాజీ గొప్ప సైనిక వివేకి. తన సేనల శక్తి స్వభావాలకి, దేశ ప్రకృతికి, యుద్ధ ఆయుధాలకి, శత్రువుల అంతర్గత పరిస్థితులకి సరిపోయే గెరిల్లా యుద్ధ విధానాన్ని అవలంబించాడు. అతని సైన్యంలో ఎంతో గొప్పగా నియమాలు, వ్యవస్థీకరణ, శిక్షణ మరియు క్రమశిక్షణ ఉండేవి, ఫలితంగా 17వ శతాబ్దం లో తిరుగులేనిదయ్యింది. అతడెంత గొప్ప వ్యవస్థీకరణకర్త అంటే ఒక దాడికి ముందుగానే అన్నీ అందించేవాడు. తన సైన్యంతో పాటు తానూ కష్టసుఖాలు అనుభవించి వారికి ఆదర్శప్రాయుడయ్యాడు. వారితో సమంగా యుద్ధ కష్టనష్టాలు భరించాడు.

మధ్యయుగ భారతదేశంలో నావిక / నౌకాదళ ఏర్పాటు ఆవశ్యకతని గుర్తించిన తొలి భారతీయ పాలకుడు. ఇతడు నావికా స్థావరాల్ని, కొలాబ అటు వ్యాపారం కోసం ఇటు

రక్షణ కోసం ఏర్పాటు చేశాడు.

ఒక పాలకుడిగా, (పరిపాలనావేత్త)

పరిపాలకుడిగా శివాజీ గొప్ప విజయం సాధించాడు, అతడు కేంద్రీకృతమైన రాజ్యాన్ని స్థాపించాడు. దానికి మంచి పాలనావ్యవస్థని అందించాడు. తన ప్రజలకి ఆ కాలంలో లేనట్లు వారి నైతిక, భౌతిక అభివృద్ధికి అన్ని విధాలా కృషి చేశాడు. తన పౌర, సైనిక అధికారులపై గట్టి నియంత్రణ కలిగి ఉన్నాడు. వ్యక్తిగతంగా పాలన లోని వివరాల్ని పరిశీలించేవాడు, అయితే అదే సమయంలో పాలన లోని నిర్ణయాధికారాల్ని తన కింది వారికి బదలాయించేవాడు, వారి నిర్వహణ విధులకి సంబంధించిన విషయాల్లో వారికి మంచి విచక్షణాధికారాన్ని ఇచ్చాడు.

ఒక పాలకుడిగా శివాజీ విశేషం ఏమిటంటే అతడు స్థానిక అంటే కేంద్ర ప్రభుత్వాన్ని ఎంత సమర్థవంతంగా వ్యవస్థీకరించాడంటే అతడు రాజ్యంలో లేకపోయినా అవి ఎలాగా చక్కగా పనిచేశాయి. ఒక సంప్రదాయ రాచరికంలా ఇది నవ్య విధానమని జదునాథ సర్కార్ అభిప్రాయపడ్డారు. ఒక పాలకుడిగా శివాజీ తన ప్రజలకు కేవలం హిందువులే గాక సర్వమత సమానత్వాన్ని, సమాన అవకాశాల్ని అందరికీ వర్తింప కుల, మత వివక్షతలూ లేకుండా కల్పించాడు. ప్రభుత్వ ఉద్యోగాల్ని ప్రతిభావంతులకు అందించాడు. అతని పాలనా వ్యవస్థ లాభదాయకమైంది, అవినీతి లేనిది, పక్షపాతాలకు తావు లేనిది.

అధికార భాషగా పర్షియను ను గాక మరాఠీ ని ఎంపిక చేయడం, అతని ప్రాబల్యం మీద చేయబడిన

సంస్కృత నిఘంటువు రాజ్-వ్యవహార కోష్ మరాఠాలకు తమ జాతీయ భాషను అభివృద్ధి చేసుకొనేందుకు తోడ్పడ్డాడు. ఈ విధంగా శివాజీ ఒక పాలకుడుగా కేవలం ఉన్నత రాజకీయ ఆదర్శాల్నే గాక నైతిక ఆదర్శాల్ని కూడా సాంస్కృతిక ఆదర్శాల్ని కూడా ఏర్పర్చుకున్నాడు. కేవలం ఆదర్శాల్ని ఏర్పర్చుకోవడమే గాదు అందరి శ్రేయస్సు చేకూర్చే విధానాలను ఆచరణలో సాధించ గలిగాడు, (విజయం సాధించాడు.)

శివాజీ ఉత్తమ దేశనాయకుడు. తన కాలం ఆదర్శమైన — మహారాష్ట్రలో హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించడం కోసం తన కాలంలో సాధ్యమయ్యేటటువంటి స్వాభావికంగా పరిపాలించడం, తన చుట్టూ ఉన్న దేశంలో ఉత్తమ విషయాల్ని సేకరించడం చేశాడు. అతడు మరాఠాలని గొప్ప జాతీయ ఉత్సాహపరిచి వారిని జాతిగా ఏకం చేశాడు. అతడు తన కార్యాన్ని మొదలు పెట్టినప్పుడు మొగలు సామ్రాజ్యం దాని ఉచ్ఛస్థితిలో ఉంది, దానితో పాటుగానే బీజాపూరు సుల్తానులు, గోల్కొండ, జంజీర సిద్దీలు, పశ్చిమతీరంలో పోర్చుగీసువారు శక్తివంతమైన శత్రువులుగా ఎదుర్కోవలసినవారుగా ఉన్నారు. అయినప్పటికీ శివాజీ వీరి క్లిష్ట పరిస్థితుల నించి తప్పించుకోగలిగాడు. అందువల్ల ఒక ఉత్తమ నాయకుడుగా శివాజీ సాధించిన ఘనమైన విజయం మరాఠా జాతిలో జీవనాన్ని నింపడమే. అతడు గొప్ప నిర్మాణాత్మక వివేకి మరియు వాస్తవమైన వాస్తవరంగా ఒక రాజుగా కథానాయకుడు అందువల్లే తన సమకాలికులకు

ఆదర్శ స్ఫూర్తి దాయకమూర్తోడు.

105

"ఆధునిక హిందువులకు వారి వృద్ధికి తగినట్లుగా పూర్తిగా ఎదగవచ్చు బోధించాడు. హిందూవృక్షం నిజంగా చావలేదని, శతాబ్దాల రాజకీయ (సంకెళ్ల ను) బంధనాల భరించటమే బరువైన లోపలి కింద నించి ఎదగగలదని కొత్త ఆకులు, కొమ్మలు తొడగగలదని దాని శిరస్సును ఆకాశం దాకా ఎత్తగలదని శివాజీ నిరూపించాడు."

— జదునాథ సర్కార్

* శివాజీ దయ, సహనం, మంచి నడవడిక, ప్రవర్తన వీరత్వం, ఏమాత్రం సడలని గట్టి పట్టుదల, సదాశయాలు గలవాడు. మానవ స్వభావం, మరియు పరిస్థితులను సక్రమంగా అంచనా వేయగలవాడు. శివాజీ తెలివైన, ఆచరణాత్మక నాయకుడు. అతడు సాహసం గల సైనికుడు, ఎన్నో సార్లు జీవితాన్ని పణంగా పెట్టి పోరాడాడు. సమర్థుడైన సైన్యాధికారి. అతడెన్నడూ మత్తుపానీయాలు ముట్టలేదు స్త్రీలోలత్వం అసలే లేదు. ఈ విధంగా అన్ని కోణాల నించి శివాజీ ఆదర్శపురుషుని గా గోచరిస్తాడు.

శివాజీ భారత దేశమంతా హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించ దలిచాడా ?

శివాజీ తన దృష్టిని మహారాష్ట్రకే పరిమితం చేయలేదని భారత ఉపఖండంలోని హిందువుల అందరి క్షేమం కోసం పరితపించాడని సర్దేశాయి అనే చరిత్రకారుడు అభిప్రాయపడ్డాడు. ఈ వాదనకు అనుకూలంగా ఆయన కింది కారణాలు వివరించాడు.

1) శివాజీ ప్రధాన ఆశయం మహారాష్ట్రకే గాని ప్రాంతాన్ని సంపాదించడం కాదు / ప్రాంత స్వాతంత్ర్యం కాదు. క్రీ.శ. 1645 లోనే శివాజీ దాదాజీ నరస ప్రభు కు తన 'హిందవి స్వరాజ్' ప్రణాళిక గురించి లేఖ రాశాడు. దీని ద్వారా మొత్తం భారతదేశానికి హిందూమత స్వాతంత్ర్యం సంపాదించాలనే అర్థం అవగతమవుతుంది. ఈ విధానానికి మరింత అర్థం ఆలోచనాపరులు, కొందరు శివాజీ ఆలోచనల్ని అర్థం చేసుకున్నారు.

2) శివాజీ వసూలు చేసిన 'చౌత్' మరియు 'సర్దేశముఖి' లను అఖిల భారత స్థాయిలో ప్రాప్తి ఆదాయం గా సిద్ధాంతాలుగా భావించాడు.

3) సమకాలీన [illegible] కవి శివాజీ ఢిల్లీ

సింహాసనాన్ని అధిరోహించ లేరాదని అంటూ వాళ్ళని మరాఠా రాజు గా పరిమితం చేసిన ఘనుడని జైసింగ్ ను కీర్తించాడు.

4) శివాజీ ఆగ్రా సందర్శనం చేయడానికి గల కారణం ఉత్తర భారత పరిస్థితులని, మొగలు బలాల స్థితిని ప్రత్యక్షంగా అంచనా వేసి మొగలులని ఓడించేందుకు అవకాశాలు ఎలా ఉన్నాయో చూసేందుకే.

5) అతడు తన రాజ్యాన్ని సైనిక మరియు నౌకా బలాల ద్వారా పరిరక్షించుకోవడం, సముద్రయానానికి వ్యతిరేకంగా ఉన్న మూఢనమ్మకాలని పక్కన పెట్టడం, మతమార్పిడి పొందిన వారిని తిరిగి హిందూమతం లోనికి ఆహ్వానించడం మొ॥ వన్నీ శివాజీ మొత్తం హిందూమతం యొక్క రాజకీయ, సైనిక పునరుద్ధరణ కై మహాశయాన్ని కలిగి ఉన్నట్లు తెలుస్తుంది.

6) శివాజీ దక్కను సుల్తానులతోను మరియు మొగలులతోను పోరాటం లో ఉన్నాడే గాని రాజపుత్రులతో యుద్ధాలు చేయలేదు పైగా వారితో అవగాహనను పెంపొందించాడు.

అయితే ఈ వాదనల్లో బలం ఉన్నట్లు మనకు అనిపించదు, ఇక అంగీకరించడానికి ఎలాంటి మార్గాలు ఉన్నాయి. మొగలు సామ్రాజ్యంలో హిందూమత స్వాతంత్ర్యం సాధ్యం కాదనటానికి పెద్ద వాదనలేమి అవసరం లేదు,

ఎందుకంటే మొఘలులది సామ్రాజ్యంలో సామ్రాజ్యాన్ని సృష్టించడమే. అందువల్ల దాన్ని ఏ విధంగానూ అంగీకరించడం, ఔరంగజేబు ఆ పదం అసలే చెప్పలేదు. శివాజీ యొక్క స్వరాజ్య స్థాపన మొత్తం భారతదేశాన్ని ఆవరించగల సత్తా కలిగి ఉన్నది. శివాజీకి అలాంటి ఆశయం ఉందా అన్నది సంశయాస్పదమే. శివాజీ ఆదర్శవాది కాదు, అతడు వాస్తవవాది. అతనికి అలాంటి ఆశయం ఉన్నది నిరూపించడానికి మనవద్ద గట్టి సాక్ష్యాలు లేవు. ప్రస్తుతం వివాదరహితంగా శివాజీ ఆగ్రా నుండి రాయగఢ్ కు తిరుగు ప్రయాణం లో 25 రోజులు మాత్రమే ఉన్నాడు. అందువల్ల ఉత్తర భారత పరిస్థితుల గురించి అవగాహన చేసుకున్నాడని అతనికి సమయం గాని అవకాశం గాని లేదని తెలుస్తుంది. అతని ఆగ్రా ప్రయాణం ఆ ఉద్దేశంతో చేయలేదు. ఇంకా, అతడు రాజపుత్రులతో యుద్ధాలు చేయలేదనడం సరికాదు, రాజపుత్ర స్వతంత్ర రాజులతో యుద్ధం చేయనప్పటికీ మొఘలుల తరపున వచ్చిన రాజపుత్రులతో యుద్ధాలు చేశాడు. స్వతంత్ర రాజపుత్రులతో యుద్ధం చేయాల్సిన పరిస్థితులు శివాజీకి ఏర్పడలేదు.

మరోవైపు శివాజీ మొగలులకు వ్యతిరేకంగా ప్ర-
-తిఘటించి దెబ్బగొట్టేందుకు ఏ చర్యలూ చేపట్టలేదు, కేవలం
హిందూయిజాన్ని పునరుద్ధరించటం పట్ల మాత్రమే శ్రద్ధ వహించినాడు.
ఉత్తర భారతదేశంలోని శక్తివంతులైన హిందూ రాజులతోను దాదాపుగా
రాజులు, శిష్యులు, సాధువులు మొ|| వారితో పట్టి సంబంధాలు
పెంపొందించుకోలేదు. తెలివైన నాయకుడిగా జైసింగ్, జస్వంత్ సింగ్
లాంటి హిందూ మహారాజులను ప్రోత్సహించి గాని అతనికి
వారితో గాని వారి రాజపుత్రులతో గాని మొగలుల వ్యతిరేకంగా
కూటమి ఏర్పరుద్దామన్న ఆలోచనే లేదు. అతడు ఉత్సాహం
తో ఉన్న బుందేల్ ఖండ్ ఛత్రసాల్ సేవల్ని వినియోగించుకొనగలిగి,
అతనికి సాయం అందించకుండా కేవలం తిరిగి బుందేల్ ఖండ్ కి
వెళ్ళి అక్కడ ఔరంగజేబు కు వ్యతిరేకంగా పోరాడమని సలహా
ఇచ్చాడు. ఈ కారణాలన్నీ అఖిల భారతస్థాయి హిందూ
రాజ్యస్థాపన ఉద్దేశాన్ని నిరూపిస్తున్నాయి.

అందువలన శివాజీ మొత్తం భారతదేశంలో
గాక మహారాష్ట్రలో హిందూ సామ్రాజ్యస్థాపనలో ఆసక్తి గలిగి
ఉన్నాడని తెలుస్తుంది. కనుక శివాజీని జాతీయ
నాయకుడిగా కన్నా మరాఠా నాయకుడిగా చెప్పడమే
సబబు.

శివాజీ శాశ్వతరాజ్య స్థాపించలేకపోవటానికి గల కారణాలు

శివాజీ శాశ్వతరాజ్య స్థాపించలేకపోవడానికి ఎన్నో కారణాలున్నాయి.

1) అతని పాలనా కాలం చాలా చిన్నది, కేవలం 10 సంవత్సరాలే. పైగా అతను ఎక్కువ శత్రువులతో పోరాడటమే నిరంతరంగా సాగేది దానితో రాజ్య సుస్థిర పరిచేందుకు అవకాశం దక్కలేదు.

2) 16 వ శతాబ్దంలో మరాఠా సమాజ పరిస్థితి ఎలా ఉండేదంటే సుదీర్ఘం, సహన మరియు నిరంతర కృషి. తరాల పాటు సాగితే గాని అట్టి నిష్పక్ష సేవల కృషి ఫలితంగా మాత్రమే సాధ్యపరచబడేలా ఉండేది.

3) అప్పటి అస్థిర వాతావరణం లో ప్రజలు ఒక్కరూ వారి 'వతన' లేదా వారసత్వ భూములకై చేరేవారు లేదా ప్రజలు భూమికి ఒక అంగుళం ఎక్కువ మంది ప్రాణ త్యాగాలు చేసుకునేవారు. ఇది కుటుంబాల పరిధి పెరగడం వల్ల లేదా వతన ను కుటుంబ సభ్యుల మధ్య విభజించటం వల్ల లేదా దాని యజమాని స్థానిక సర్దారు లేదా రాజు మార్పిడి చెయ్యటం వల్ల ఈ పరిస్థితులు తలెత్తేవి. ఇది మహారాష్ట్ర లో ప్రజల మధ్య నిరంతర తగాదాలకు కారణం అయ్యేది. శివాజీ కూడా తన్ను ఈ వతన్

వివాదాల్లో తేడాలు చెలరేగి వచ్చేది. ఇలా ఫిలాయింపుగా ఓడి పోయిన వర్గం వారు అతని పట్ల ద్రోహం చెయ్యడం శత్రురాజ్యాలైన బీజాపూరు, గోల్కొండ సుల్తానులలోను మొగలుల లోను చేరి పోయేవారు. అందువల్ల శివాజీ శత్రువులతో గాక తన సొంత ప్రజలతో కూడా నిరంతరం పోరాడాల్సి వచ్చింది.

4) 17 వ శతాబ్దంలో మహారాష్ట్ర ప్రజలు మిగిలిన భారతదేశ ప్రజల వలెనే కులాల తదితర ఆధారాలతో గుర్తింపు వర్గాలుగా విడిపోయి పరస్పరం తీవ్ర భేదాలతో ఉండేవారు. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరుల్ని శూద్రులుగా చేయడంగా చూడడమే గాక వారిలో వారు కేవలం దేశ, కొంకణ, చిత్పావన, కరాడీక బ్రాహ్మణులుగా విడిపోయి ఉండేవారు. వారు శివాజీని క్షత్రియునిగానే గాక తమ రక్షకునిగా అంగీకరించక శివాజీని కేవలం నికృష్టునిగా అవమానపరచడం చేశారు. శివాజీ పట్టాభిషేక సమయంలో కూడా వేదమంత్రాల్ని ఉచ్చరించనీయలేదు. ఈ తీవ్ర వైరం చేత సామాన్య కార్యాచరణ ను కష్టం చేసింది. అంతే వాస్తవమైన, శాశ్వతమైన జాతీయ ఐక్యత ను అసాధ్యం చేసింది.

5) శివాజీ రాజకీయ విజయం నూతన సాంఘిక పరిస్థితిని భిన్నంగా మలిచింది. మహారాష్ట్రలోని ఉన్నత వర్గాల వారు రాజ్యం తమకు తెచ్చిన ప్రాముఖ్యతని ఆసరాగా చేసుకొని ఉత్పత్తి శక్తి కులాల ను

అధికంగా సాక్ష్య చెప్పినారు, ఇది సరళమైన పరిరూపమైన పేదల జీవితాలకు ఘాతకమయ్యింది. ఫలితంగా మరాఠా లలో రెండు ప్రత్యేక వర్గాల మధ్య అగాధం ఏర్పడింది.

"శివాజీ రాజకీయ విజయం ఆ విజయం యొక్క ప్రధాన పునాదినే కూల్చివేసింది. శివాజీ స్వరాజ్యం సనాతన వేదాంతాల పై ఎంతగా ఆధారపడిందో అంతగానే అది దానిలో దాని మరణబీజాలను కూడా నాటి ఉంది."

— జదునాథ్ సర్కార్.

6) శివాజీ సాధించిన రాజకీయ స్వాతంత్ర్యం వలన మహారాష్ట్ర మొత్తంగా లాభపడినా దాని ప్రజలను విద్యావంతులను చెయ్యడానికి మరియు వారి తెలివి వ్యక్తిత్వాన్ని పెంపొందించుటకి ఏ విధమైన బాగా ఆలోచించినట్టి, వ్యవస్థీకృతమైన ప్రయత్నం చేయబడ లేదు. సాధారణ ప్రజ ఎప్పటిలాగానే లేదా అమాయకంగా ఉండి తమ పాలి అదృష్టంతో వారు సంతృప్తిచెందారు ఏ యత్నమూ చెయ్యలేదు. ఈ విధమైన మరాఠా రాజ మౌలిక వైఫల్యం ఫలితంగానే శివాజీ తెలివితేటలు, నిరంతర శ్రమ

ఫలితం గా నిర్మించబడ్డ మరాఠా రాజ్యం దాని స్థాపకుని మరణానంతరం పది సంవత్సరాలకే కూలి పోయింది.

ఈ కాలమంతా అతడు నిర్వహించవలసిన సమర్థ సంఖ్య కూడ అది నియమాల్లలో ~~తగ్గిపోయింది~~ స్థిరంగా వచ్చింది. రికార్డులలో ఈ వసూళ్ళు సంవత్సరానికి 3/12 వంతు మాత్రమే ఉండేవి. ఈ పరిణామమంతా జాగీర్దారు బలం, ప్రభావం తగ్గించాయి. జాగీర్దార్ యొక్క సైనిక బలం బీటలు వారిన కాలమంతా ~~రైతు~~ జాగీర్దార్-జమీందార్-రైతు త్రికోణిక బంధం ~~తెగిపోయి~~ మొఘలుల సామ్రాజ్యపతనానికి దారితీసింది.

ప్రాంతాల పరంగా కేంద్రీకృతమైన దృక్పథం:

ముజఫర్ ఆలమ్, చేతన్ సింగ్ పండితులు మొగల్ క్షీణతను ప్రాంతాల పరంగా కేంద్రీకృతమైన దృక్పథాన్ని ప్రతిపాదించారు. ముజఫర్ ఆలమ్ ~~మొ~~ మొగల్ సుబా అయిన అవధ్, పంజాబ్ ల గురించి అధ్యయనం (1986) చేయగా చేతన్ సింగ్ ~~పంజాబ్~~ 17వ శతాబ్ది కాలంలోని పంజాబ్ పరిస్థితుల లోతుగా అధ్యయనం (1991) చేశారు. ~~ఈ~~ ఈ అధ్యయనాల ~~ద్వారా~~ మొగల్ సామ్రాజ్య స్వభావాన్ని, 17, 18 శతాబ్దాలలో అది బలహీనపడుతూ వచ్చి, చివరకు ఎలా క్షీణించి పోయినది అనే అంశాలపై దృష్టి సారించాయి.

~~ముజఫర్ ఆలమ్~~ మొగల్ సామ్రాజ్యం వైరుధ్యాలను ~~తో~~ సమీక్షలు (...

తొలి తరం

(1) విలియం ఇర్విన్ & జదునాథ్ సర్కార్ → ఔరంగజేబు

(2) సతీష్ చంద్ర → జాగీర్దారీ, మన్సబ్దారీ వ్యవస్థల నిర్వహణలో మొగలుల వైఫల్యం.

(3) ~~అథార్ అలీ~~ "The Mughal Nobility under Aurangzeb" → దక్కను రాజ్యాల్ని గెలవడం వల్ల మొగలు సేవల్లో అమీర్ల పెరుగుదల - జాగీరుల కొరత

మలి తరం

(4) ఇర్ఫాన్ హబీబ్ "The Agrarian system of Mughal India" → ఆదాయం-వసూలు విధానం లోని లోపాలు - రైతుల్ని పీడించడం - రైతుల తిరుగుబాట్లు

పియర్సన్ → Patronage తగ్గిపోవడం

(5) అథార్ అలీ - 1970 నుండి ప్రాంతీయ ఆధారాల అధ్యయనం ద్వారా జాగీర్దారీ సంక్షోభం జాగీరుల కొరత (బేజాగీరి) వల్ల కాదని పాలనా చర్యల వల్ల తలెత్తిందని - ఉత్తమ జాగీర్ని ఖాలిసా గా ఉంచడం వల్లనే తలెత్తిందని...

(6) సతీష్ చంద్ర - జాగీరు వ్యవస్థ తన విధిని నిర్వర్తించలేకపోవడం వల్లనే... జాగీర్దార్ - జమీం - రైతు

add only this part

(7) ముజఫర్ ఆలం & చేతన్ సింగ్ → ప్రాంతీయ పరంగా ~~[illegible]~~ పరిశీలించే దృక్పథం

↓

అవధ్ లో క్షీణతకి

జమీం, జాగీర్దార్లు, మదదె మాష్, షేఖ్జాదాల ని అదుపులో పెట్టలేకపోవడం, వారి మధ్య తగాదాల పరిష్కరించే విధి నిర్వహణలో వైఫల్యం కారణాలని ఆలం...

చేతన్ సింగ్

పంజాబ్ లో ఆర్థిక వ్యవస్థ బాగా మెరుగుపడింది → నదీ రవాణా ↓ → భూ రవాణా ↓ → తిరుగుబాట్లు / రాజకీయ కలహాలు పెరిగాయి

ఒక్కో ప్రాంతానికి ఒక్కో నిర్దిష్ట కారణం ఉండొచ్చు---

Topic **పల్లవి. ఆకులారి** Page no:

# Chapter : 20 Akbar

## His Rajput Policy

### అక్బరు రాజపుత్ర విధానము:

అక్బరు గొప్ప యుద్ధవీరుడేగాక, విజ్ఞుడైన మహా రాజనీతి ధురంధరుడు. తన రాజ్యంలో అధికసంఖ్యాకులైన హిందూ(ప్ర)జల ప్రేమాభిమానాలు పొందనిదే, అందునా బలవంతులైన రాజపుత్రుల సమన్వయసహకారము లభించనిదే, తాను స్థాపించిన సువిశాల మొగలు సామ్రాజ్యము మనజాలదని గ్రహించిన కుశాగ్రబుద్ధి. అక్బరు రాజపుత్రవిధానాన్ని అతని వ్యక్తిగత మత విశ్వాసాలు ఆధారమని కొందరు భావించగా కొందరు / ఐరోపా (చరిత్రకారులు) పండితులు మాత్రం దీన్ని [struck out] అన్ని కోణాల నుండి చూస్తారు.

1) అక్బరు కొలువునందున్న సూఫీమత పెద్దలు, ఆస్థానులు, అతని బద్ధ విరోధులు, వీటిపై వ్యక్తిగా ఆధారపడటం అనేది ప్రమాదకరము.

2) తన బంధువర్గము, అమీరులు ఎప్పుడూ తన శ్రేయస్సును కోరినవారు కారు. అధికార కాంక్షాపరులై అపాయకరమయ్యేరు. తండ్రి లాంటి బైరాంఖాన్, కామ్రాన్ కొడుకు అబ్దుల్ ఖాసిం ను ఢిల్లీ చక్రవర్తి చేయాలని కుట్రలు పన్నుతుండగా అక్బరు క్రీ.శ. 1560 లో అతన్ని కొలువు నుండి తొలగించెను. మాల్వా విజయానికి కారకుడైన ఆదమ్‌ఖాన్, రెండవ పానిపట్టుయుద్ధంలో

ప్రాధాన్యత వహించిన కాన్ జహాన్, ఇంకా ఉద్వేగ, రుష్ ఖాన్ వెంట సేనలు అక్బరు పై తిరుగుబాటు చేయు చుండిరి. ఇటువంటి పరిస్థితులలో విశ్వాసపాత్రులు, ధైర్యసాహసాలు గల రాజపుత్రుల అండదండలు కావలసినవి.

3) తన ధ్యేయమైన 'అఖండ భారత మొగలు సామ్రాజ్య' నిర్మాణం లో రాజపుత్రుల సేవలు వినియోగించుకోవచ్చు.

4) భౌగోళికంగా రాజపుతానా వ్యూహాత్మక స్థానంలో ఉంది. వాణిజ్యపరంగా రాజస్థాను గంగామైదానాన్ని పశ్చిమ తీరంతో కలుపుతుంది. మార్వార్ రాజకీయంగా ప్రాధాన్యత గలది.

5) రాజపుత్ర రాజ్యాలు పరస్పర కలహాలతో ఉన్నాయి. ఈ బలహీనతను సద్వినియోగం చేసుకుంటే మొగలు సామ్రాజ్యాన్ని సులభంగా విస్తరించవచ్చు.

6) రాజపుత్రులతో సంబంధాలు తన రాజ్యాధికారానికి విధేయత ని పొందిన స్థిరమైన ఆదాయం సంపాదించి పెడుతుంది.

"అక్బరు రాజపుత్ర విధానము వివేకవంతమైనదే కుటిలమైన ఆలోచన కాదు. వారి ధైర్య సాహసాలు, దయార్ద్ర హృదయము, దేశభక్తి గౌరవించి ప్రదర్శించిన ఔదార్యము కాదు. వారి ప్రతిభను, ప్రాయశీలతను, స్వామిభక్తి ని గుర్తించి బుద్ధిపూర్వకంగా అనుసరించిన మనోవిజ్ఞానము గల స్వార్థపరత్వము"

అని డాక్టర్ శ్రీవాస్తవ అనినది నిజమే.

అక్బరు రాజపుత్ర విధాన పరిణామాన్ని మూడు దశలుగా చెప్పవచ్చు.

తొలి దశ: క్రీ.శ. 1572 వరకూ ఉన్న ఈ కాలంలో రాజపుత్రులు 'విధేయులైన మిత్రులు'గా చూడబడ్డారు. తమ రాజ్యం, దాని పరిసర ప్రాంతాలలో వీరు అక్బరుకు సైనిక సాయం చేయాలి. ఇతర, బయటి ప్రాంతాలలో చేయనవసరం లేదు. ఉదాహరణకు రాజా భార్మల్, భగవంత్ దాసులు ఉజ్బెక్ తిరుగుబాట్లలో అక్బరుకు సాయం చేసారు, ఇతర యుద్ధాలప్పుడు ఇంత విస్తృతంగా పాల్గొనలేదు. అలాగే మాన్‌సింగ చక్రవర్తి సేనలో సదా ఉన్నా చిత్తోర కోట ముట్టడిలో ముఖ్యపాత్ర వహించాల్సిన అవసరం లేదు.

క్రీ.శ. 1557 లోనే రాజపుత్రులు అక్బరు అభిమానాన్ని చూరగొన్నారు. అంబర రాజు భార్మల్ తన విధేయతను వ్యక్తిగతంగా ప్రదర్శించి తన కూతుర్నిచ్చి వివాహం చేశాడు. భార్మల్ కొడుకు భగవాన్ దాస్, మనవడు మానసింగ కు అక్బర్ తన కొలువులో ఉన్నత పదవులిచ్చాడు.

"ఈ వివాహాలు హిందూదేశ రాజకీయాలలో నూతన అధ్యాయమును ప్రారంభించెను"

— ఆచార్య బేణి ప్రసాద్.

అంతకు ముందు జరిగిన వివాహాలు స్థిర సంబంధాలేమి సాధించలేదు. కానీ అక్బరు భార్మల్ కుటుంబీయులతో

స్థిర సంబంధాలు కొనసాగించడం అతని రాజపుత్ర విధాన ప్రత్యేకత.

అక్బరు దండయాత్రలలో పైరులు పండే పొలాలపై ధ్వంసం చేయరాదు, కోట్ల విలువ చేసే తీర్థయాత్రల పన్ను రద్దు, తిరిగి 1564 లో జిజియా కూడా రద్దు చేసినా రాజపుత్రులతో సంబంధాలు బలపడింది మాత్రం 1568 లో చిత్తోర పతనం తర్వాతనే. క్రీ.శ. 1570 లో బికనీర్, జైసల్మేర్, జోధపూర్ రాజులు వ్యక్తిగతంగా లొంగిపోయి తమ కుమార్తెలనిచ్చి వివాహాలు చేశారు. వారందరికీ అక్బరు రాజ్యాన్ని తిరిగి ఇచ్చి, వారిని సామ్రాజ్య సేవలో నియోగించాడు. అక్బరు ఈ వివాహాల్ని బలవంతంగా రుద్దలేదు, వాటిని విధేయతకు గుర్తుగానూ చూడలేదు. పరిస్థితులను బట్టి, వీటి వలన ప్రయోజనాన్ని ఆశించి ఆయా రాజులే జరిపించిన వివాహాలుగా ఇవి కన్పిస్తాయి.

<u>రెండవ దశ:</u>

క్రీ.శ. 1572 లో జరిగిన గుజరాతు దండయాత్రతో రెండవదశ మొదలైంది. ఈ కాలంలో 'విధేయులైన సామంతులు' గా ఉండడమే గాక రాజపుత్రులు మొగలు సామ్రాజ్య సైనిక శక్తి గా ఎదిగారు. ఉదాహరణకు అక్బరు మానసింగ్ ను షేర్ఖాన్ ఫులాడి ని పట్టుకొడానికి నియమించాడు. ఈ విధానం కచ్ఛవహా రాజపుత్రులకే పరిమితం చేయలేదు. బికనీరు కి చెందిన రాయ్ రాయ్ సింగ్ ను జోధపూర్, సిరోహి లను రాణా దాడుల నుండి కాపాడగా నియమించాడు. క్రీ.శ. 1576 లో

రాణా ప్రతాప్ కు వ్యతిరేకంగా మొగలు సేనకు మాన్‌సింగ్ నాయకత్వం వహించబడంలో ఈ విధానం మరింత బలపడింది.

ఈ దశలో రాజపుత్ర సైనికులు కూడా అధికంగా చేర్చుకోబడటం, వారికి మొదటిసారిగా నిర్దిష్ట జీతాలు నిర్ణయించబడటం జరిగింది.

మేవాడ రాణా అక్బరు 'వ్యక్తిగత లొంగుబాటు' సూత్రాన్ని అంగీకరించలేదు. అక్బరు ఈ సూత్రం పై పట్టు వదలలేదు. యుద్ధ పరిణామాల్లో మేవాడ్ సరిహద్దు రాజ్యాలన్నీ అక్బరు కు లొంగిపోయి వివాహ సంబంధాలు ఏర్పరచుకున్నాయి. రాణా పట్టం లేని బుంది, మార్వారు కూడా అధీనం చేసుకోబడ్డాయి.

ఈ రెండవ దశలో రాణా శత్రువులకు పెద్ద దెబ్బ తగిలింది. రాజపుత్రులు మొగలు పక్షీయుల స్థాయి నుంచి అనుయాయులుగా సహాయకులుగా ఎదిగారు.

మూడవ దశ:

ఈ దశలో అక్బరు రాజపుత్ర విధానం పూర్తిగా వృద్ధి చెందింది. విధేయులైన పాలకులు, సైనిక శక్తి అయిన రాజపుత్రులు ఇకపై రాజ్య భాగస్వాములు, రాజ ప్రముఖుల్లో ఇతరులకు, ముఖ్యంగా తురానీలకు వ్యతిరేకంగా తమ ప్రాబల్యాన్ని పెంచుకున్నారు.

రాజపుత్రులకు 'పాలనా బాధ్యతలు' అప్పగించటం అనే నూతన విధానం ద్వారా అక్బరు తన రాజపుత్ర విధానాన్ని పరాకాష్ఠకు చేర్చాడు. క్రీ.శ. 1583 లో భగవంతసింగ్ లాహోరు గవర్నరుగా ఉన్నాడు. క్రీ.శ. 1585-86 ప్రాంతంలో రాజపుత్రుల్ని

లాహోరు, కాబూల్, ఆగ్రా, అజ్మీరలకు సంయుక్త-గవర్నర్లు
గా నియమించాడు. వారిని ఫౌజుదార్లుగా, కోటల
కమాండర్లు గా నియమించాడు. మాన్‌సింగ్ కు 7000
మన్సబ్‌దార్ హోదా ఇచ్చాడు. క్రీ.శ. 1590-91
లో బికనీర్ రాయ్‌రాయసింగ్‌ను లాహోరు గవర్నరు చేశాడు.
అతని కొడుకు సూరజ్ గుజరాత్ గవర్నరుగా వ్యవహరించాడు.
మొత్తం మీద అక్బరు కాలంలో కచ్చావహా రాజపుత్రులదే
అధిక ప్రాబల్యం, అధిక సంఖ్య.

<u>అక్బరు రాజపుత్ర విధానంలోని మరికొన్ని ముఖ్యాంశాలు:</u>

1) అక్బరు రాజపుత్ర వంశ కుటుంబాలతో దగ్గరి సంబంధాలు
ఏర్పరుచుకోవాలని తలచాడు. క్రీ.శ. 1580 లో భగవంత్ దాస్
కూతుర్ని రాకుమారుడు సలీం కిచ్చి చేశారు. క్రీ.శ. 1583
లో మోటా రాజా ఉదయ్ సింగ్ కు జోధ్‌పూర్ ఇచ్చి
అతని కూతుర్ని సలీం కిచ్చారు. కల్యాణ్ సింగ్
(బికనీర్), రావల్ సింగ్ భీమ్ (జైసల్మేర్)ల
కూతుళ్లని కూడా సలీం కిచ్చి చేశారు. జోధ్‌పూర్
రాయ్‌మల్ కూతుర్ని రాకుమారుడు దానియాల్ కిచ్చి చేశారు.
<u>ఈ పెళ్లిళ్ల ద్వారా అక్బరు తన వారసులైన చక్రవర్తి
అక్బర్ రాజపుత్రులతో దగ్గరి సంబంధాలు కలిగి ఉండేటట్లు
కోరుకున్నట్లు అర్థమౌతుంది.</u>

* వారు తమ విదేశాంగ విధానాన్ని అక్బరుకు దక్కలు పరచాలి. పరస్పర వివాదాల్ని యుద్ధం ద్వారా పరిష్కరించుకోరాదు.

* అవసరమైనప్పుడు సైన్యం నిర్దిష్ట సైనికులతో పంపాలి.

13) రాజపుత్రులకు, సామంతులకు మధ్య వారధి నిర్మించడానికి అక్బర్ వివాహాల్ని వాడుకున్నాడు. ఈ వివాహాల వలన విషయం మొగలుల భార్యలైనందున వారు చక్రవర్తి కుటుంబంతో దగ్గర సంబంధాలు ఏర్పడి తన వారిని గౌరవంగా చూస్తారు.

అయితే ఈ వివాహ విధానం అక్బరు ఆవిష్కరణేమీ కాదు. ప్రపంచ రాజకీయాల్లో తరతరాలుగా ఇది భాగమే. అక్బరు దాన్ని సాధనంగా విధానం లో భారత రాజకీయాల్లో సరికొత్త యుగం మొదలయింది. నాలుగు తరాల పాటు రాజపుత్ర యోధుల సేవలు మొగలు చక్రవర్తులు అందుకున్నారు.

ఆచార్య త్రిపాఠి అభిప్రాయంలో అక్బరు సాధారణ విధానంలో వివాహ సంబంధాలు ఒక భాగంగా చూడటానికి చారిత్రక ఆధారాలేవీ లేవన్నారు. (వాటిని అక్బరు నిర్దాక్షిణ్యంగా ఏమీలు పట్టినట్లుగా గాని, అట్టి సంబంధాలకు వ్యతిరేకంగా గొప్ప రాజపుత్ర వ్యతిరేకత, నిరసన వెల్లువైనట్లు గా గాని)

ఈ వివాహ సంబంధాల్లో రాజపుత్రులకు (11)
పూర్తి స్వేచ్ఛ ఉండేది. అయితే ఆచార్య ఈశ్వరీ ప్రసాద్ మాత్రం ఈ వివాహాలు ఏకపక్షంగా ఉన్నాయని, తరచుగా ఇవి ఇష్టపూర్వకంగా గాక పరిస్థితులు కల్పించిన అవసరాల దృష్ట్యా చేయబడ్డాయని వెల్లడించారు.

అక్బరు రాజపుత్ర విధానం వల్ల ఫలితాలు : Read from Guide Page: 54

అక్బరు రాజపుత్ర విధానాన్ని సమకాలీన, తరువాతి చరిత్రకారులు మెచ్చుకున్నారు. అయితే సమకాలికుల్లో బదౌని, ఆధునికుల్లో ఘోరీ ల బీర్ విమర్శించారు. మొగలు సామ్రాజ్య పతనాన్ని అక్బరు రాజపుత్ర విధానం త్వరితపరిచిందని చెప్పారు. ఈ విమర్శలు పక్షపాతంగా ఉన్నాయి. రాజపుత్ర విధానం మొగలులకు, రాజపుత్రులకు కలకాలం పాటు మేలు చేసింది.

రాజపుత్రుల స్నేహం సహకారాలు మొగలు సామ్రాజ్యానికి అవసరమైన భద్రతని, స్థిరత్వాన్ని అందించాయి. ప్రభుత్వ కార్యాలయాల్లో చురుగ్గా పాల్గొనడం ద్వారా రాజపుత్రులు ఆర్థిక, సాంస్కృతిక పురోభివృద్ధికి తోడ్పడ్డారు. హిందూ-ముస్లిం సంస్కృతుల సమ్మేళనానికి తోడ్పడం చేశారు.

రాజపుత్రులకు ఈ విధానం వారి ప్రాంతాల్లో శాంతి నెలకొంది. అంతరంగిక స్వాతంత్ర్యం అనుభవించారు. మత స్వాతంత్ర్యం పొంది వారి దేవాలయాలు కట్టుకున్నారు. వారి ఆచారసంప్రదాయాల్ని పాటించేవారు. సాధారణంగా వారి వారసత్వ హక్కులు గౌరవించబడ్డాయి. రాజపుత్రులకు, మొగలులకు కలిగిన ఈ ప్రయోజనాల కారణంగా అక్బరు విజయవంతమైనదిగా చెప్పవచ్చు.

## అక్బరు రాజపుత్రవిధానం పై "అంచనా":

రాజపుత్రులతో అక్బరు సంబంధాలు రాజకీయ సర్దుబాటుగా ఆరంభమైనప్పటికీ తర్వాత అవి హిందూ-ముస్లిం ల మధ్య దగ్గర సంబంధాలు ఏర్పడటానికి, ఆ తర్వాత దీని ద్వారా మతాలన్నింటి పట్ల అందరిపట్ల ఉదార మతసహన విధానాన్ని అవలంబించటానికి ఒక సాధనం అయింది. ఈ సమయంలో 'న్యాయం' ఒక ముఖ్యాంశంగా వృద్ధి చెందింది. కుల, మత, జాతి లేదా తెగ వంటి వ్యత్యాసాలు లేకుండా అందరికీ న్యాయం అందాలని, అందించాలని భావం ప్రబలింది. అందువల్ల మొగలు - రాజపుత్ర సంబంధాలు ఒక తారాశగా, వర్గరహిత రాజ్య ఆవిర్భావానికి నాంది గా తలచారు.

అయితే సిసోధియా, రాజకీయ వాస్తవాలు మరో విధంగా ఉన్నాయి. రాజపుత్రులు తమ సిసోధియా, మేవారాంల పట్ల సామంతులుగా ఉన్నారు. అక్బరు 'దీన్ ఇలాహీ' లో చేరడానికి నిరాకరించారు. అక్బరు 'సతి' ని పూర్తిగా సమర్థించలేదు. రాజపుత్రులెప్పటికీ మొగలు ప్రభువుల కింద సామంతులే. ఉపయోగాలు ఉన్నప్పటికీ, అక్బరు ఉదార రాజకీయ విధానం తమ ప్రయోజనాలకు ముప్పుగా భావించారు

వారి వ్యతిరేకతను మొగలు - రాజపుత్ర సంబంధాల్ని బలపర్చడం, (13)
శక్తివంతమైన వర్గరహిత ఉద్యమాల ద్వారా ఎదుర్కోబడింది. రెండు
ఉద్యమాలు ప్రాంతీయం కావడం, మొగలు - రాజపుత్ర సంబంధాలను
సాంఘిక ఉద్యమాలు రక్షణలు లేకపోవడం వలన అవి దెబ్బతిని నాశనమయ్యాయి.

బాబరు ఢిల్లీ సింహాసనం అధిష్టించాడు. తనను ఎదిరించిన (15)
సంగా రాణా నాయకత్వంలోని రాజపుత్రులందరిని కాన్వా యుద్ధంలో (1527)
ఓడించాడు.

మొత్తం మీద బాబరు రాజపుత్రుల మీద కన్నా ఆఫ్ఘను ముప్పు మీద దృష్టి పెట్టాడు. బయానా, ధోల్‌పూర్, గ్వాలియర్ లను తన అధీనంలోకి తెచ్చుకున్నాడు. మేవాట్, మాల్వా లను చందేరి స్వాధీనపర్చుకున్నాడు. ఏమైనా బాబరు కాలంలో మొగలుల రాజపుత్రులతో నిర్దిష్టంగా, ధనాత్మక (సానుకూల) సూత్రాలపై సంబంధాలు పెంపొందలేదు. అది రాజకీయ అవసరాల పర్యవసానంగా చెప్పవచ్చు.

2) హుమాయూన్ (1530-40 & 1555-56): గుజరాతు పాలకుడు బహదూర్ షా చిత్తోర్ ఆక్రమణ సాగించాడు. మాల్వా, రాజస్థాన్లలో అతని బలం పెరగడం అనవసర ప్రమాదమని తెలిసినా ఆఫ్ఘను ముప్పు తప్పే వరకు అతని పట్ల తటస్థంగా ఉన్నాడు, దాంతో రాజపుత్రులకు (దూరమయ్యాడు.) దగ్గరయ్యే అవకాశం కోల్పోయాడు. చిత్తోర్ రాణి కర్ణావతి హుమాయూన్ ను సాయమర్థించగా కష్టమైన అతను బహదూర్ షా కి వ్యతిరేకంగా సాయం అందించడం మత విరుద్ధమని సాయం చేయలేదు. ఈ ఉదాసీనత వలన హుమాయూన్ రాజపుత్రులని నిరాశ పర్చాడు.

బాబరు, హుమాయూన్ల రాజపుత్ర విధానాన్ని వారు ఎదుర్కొన్న ఆఫ్ఘను సమస్య నేపథ్యంలో చూడాలి. ఇది వారికి రాజపుత్రులతో స్నేహ సంబంధాలు ఏర్పడనీయలేదు.

హుమాయూన్ ను పదవీభ్రష్టుని చేసి ఢిల్లీ సింహాసనం ఆక్రమించిన షేర్షా రాజపుత్రులను ఓడించి తన అధికారాన్ని సుస్థిరపరచుకున్నాడు.

అక్బరు : 1556 – 1605 (read from earlier essay)

(1605 – 1627)
జహాంగీరు: ఇతను సాధించిన గొప్ప విజయం (రాజపుత్రులతో) i.e. మేవాడ్ తో యుద్ధాన్ని అంతం చేయడం. జహాంగీరు అక్బరులాగా 'వ్యక్తిగత లాంఛనాలు' మీద పట్టుదలగా వ్యవహరించాడు. రాణా అమర్ చేసిన వందనాన్ని, మర్యాదని అంగీకరించాడు. అక్బర్ కాలం నుంచి ఆక్రమించుకున్న ప్రాంతాలన్నీ రాణా కి తిరిగి ఇచ్చివేశాడు. రాణా అమర్ కూడా మన్సబ్ ను, జాగీరు ను ఇచ్చాడు. రాణా విషయంలో ఆస్థానానికి వ్యక్తిగతంగా హాజరవ్వడం, సామ్రాజ్యానికి సేవ చేయడంలో మినహాయింపునిచ్చాడు. అంతేకాక రాణా అమర్ గాని, సోదరుడు గాని ఆ విధి నిర్వహించాల్సి ఉంటుంది. జహాంగీరు రాణా పై వివాహసంబంధాన్ని బలవంతంగా రుద్దడం కూడా చేయలేదు. బలియమైన చిత్తోర్ కోట ను మాత్రం మరమ్మతులు చేయరాదని ఒప్పందం కుదిరింది.

జహాంగీరు అక్బరు వివాహసంబంధ విధానాన్ని అనుసరించాడు. తాను రాకుమారుని గా అక్బరు కాలం లో అనేక రాజపుత్ర రాకుమార్తెలతో

అంబర [భగవంత దాస కూతుర్ని], జోధపూర, బికనీర, (17)
జైసల్మేర మొ॥ ఇందులో ముఖ్యమైనవి. అయితే చక్రవర్తి
అక్బర్ కూడా ఎన్నో వివాహసంబంధాలు ఏర్పరచుకున్నాడు.
పాలిలో రామచంద బుందేలా కూతురు, మానసింగ్ మనవరాలు
కూడా ఉన్నారు. అయితే ఈ వివాహాలన్నీ మేవాడ్ తో
పోరాటం జరుగుతున్న కాలంలో జరిగినవి. ఒక్కసారి చిత్తూర
లొంగిపోయాక, రాజపుత్రులతో సంబంధం ఒక స్థిరత్వాన్ని పొందాక
మొగలులకు - రాజపుత్రులకు మధ్య వివాహాలు అరుదయ్యాయి.
అయినప్పటికీ ఈ వివాహాలు చాలా వరకు నిర్దిష్ట రాజకీయ ధ్యేయం
కోసమే జరిగినవని తెలుపవచ్చు. ఏమైనా ఈ వివాహాలు మొగలులకు
రాజపుత్రులకు మధ్య సత్సంబంధాలను నెలకొల్పడానికి ఎంతో కొంత
కారణమయ్యాయి.

జహాంగీరు పాలనా కాలంలో మేవార,
మార్వార, అంబర మరియు బికనీరు పాలకులైన రాజపుత్రరాజులకు
కూడా 5000 లకు పైబడి హోదా గల మన్సబులను ఇచ్చాడు. రాజపుత్ర
ప్రముఖులలో 'కచ్చావాహాల' ప్రాబల్యం తగ్గింది. అక్బరు
కాలంలో ఉన్న రాజపుత్ర రాజ్య రాజులకు ఇతర కాలంలో ఎక్కువ
హోదా గల మన్సబులు అందాయి. జహాంగీరు పాలన లోని
దర్బారులో ఖుస్రవ తిరుగుబాటు తర్వాత రాజపుత్రులకిచ్చిన
మన్సబుల సంఖ్య చాలా తగ్గిపోయింది. జహాంగీరు పాలనా కాలంలో
ఇచ్చిన మన్సబులు, పదవులను గమనిస్తే అవి జాతి, తెగ, కులం
మొ॥ వాటి ఆధారంగా ఇవ్వబడ్డట్లు తెలుస్తుంది. రాజపుత్రులను
ప్రధానంగా కిలాదార్లు లేదా ఫౌజుదార్లు గా నియమించారు.

అయితే ఈ వర్గ, జాతి ఆధారంగా పదవులివ్వడమన్నది మరో అప్రధాన సూత్రమేమీ కాదు, మూలాధారమైనది కాదు, జహంగీరు ఉదార స్వభావమే అందుకు కారణం.

షాజహాను : (1628 - 1656)

ఇతని పాలనా కాలం లో రాజపుత్రులకు ముఖ్య అధికారాలు, ఎక్కువ హోదాలు మన్సబులు ఇచ్చారు. దీన్ని బట్టి షాజహాను రాజపుత్రుల్ని విశ్వసించాడని అందుకే ముఖ్య బాధ్యతలు అప్పగించాడని తెలుస్తోంది. జహంగీరు ముఖ్య రాజపుత్ర నాయకులకు కూడా సుబేదారి ఇవ్వరాదన్న విధానాన్ని మాత్రం షాజహాను అనుసరించలేదు. అయితే షాజహాను ఇచ్చిన సుబేదారీల సంఖ్య కూడా చాలా తక్కువే. రాజపుత్రులకు కిలేదార్లు, ఫౌజుదార్లు వంటి పదవుల్ని ఇవ్వడం కొనసాగింది. కులం, జాతి మొ॥ వాటి ఆధారంగా సైన్య, సైనిక పదవుల్లో తేడాలు చూపడం కొనసాగింది.

జహంగీరు, షాజహాను పాలనా కాలంలో రాజపుత్రులు విధేయులుగా కొనసాగారు కానీ పాలన లో వారి పాత్ర తగ్గిపోయింది.

షాజహాను కాలంలో బుందేలులు, మేవాడులు లో వివాదాలు చెలరేగాయి. ఈ రాజపుత్రులు సంస్థానాధికారులు వారే తమ విరుగు వారిపై భూముల కోసం, ధనం కోసం సిద్ధాంతాల్ని తమ సామంతులై మొఘలుల దారికి రాని తిరుగుబాటు చేయగల రాజ్యాలపై సైనిక దాడులు చేస్తున్నారు.

అయితే చక్రవర్తి గా మొఘలులు వీటిని

ఔరంగజేబు రాజపుత్ర విధానం కూడా

I M P
మొగల్ సామ్రాజ్య పతనానికి కారణం కాదు. అయితే పతనానికి
దారి తీసిన అనేక కారణాలలో ఇదొక ముఖ్య కారణమని చెప్పవచ్చు.

అక్బరు రాజపుత్రుల మైత్రి చేసుకొని వారి

I M P
సాయంతోనే తన సామ్రాజ్య విస్తరించి సుస్థిర పరచాడు. కాని
ఔరంగజేబు అనవసర అనుమానాలు, మత సంకుచితత్వాల తో
రాజపుత్రుల సామంతులలో తెల్పాయి (వారిలో చాలా మందిని) దూరం చేసుకున్నాడు.

జేబు రాజపుత్రులపై నమ్మకం ఉంచలేదు. మార్వార్

I M P
వారసుణ్ణి మహమ్మదీయుని గా మార్చి విలువలేని పని చేశాడు.
దాంతో ఈ రాజపుత్రులు మొగల్ చక్రవర్తి అధికారానికి
వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. రాథోర్లు, సిసోడియాలు మొగల్
సామ్రాజ్యం పతనమయ్యేదాకా తిరుగుబాట్లు చేస్తూనే ఉన్నారు. వీళ్ల
ఉదాహరణగానే తర్వాత బుందేలు, ఆ పిదప సిక్కులు అనుసరించారు.

మొగల్ సామ్రాజ్య భవనంలో లోతు పగుళ్ల
క్రీ.శ. 1679-80 లో జోధ్‌పూర్ (రాథోడులు) రాజపుత్రులు దుర్గాదాస్
రాథోర్ నాయకత్వం లో స్వాతంత్ర్య పోరాటం ప్రారంభించడంతో
కలిగాయి. వెంటనే మేవాడ్ సిసోడియాలు వారితో చేతులు
కలిపారు. మొగల్ సేనలు లాంఛనంగా వారిని అణచివేయడం
అది రాజపుత్రుల ఐక్య బలాన్ని అణచడానికి బదులుగా మొత్తం
రాజపుతానా నంతటిని జాగృతం చేసింది. ఇది ఎంత తీవ్రంగా
జరిగిందంటే ఔరంగజేబు ద్వారా రాజపుత్రుల అణచివేయడానికి

# Chapter : 20 Akbar

## Court Patronage of Art and Technology

కళలకు అక్బరు ఆస్థానం అందించిన ఆదరణ :

1) చిత్రకళ } read from essays.
2) సంగీతం }

3) అందమైన వ్రాలు :

అక్బరుకు అక్షర జ్ఞానం లేకపోయినా అందమైన వ్రాలు మీద మంచి ఆసక్తి ఉంది. నాటి భారత దేశం లో అందమైన వ్రాలు కు విలువైన బహుమానాలు లభించేవి. అక్బరు చక్కని రాతగల కళాకారుల్ని నియమించి వారి చేత అతన గ్రంథాలయం లోకి ఉత్తమ గ్రంథ ప్రతులను సౌందర్యం ఉట్టిపడేలా రాయించుకునేవాడు. అక్బరు ఆస్థానం లో ఎనిమిది రకాల చేతివ్రాలు ఉండేవని అబుల్ ఫజుల్ తెలిపాడు. ఇందులో ఎనిమిదవ రకానికి చెందిన "నస్తలిక్" (Nastaliq) (అక్బరు చేత ప్రత్యేకంగా అభిమానించబడ్డది.) ను అక్బరు బాగా అభిమానించాడు. మహమ్మద్ హుస్సేన్ కాశ్మీరి అక్బరు ఆస్థానంలోని మంచి ప్రసిద్ధి గాంచిన వ్రాయసగాండు. ఇతనికి "జరిన్ కలమ్" (Zarin Qalam) అనే బిరుదు ఇవ్వబడింది.

అందమైన వ్రాలు తో దగ్గర సంబంధముండి మరో కళ పుస్తకాలను అందంగా కళాత్మకంగా జిల్దు (binding)

చేయడం. పిట్టల రెక్కలను మెత్తలా అలంకరించడం, మెత్తని రాళ్లలో బాటిక్ అద్దకం వేయడం, గ్రంథ విషయాలని ఉదాహరించే లేదా <u>వివరించే</u> చిత్రాలని అలంకరించటం మొదలైన చేసే చిత్రకారులు కూడా అక్బరు ఆదరించాడు. ఈ వివరణా చిత్రాలు గీసే వారు కూడా చిత్రకారులకు మిక్కిలి ఆదరింపబడేవారు.

## <u>వాస్తువు</u>:

అక్బరు హిందూ-ముస్లిం వాస్తు శైలుల సమ్మేళనాన్ని సృష్టించి తద్వారా జాతీయ భావాలను వాస్తు శిల్పానికి ప్రసాదం చేశాడు. అతడు పథకాలు రూపొందించేందుకు ఒక ప్రజా పనుల విభాగం ఏర్పాటు చేశాడు. అతని కాలంలో మూడు పెద్ద కోటలు కట్టబడ్డాయి — ఆగ్రా కోట, లాహోరు కోట, మరియు అలహాబాదు కోట.

ఆగ్రా కోట ను ఎర్రరాయి కోట మాదిరిగా కట్టారు. కోట లోపల దాదాపు 500 వందల భవనాలు ఎర్రరాయితో కట్టబడ్డాయి. వీటిలో అక్బరీ మహల్, జహాంగీరు మహల్ ముఖ్యమైనవి. జహాంగీరు మహల్ ఎంత హిందూశైలిలో ఉందంటే విమర్శకులు దీనిని కట్టడం చిత్తోర్, ఉదయ్‌పూర్ ల వెలుపల కనుక మాత్రమే కన్పిస్తుందన్నారు. ఆగ్రా కోట వంటి లాహోరు కోటలో అలంకరణాలు ఎక్కువగా ఉన్నాయి. ఇచట

హిందూ అలంకరణ శైలులు ఎంతో కళాత్మకంగా ఉన్నాయంటే నాటి వెలుగు ప్రసరించడం మంచి పరిమళ వాసనకై ఉండాలని నమ్మేవారంటారు. అలహాబాదు లోని "జనానా భవనం" (Zanana) ప్రత్యేక లక్షణంగా దానిపై నిర్మాణాలకు ప్రముఖంగా స్తంభాల పంక్తులు నిర్మాణం లో ఉండటాన్ని చెప్పవచ్చు.

అక్బరు వాస్తు అద్భుతంగా ఫతేపూర్ సిక్రీని చెప్పాలి. ఇక్కడ / ఈ నగరంలో మొగలు శైలిలో కోటలు నల్లరాతి శైలి కంటే ఎక్కువ. ఇందులో బెంగాలీ, గుజరాతీ శైలులలో ఎన్నో భవనాలు ఉన్నాయి. కోట లోపల దివాన్ ఇ ఖాస్, దివాన్ ఇ ఆమ్, పంచ మహల్, జోధ బాయి భవనాలు, బీర్బల్ గృహాలు మొదలైనవి ముఖ్యమైనవి. దివాన్ ఇ ఆమ్ లో పంచపాళీ / వసారా పైన ముందున్న చూసుకొచ్చే వరండా పైకప్పు విలక్షణ హిందూ రీతి. దివాన్ ఇ ఖాస్ దాని ప్రణాళిక, నిర్మాణం, మరియు అలంకరణలలో ప్రత్యేకంగా భాసిల్లుతున్నది. భారతీయ బౌద్ధ విహారాల ప్రణాళిక కు పోలికలుగా ఉండే పంచమహల్ ఐదు అంతస్తుల పిరమిడ్ ఆకార భవనం. జోధ బాయి భవనంలో హిందూ రీతి ప్రాబల్యంగా గలిగినది. బృందావనం లోని కృష్ణుని నాలుగు దేవాలయాల్లాగా బీర్బల్ గృహాలు విచిత్ర శైలి లో ఉంటుంది. గోడల

గోడల అలంకరణలో లేదా పైకప్పు కు చేసిన టైల్స్ అరబెస్క్ మెరిసే నీలపు టైల్స్ ను వాడటం

లో పర్షియన్ మరియు మధ్యఆసియా ప్రభావాన్ని చూడవచ్చు.
ఇక్కడ ~~[illegible]~~ జామి మసీదు దాటి పెద్ద ద్వారం - "బులంద్ దర్వాజా" లో ఉంటుంది. బులందర్వాజా ను పాలరాయి మరియు ఇసుకరాళ్ళ లో నిర్మించారు. ముఖద్వారాలలోకెల్లా ఇది సంపూర్ణ వాస్తు పరిపక్వత సిద్ధించిన నిర్మాణంగా ప్రసిద్ధి పొందింది. మసీదు లోపల షేక్ సలీం చిష్టి సమాధి తెల్లని పాలరాయి లో నిర్మించబడింది.

సికంద్రా లోని అక్బరు సమాధికి కూడా శిల్పశాస్త్రాలలోని ప్రకారం / పద్ధతిలో రూపొందించబడింది.

షేర్షా అక్బరు ఎన్నో సరాయిలు కట్టించటం, చెరువులు త్రవ్వించటం, ఎన్నో పాఠశాలలు - ప్రార్థనా మందిరాలు నిర్మించటం చేసాడు.

# సాంకేతిక పరిజ్ఞానం (Technology)

అక్బరు కాలం నాటి భారతదేశంలో పాశ్చాత్య యూరోప్; చైనా లలో పోల్చినప్పుడు సాంకేతిక పరిజ్ఞానం చాలా వెనుక బడి ఉంది. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన భారతీయుల వస్త్రాలను బహుళ-కండెలు గల చక్రాల సహాయం లేకుండానే ఉత్పత్తి చేసేవారు. ఇవి నాటికి చైనాలో వాడుకగా వాడేవారు. ఇటాలియన్ సిల్క్ పరిశ్రమలో ప్రఖ్యాతి చెందిన నీటిశక్తి తో నడిచే ఆధునిక మిల్లులు 200 కండెలు గలవి, భారత్ కు వీటి పరిచయమే లేదు.

భారతదేశ సముద్ర నౌకలకు దిక్సూచి (astrolabe) (గ్రహాల దూరాన్ని-దిక్కును తెలిపే యంత్రం-తప్ప మరే ఇతర నౌకా పరికరాలు ఉండేవి కావు.

మానవ శ్రమకు సాయం చేసే సమీపావసర పరికరాలైన "వీల్-బ్యారో" (Wheel-barrow) వంటి వాటి సాయం కూడా లేకుండానే బ్రహ్మాండమైన మొగలు భవనాలన్నీ నిర్మించారు.

భారతదేశానికి ఇంకా బొగ్గు ఉపయోగాలు తెలియవు. సరైన cast-iron కూడా తెలియదు. లోతుగా గనులు తవ్వే పద్ధతులు కూడా తెలియవు. రసాయన పరిశ్రమలు చాలా ప్రాథమికంగా ఉన్నాయి. ఈ విధమైన ఇంధన, లోహ, రసాయన సంబంధ వనరుల, పరిశ్రమల వెనుకబడి ఉండడం చేత చెప్పుకోదగ్గ సాంకేతిక పరిజ్ఞాన

వృద్ధి చెందలేదు. ఫలితంగా భారతదేశం ఎప్పుడూ సరైన గేర్ కట్టుబడిన మరమగ్గాలను కూడా ఉత్పత్తి చేయలేకపోయింది, కాని ఇవి యాంత్రికంగా అత్యంత ప్రాధాన్యత గలవి.

నాటి సాంకేతిక పరిజ్ఞానాలకు నీటిమిల్లు, నీటియంత్రం, గాలి యంత్రాలు ఇంకా సరిహద్దుల్లోనే ఉన్నాయి. భారత్ కు యూరోప్, చైనాలతో సంబంధాలు ఉన్నప్పటికీ ఎందుకో గాని ముద్రణాయంత్రాన్ని తెప్పించే ప్రయత్నం జరగలేదు.

యాంత్రిక ప్రక్రియ భాగాలు బాగా ఉన్నా, భారతీయ సాంకేతికత చాలా సరళమైనది లేదా ఫిరంగులు, చేతి తుపాకులు తయారు చేసే పద్ధతి మాత్రం సాంకేతికంగా బాగా వృద్ధి చెందినట్లు కన్పిస్తుంది. అక్బర్ ఆధారాలలో భారతదేశం 16 వ శతాబ్దంలో అత్యంత బలమైన ఫిరంగులను తయారు చేసింది. ఇవి కంచు (bronze) తో చేయబడేవి, మాలా "మాలిక్ మైదాన్" (ఇది దాదాపు 3.7 మీ॥ పొడవు గలది) బాగా ప్రసిద్ధి చెందింది. అయితే ఇవి సులభంగా కదిలించబడటానికి వీలు కాని కారణంగా తేలికపాటి ఇనుప ఫిరంగులను కూడా ఉత్పత్తి చేసేవారు. అయితే cast iron సాంకేతికత ఇంకా సరిగా వృద్ధి చెందనందున వీటన్నిటిని సాధారణంగా wrought iron తోనే తయారు చేసేవారు.



సామ్రాజ్యం లోపల ఔరంగజేబు క్లిష్టమైన రాజకీయ సమస్యల్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. దక్కను లో మరాఠాలు, ఉత్తర భారతం లో జాట్లు, రాజపుత్రులు ; వాయువ్యం లో ఆఫ్ఘన్లు, శిక్కులు ఇందులో ముఖ్యులు.

రాజపుత్రులది ప్రధానంగా వారసత్వ సమస్య. అయితే ఇది కూడా వారి అంతర్గత వ్యవహారాల్లో మొగలుల జోక్యానికి వ్యతిరేకంగా సాగింది. జాట్ల సమస్య రైతుల తిరుగుబాటు గా శిక్కుల ఉద్యమం మత పరంగా మొదలైనా రెండూ ప్రాంతీయ స్వతంత్ర రాజ్యస్థాపన యత్నాలుగా ముగిశాయి. ప్రత్యేక ఆఫ్ఘను రాజ్య స్థాపన యత్నాలు కూడా మొదలయ్యాయి.

ఆఫ్ఘన్ల తిరుగుబాటు వల్ల మొగలు పాలన కి వ్యతిరేకత, ప్రాంతీయ స్వాతంత్ర్యేచ్ఛ అన్నవి కేవలం తరగతులకే - జాట్లు, మరాఠాలు, శిక్కులు పరిమితం కాలేదని తెల్పుతుంది. అంతేగాక ఆఫ్ఘన్ల తిరుగుబాటు కీలక సమయం లో శివాజీ మీద ఔరంగజేబు ఒత్తిడి ని తగ్గించేందుకు తోడ్పడింది. అలాగే దక్కను లో మొగలులు ఫార్వర్డ్ విధానాన్ని అవలంబించడానికి పెద్ద ఆటంకం గా పరిణమించింది.

ఔరంగజేబు చక్రవర్తి అయ్యేనాటికి జస్వంత్ సింగ్, జైసింగ్ ఇద్దరూ 7000/7000 హోదా లో ఉన్నారు. జేబు రాజపుత్రులతో సత్సంబంధాలకి గొప్ప విలువ ఇచ్చాడు. మేవార్ మహారాణా మద్దతు కోసం ప్రయత్నించాడు, అతని మన్సబ్ ని 5000/5000 నుంచి 6000/6000 కి పెంచాడు. ధర్మత్ వద్ద జస్వంత్ సింగ్ తనతో యుద్ధం చేసినా షుజా కి వ్యతిరేకం గా చేసిన దండయాత్రలో జేబు పక్షం నుంచి ఫిరాయించినా, దారా ని తన భూభాగాలకి ఆహ్వానించినా ఔరంగజేబు అతన్ని మన్నించి అతనికి అతని పాత మన్సబ్ ని పునరుద్ధరించాడు. పైగా జస్వంత్ సింగ్ ని ముఖ్య పదవులకి నియమించాడు - గుజరాత్ గవర్నరు గా కూడా నియమించాడు. జైసింగ్ 1667 లో తను మరణించే వరకూ ఔరంగజేబు కు ఆప్త మిత్రుని గా నమ్మకస్థుని గా మెలిగాడు.

1678 లో జస్వంత్ సింగు మరణం తో అతనికి పుత్ర వారసులెవరూ లేకపోవడంతో 'గద్ది' వారసత్వ సమస్య వెంటనే తలెత్తింది. వారసత్వ సమస్య తలెత్తినప్పుడు ఆ రాజ్యంలో శాంతి భద్రతల రక్షణార్థం మొగలు పరిపాలన క్రిందకి ఖాలిసా గా తెచ్చి తర్వాత ఎంపిక చేసిన వారసుని కి దాన్ని ఇచ్చివేయడమనే సంప్రదాయం ఎప్పటినుంచో మొగలుల్లో ఉంది. జస్వంత్ సింగు రాజ్యానికి భారీ మొత్తాల్ని బకాయిలు చెల్లించాల్సి ఉండడం కూడా జేబు మార్వార్ ను ఖాలిసా గా మార్చడానికి మరో కారణం.

రాథోర్ల ని చల్లబరిచేందుకు జేబు జస్వంత్ సింగు కుటుంబ మహారాణికై రెండు పరగణాలని మాత్రం ఇచ్చాడు. జోధ్‌పూర్ రాథోర్ల వతన్ (homeland) కాబట్టి దాన్ని ఇవ్వడానికి రాణి వాది నిరసన తెల్పినా ప్రయోజనం లేకపోయింది. పైగా మార్వార్ లో మొగలు సైన్యాలు నిధుల కోసం వెదకడం,

రాథోర్ సర్దార్లు ఈ రాజీ కి అంగీకరించలేదు. ఈ
రాజీ రాజ్య (ప్ర)యోజనాల కు భంగకరమని భావించారు.

తన ప్రతిపాదన కి అంగీకరించలేదని
ఆగ్రహించి ఔరంగజేబు ఇద్దరు రాకుమారుల్ని ఢిల్లీలో
సహా నిర్బంధించమన్నాడు. ఇది విని రాథోర్లు ఒక
రాకుమారుని తో ఆగ్రా నుంచి తప్పించుకు బయటపడ్డారు.
అతన్ని అజిత్ సింగ్ గా జోధ్పూర్ లో కిరీటధారణ చేశారు.
ఔరంగజేబు జోధ్పూర్ ను ఆక్రమించాడు. దుర్గాదాస్
అజిత్ సింగ్ తో సహా మేవార్ పారిపోగా రాణా అతన్ని
రహస్యస్థావరం లో ఉంచాడు.

ఇందర్ సింగ్ కు రాథోడ్ల ప్రాముఖ్యత
లేదన్న వాస్తవాన్ని జేబు అంగీకరించి ఉండాల్సింది.

మేవార్ రాణా రాజ్ సింగ్ జోధ్పూర్ కు
రాఠోర్ వంది సాయ్యం మద్దతిస్తూ 5000 సైన్యాన్ని పంపాడు.
రాజపుత్రుల అంతర్గత వ్యవహారాల్లో (- వారసత్వ సమస్యల
వంటివి) మొగలుల జోక్యం చేసుకోవడాన్ని రాజ్ సింగ్
తీవ్రంగా వ్యతిరేకించినట్లు కన్పిస్తుంది. ఒకప్పుడు మేవార్
సామంతులైన రాజ్యాల్ని మేవార్ నుంచి వేరుచేయ
తలచిన మొగలు యత్నాలని రాజ్ సింగ్ గ్రహించాడు.
దాని అంతా తప్పుగా తానైనికి కాకుండా మాత్రం మొగలులు
మాల్వార్ ను ఆక్రమించిన తరు, జేబు అజిత్ సింగ్
వారసత్వాన్ని నాదనడమే.

దుర్గాదాస్ కు ఆశ్రయం ఇచ్చినందుకు
ఔరంగజేబు మేవార్ పై దండెత్తాడు. మేవార్
సేనలు కొండల్లోకి పోయి గొరిల్లా యుద్ధం మొదలుపెట్టాయి.

మొఘలులు రాజపుత్రుల బానిసత్వమును చేయలేకపోయారు, గెరిల్లా యుద్ధాన్ని ఎదిరించలేకపోయారు. ఈ యుద్ధం తీవ్రంగా విమర్శించబడింది.

ఈ అవమానం నుంచి తప్పించుకోవాలని అక్బరు యువరాజు ఔరంగజేబు కు ఎదురు తిరిగాడు. కాని చివరికి దొంగ ఉత్తరాల ద్వారా ఔరంగజేబు ఈ గండం గట్టెక్కాడు.

మేవార్ యుద్ధం ఔరంగజేబు కు ఇప్పుడు ద్వితీయ అంశం అయ్యింది. ఔరంగజేబు రాణా జగత్ సింగ్ తో సంధి కుదుర్చుకున్నాడు. ఈ ఒప్పందం ప్రకారం జిజియా కు బదులుగా కొన్ని పరగణాలు మొఘలులకు ఇవ్వాల్సి వచ్చింది. అజిత్ సింగ్ కు మద్దతు ఇవ్వరాదని, విధేయతగా ఉంటామని చెప్పడంతో జగత్ సింగ్ కు 5000 మన్సబ్ ఇచ్చాడు. అజిత్ సింగ్ వయసుకు వచ్చాక అతనికి మన్సబు, రాజ్యం ఇవ్వబడతాయి.

ఈ ఒప్పందం, అజిత్ సింగ్ విషయంలో చేసిన ప్రమాణం ఏ రాథోడ్ లకు సంతృప్తి కలిగించలేదు. 1698 లో అజిత్ సింగ్ రాజు గా గుర్తించబడేవరకూ యుద్ధం కొనసాగింది. కాని మొఘలులు రాజధాని జోధ్‌పూర్ మీద వారి నియంత్రణ కోల్పోయేందుకు నిరాకరించారు. మేవార్ రాణా కూడా తన పరగణాలు కొన్ని మొఘలులు తీసుకోవడం పట్ల అసంతృప్తి గానే ఉన్నాడు.

మార్వార్, మేవార్ లతో ఔరంగజేబు విధానం ఘోర తప్పిదం, పైగా అది మొఘలులకు ఎట్టి

లాభం చేకూర్చలేదు. మరో వైపు ఈ రాష్ట్రాలలో మొగలుల ఓటమి మొగలు సైన్యాల ప్రతిష్ఠ ని దెబ్బతీసింది. 1680's సమయం లో రాజపుత్రులతో మొగలుల సంబంధాలు బలహీన పడ్డింది. అప్పటికే మంచి నమ్మకస్తులైన చిరకాల తరాలుగా మిత్రుల కి మొగలుల మద్దతు యొక్క స్థిరత్వం పై సందేహాలు మొదలయ్యాయి. ఔరంగజేబు ఆశయాల పై అనుమానాలు రేకెత్తాయి.]